శ్రీ

# మహాభారతము

## వచనము

## అశ్వమేధ పర్వము

దేవా! హరిహరనాథా! వైశంపాయనుడు జనమేజయ మహారాజును జూచి యిట్లనెను. జనమేజయమహారాజా! ధర్మరాజు భీష్మునకు తిలోదక కర్మమును చేసి ధృతరాష్ట్రునిముందు పెట్టుకొని గంగానదీ తీర ప్రదేశమందు మిక్కిలి దుఃఖాన్నిగల మనస్సుగలవాడై కన్నీరు కార్చుచు వాడి బాణముచేత కొట్టబడిన ఏనుగు క్రిందబడినట్లు ధర్మరాజు నేలమీద వ్రాలెను. కృష్ణుడు పట్టుకొమ్మని చెప్పగా భీముడు, క్రిందపడకుండునట్లుంగా ధర్మరాజును పట్టుకొనెను. భీముడు ధర్మరాజును పట్టుకొని తనపైనున్న వస్త్రమును భూమిమీద పరిచి ఆ వస్త్రముమీద ధర్మరాజును పండుకొనబెట్టెను. అర్జుననకుల సహదేవులకు మనస్సులయందు భీతి కలిగి ధర్మరాజు చుట్టును కూర్చుండిరి. కృష్ణుడు తగు వాక్యములను చెప్పి ధర్మరాజునకు దుఃఖ శాంతిని జేసెను. ధృతరాష్ట్రుడు ధర్మరాజు దగ్గరకు వచ్చి కూర్చుండి ధర్మరాజును చూచి యిట్లనెను. ధర్మరాజా! నీవు రాజధర్మము వలన న్యాయమగు యుద్ధముచేసి ఆ యుద్ధమందు సకల శత్రువులను సంహరించి భూమిని తీసికొంటివి. అందుకు విచారింపవలసిన పని లేదు. గాన ధర్మరాజా! లేచి నీ తమ్ములతో కలిసి రాజ్యము ననుభవింపుము. ఇది విచారించుటకు తగిన సమయముకాదు. నీ విచార

మునకు కారణమేమో తెలియకున్నది. విదురుడు చెప్పిన మంచి మాటలను నేను వినకుందున దుర్యోధనుని దురాలోచన ప్రకారము నేను ప్రవర్తించి ధర్మమార్గమును విడిచినందున యింత చేటు కలిగెను. గాంధారియు నేనును దుఃఖసముద్రమందు మునిగియున్నాము. మాయిద్దరినిచూచి విచారింపుడు. అని ధృతరాష్ట్రుడు చెప్పగా ధర్మరాజు విని ఊరకుండెను. కృష్ణుడు ధర్మరాజును జూచి యిట్లనెను.

ధర్మరాజా! బంధువులు విచారించిన యెడల మృతులైన వారికి దుఃఖము సంభవించును, నీదాయాదులగు వారు యుద్ధమందు చచ్చి పుణ్యలోకములకు పోయిరి. వారికొరకు దుఃఖింపకూడదు. విచారించినను చచ్చినవారు మరలి రాజాలరుగదా! ధర్మరాజా! నీవు వినదగిన ధర్మముల నన్నిటిని భీష్మునివలన వింటివి. గనుక దుఃఖమును విడువుము, మూఢునివలె దుఃఖించుట నీకు తగదు. నీవు విచారించు నప్పుడు వ్యాసనారదాది మునులు నీకు బుద్ధి చెప్పియుండిరి. వారి వాక్యముల నైనను తలచుకొనుము, మిక్కిలి దీక్షతో గూడిన గొప్పయజ్ఞములను చేయుము. సకలదేవతలును తృప్తిబొందునట్లు మిక్కిలి భక్తిపూర్వకముగా పూజింపుము. భూమియందుగల సకల ప్రజలను రక్షింపుచుండుము, బంధువులను పోషించుచు సంతోషింపచేయుము. సర్వదా అతిథిపూజలు చేయుచుండుము. అని కృష్ణుడు చెప్పగా ఆమాటలన్నిటిని ధర్మరాజు విని దగ్గరనుండు వ్యాసునిజూచి యిట్లనెను. మహాత్మా! వ్యాసమునీంద్రా! నీయొక్క దయా ప్రేమలు నాయందు సర్వదా అధికముగానుండును. నన్ను మీరు అనేక విధములచేత రక్షించితిరి. ఇకమీద నేను యరణ్యమునకు పోవుటకై యనుజ్ఞను యిచ్చిన యెడల నాకుసంతోషముగానుండును. నా తాతయగు భీష్ముని చంపితిని, నా యన్నయగు కర్ణుని చంపితిని

పాపాత్ముడగువాడు అడవికి పోయినను శాంతము కలుగనేరదు. మహాపాపము యెట్లు నశింపగలదో అట్టి విధానమును నాకు నిశ్చయించి చెప్పుమని యడుగగా ధర్మరాజును చూచి వేదవ్యాస మునీంద్రుడు యిట్లనెను.

ధర్మరాజా! మేము అందరము మీకు జెప్పినవాక్యములు యేటినీటియందు కలిసినట్లు చెడిపోయెను. మీబుద్ధి యందైనను వివేకము కలుగకపోయెను. ఒకరిని చంపుటకు మనుష్యుడు కర్త గాడు. ఈశ్వరుని యేర్పాటుచేత మనుష్యుడు పుణ్యపాపములను చేయుచున్నాడు. గనుక మీ మనస్సున మీకు పాపము కలుగుచున్నదని సంశయము కలిగియున్నయెడల ఆ పాపమును యజ్ఞ దానములచే పోగొట్టుకొనవచ్చునుగదా! నీవు మిక్కిలి యెక్కువగు దక్షిణతో అశ్వమేధయజ్ఞమును చేయుము. అందువలన మీచిత్తమందు గల పరితాపమంతయు నశింపగలదు. రఘురాముని వలెను పురూరవ భరత మహారాజులవలెను దానములను చేయుము. దానములు చేయుటచేత సకలపాపములును నశించి చిత్తశాంతి కలుగును. అని వ్యాసమునీంద్రుడు చెప్పగా ధర్మరాజు యిట్లనెను.

మహాత్మా! వ్యాసమునీంద్రా! రాజుచేసిన పాపములన్నియు అశ్వమేధయజ్ఞము చేసినయెడల నశింపగలవని నేను వినియున్నాను. నీవు చెప్పినప్రకారము సకలవిధములచేతను ప్రీతిపూర్వకముగా అశ్వమేధయజ్ఞమును చేసెదను అని ధర్మరాజు చెప్పెను. మహాత్మా! వ్యాసమునీంద్రా! ఒక విన్నపము చేసెదను. అధికమగుదక్షిణలతో అశ్వమేధయజ్ఞమును ఆచరింపుమని మీరు స్పష్టముగా సెలవిచ్చితిరి. అందుకు నాకు ధనములేదు. యుద్ధమందు చచ్చిన రాజుల యొక్క భార్యలు, పిల్లలు మిక్కిలి దుఃఖింపుచుండిరి. గనుక స్త్రీలవలన ధనమును అపహరింపరాదు. ఇదివరకు దుర్యోధనుడు

నాతో విరోధమువలన అనేకరాజులను సైన్యమును చేకూర్చుకొని ధన వ్యయముచేసి బొక్కసమును, భూమిని పాడుచేసెను. ఆకారణము వలన నేను ధనహీనుడనైతిని. మరియొకవిధముచేత ధనము సంపా దించు ఉపాయము కనపడలేదు. ఏపనిచేయుటకును తోచక యున్నాను. గనుక యిటువంటి నేను యేకార్యము చేయవలెనో మీరు తెలుపవలెను. అని ధర్మరాజు చెప్పగా వేదవ్యాసమునీంద్రుడు పరమసంతోషముతో ధర్మరాజును జూచి కొంచెము సేపు యోచించి యిట్లనెను. ధర్మరాజా! పూర్వము మరుత్తుయను రాజు యజ్ఞము చేసి అధికమగు ధనరాసులను బ్రాహ్మణుల కిచ్చెను. ఆధనములు ఆ బ్రాహ్మణులకు అధికమగుటచేత కావలసిన ధనము నుంచుకొని తక్కిన ధనములను మంచి స్థలమందు నిధిగా పూడ్చిపెట్టిరి. ఆ బ్రాహ్మణులందరును యీనిధి నెవరు కనిపెట్టియుందురో అందుండు ధనము వారి కగునని చెప్పిరి.

ధర్మరాజా! ఆమహానిధిని తెచ్చి నీ యిష్టప్రకారము ఖర్చు చేసుకొనుము. అని వ్యాసమునీంద్రుడు చెప్పగా ధర్మరాజు విని యిట్ల నెను. మహాత్మా! వ్యాసమునీంద్రా! అంతబంగారమును మరుత్తుడెట్లు సంపాదించెనో చెప్పుమని యడుగగా వ్యాసుడిట్లనెను. ధర్మరాజా! మరుత్తుయొక్క పుణ్యచరిత్రము వినుటవలన మేలుకలుగును. గనుక చెప్పెదను వినుము. కృతయుగమందు దండనీతిశాస్త్రమును ప్రవర్తింప జేసిన మను మహారాజునకు ప్రజానియను కొడుకు పుట్టెను. ఆ ప్రజానికి యిక్ష్వాకుడు పుట్టెను. ఇక్ష్వాకునకు నూర్గురు కొడుకులు పుట్టిరి. వారిలో మొదటివాడు వింశుడు, అతనికి వివింశకుడు పుట్టెను, వానికి పదిహైదుగురుకొడుకులు పుట్టిరి. వారిలో పెద్దవాడు ఖనినేత్రుడు. అతనికి మిక్కిలి బలశౌర్యములు కలిగి, కార్యముల యందు సమర్థుడై తన తమ్ముల పదునలుగురితో స్నేహము గలిగియుండెను

వారిని తొలగించి రాజ్యము గ్రహించెను. ఖనినేత్రుడు మంత్రులతో విరోధము కలిగి పెద్దలను అవమానించి, జనులను కష్టపెట్టి, దొంగలను చేర్చుకొని, ప్రజలధనములను కొల్లపెట్టించుచుండెను. వాని మిత్రులందరును యోచించి వానిని రాజ్యమునుండి తొలగించి వాని పుత్రుడగు కరంధమనుడు అనువానికి పట్టాభిషేకముచేసిరి. కరంధమనుడు తండ్రికి జరిగిన కీడు తెలుసుకొని సత్యధర్మవంతుడై ధర్మమార్గముచేత రాజ్యమును పరిపాలింపుచు మంత్రులు మొదలగు సకలజనులను సంతోషపరచు చుండెను. ఆ కరంధమనుడు చక్కగా రాజ్యమును పరిపాలింపుచు తన సకలధనములను బ్రాహ్మణులకు దానములు చేయుచు క్రమముగా దరిద్రుడాయెను. అట్టి ధనహీనత చేత కరంధమనుని సేనలు నశించెను. శత్రువులందరును సైన్యములతో వచ్చి కరంధమనుని ఓడించి రాజ్యమును తీసుకొనిరి.

కరంధమనుడు తనస్నేహితులను తీసికొని అడవికిబోయి మునులకు ఆశ్చర్యమును కలిగించు గొప్ప తపస్సుచేసెను. ఆతపో మహిమవలన కరంధమనుని యెదుట సైన్యములును, గుఱ్ఱపుదండులును, ఏనుగుల గుంపులును, రథములును, భటులును, బంగారు రాసులను కనబడి నిలిచియుండెను. కరంధమనుడు సైన్యబల ధనబలములు గలవాడై సైన్యములను నడిపించుకొనిపోయి తనశత్రువులనందరిని సైన్యసమేతముగా చంపి కొందరిని అడవిపాలు చేసెను. అతడెక్కువగా శత్రువులను కొట్టినందులకు కరంధమనుడని పేరుగలిగెను. పిమ్మట అతడు రాజ్యమును తీసికొని దయాధైర్యములు గలవాడై ధర్మముతప్పక రాజ్యమును పరిపాలించెను. పిమ్మట అతడు మనోనిగ్రహ, యింద్రియనిగ్రహ సత్య, పరిశుద్ధి మొదలగు మంచి గుణములుగలవాడై తనతపోబలమువలన అంగీరస మహామునిని రప్పించుకొని అనేకములగు అశ్వమేధ యజ్ఞములను చేసెను. కరం

దమనుడు చేసిన యజ్ఞములకు అంగీరస మహాముని ఉపద్రష్టగా నుండెను. (యజ్ఞములుచేయించు ముఖ్యయాజకుడు ఉపద్రష్టయనబడును) ధర్మరాజా! కరందమను డనేకఅశ్వమేధ యజ్ఞములనుచేసి అంగీరస మహామునిని ఉపద్రష్టనుగాచేసి ప్రకాశించెను. ఆయాంగీరస మహాముని పుత్రుడే బృహస్పతియని తెలియవలెను.

## వేదవ్యాస మునీంద్రుడు ధర్మరాజునకు మరుత్తుని చరిత్రము చెప్పుట

ధర్మరాజా! కరందమనుని మనుమడే మరుత్తు యనబడును. మరున్మహారాజు మిక్కిలి కీర్తివంతుడై విష్ణుదేవునితో సమానుడై మిక్కిలి బలవంతుడై, ధర్మరూపమును యెరిగినవాడై, అగ్నిహోత్రముతో సమానమైన తేజస్సుగలవాడై, మహదైశ్వర్యము కలవాడుగా ప్రకాశించుచు అశ్వమేధ యజ్ఞమును చేయదలచి అందుకు కావలసిన బంగారుకుండలను మంచిపదార్థముల నుంచుటకు బంగారు మయమైన అనేక వేల పాత్రలను ఏర్పరచెను. హిమవత్పర్వతమందు ప్రకాశమానముగా యజ్ఞముచేయుటకు అనేకములగు గృహములను కట్టించెను. మరుత్తుడు హిమవత్పర్వతమందుగల చరియలయందు మిక్కిలి మనోహరముగా అశ్వమేధ యజ్ఞమునుచేసి సకల బ్రాహ్మణులకును తృప్తికలుగునట్లు బంగారు కుప్పలను దానముచేసెను. మరుత్తును, బ్రాహ్మణులకు బంగారు మయములగు కడవలు, తప్పెలలు, చెంబులు, పళ్ళెములు, మొదలగు అనేకకోట్లు పాత్రలను దానము చేసెను. ధర్మరాజా! మరుత్తునికీర్తియు, ధనములునుయిటువంటివని తెలియచెప్పితిని. అంత ధన మా మరుత్తునకెట్లు కలిగినది? ఆతడుచేసిన యజ్ఞపద్ధతిని చెప్పెదను వినుము. మనువంశమందుపుట్టి ప్రకాశించిన కరందము డంగీరసమహామునిని ఉపద్రష్టగా చేసికొని అనేక అశ్వమేధ యజ్ఞములను చేసెనుగదా! ఆకరంధమునకు

మిక్కిలి కీర్తిగలవాడై రాజ్యమును పరిపాలించి తానుకోరుసమయ్య ముున ఆదేహముతోనే పుణ్యలోకమునకు పోయెను ఆకరంధమముని పుత్రుడు అవిక్షిఅనుపేరుగలరాజు తనతండ్రి రాజ్యమునకు పట్టాభి షిక్తుడై తనతండ్రివలెనేధర్మమార్గముచేత ప్రజాపరిపాలనము చేసెను. అవిక్షియను రాజుయొక్క కుమారుడే మరుత్తు. అతడు తండ్రిరాజ్య మునకు పట్టాభిషిక్తుడై కృపగలిగి రాజదండనీతి శాస్త్రమునుచదివి దాతయై ధర్మమార్గమును అనుష్టించుచు దేవేంద్రునితో విరోధము చేత దేవేంద్రుని లక్ష్యపెట్టక యుండెను. దేవేంద్రుడును మరుత్తుని యందు విరోధముగలిగి మరుత్తుడు తనకంటె అధికుడగునని తలచి తనమంత్రియగు బృహస్పతి యింటికివెళ్ళి బృహస్పతిని జూచి యిట్లనెను.

మహాత్మా! బృహస్పతీ! మరుత్తు డశ్వమేధయజ్ఞమును చేయదలచి యున్నాడు. ఆయజ్ఞముతనచేత చేయించుటకు నీదగ్గరకు వచ్చి నిన్ను ఉపద్రష్టగా కోరగలడు. గనుక నీవు మరుత్తుచేయు యజ్ఞమునకు ఉపద్రష్టగా నుండుటకు సమ్మతింపకుము, దేవతలకు రాజగు నాకు యజ్ఞము చేయింపుచుండుము. నీవు ఒక మనుష్యునకు యజ్ఞము చేయించుచుండినయెడల నీకు గౌరవహాని యగునుగదా! గనుక మరుత్తుని యజ్ఞమునకు నీవు ఉపద్రష్టవైనయెడల ఇకమీదట నన్ను విడువవలయును. నేను కావలసినయెడల మరుత్తునిచేత యజ్ఞ మును చేయింపకుండుము. విశేషముగా చెప్పుటవలన ప్రయోజనము లేదని ముఖ్యమైన మాటను చెప్పితివి. అని దేవేంద్రుడు చెప్పగా ఆమాటలకు బృహస్పతి నవ్వి దేవేంద్రుని జూచి యిట్లనెను,

మహాత్మా! దేవేంద్రా! నిన్ను నేను ఎరుగనా? ఇంత దూరము నాతో నొక్కి చెప్పవలసిన పనిలేదు, నీవు సర్వలోకము లకు ప్రభుడవై యున్నావు. అట్టి నీకు నేను గురుడనై యుంటిని, నీ

గురువగు నేను యితరుని నెప్పటికైనను ఆశ్రయింతునా ? గనుక నేను మరుత్తుని యజ్ఞమును చేయించుటకు వెళ్ళను. అగ్నిహోత్రము చల్లపడినను, సూర్యునకు మైలపోకినను, భూమి తలక్రిందైనను, మేరుపర్వతము కదలినను, నే చెప్పిన మాట తప్పను గనుక నేను మరుత్తునిచేత యజ్ఞము చేయించుటకు ఉపద్రష్టను కానని సత్యముగా నమ్ముము. అని బృహస్పతి చెప్పగా దేవేంద్రుడు సంతోషించి తన గృహమునకు వెళ్ళెను. ఈ వృత్తాంతము నంతయు మరుత్తు డెరిగి బృహస్పతి దగ్గరకు పోయి నమస్కరించి బృహస్పతిని జూచి యిట్లనెను.

మహాత్మా! బృహస్పతీ! ఇదివరకే నేను నీ దగ్గరకు వచ్చి యజ్ఞము చేయించుటకు నాకు ఉపద్రష్టగా నుండుమని అడిగితిని. అందుకు నీవు సమ్మతించి యజ్ఞప్రయత్నము చేయుమని నాతో చెప్పి యుంటివి. నీవు చెప్పినప్రకారము అశ్వమేధ యజ్ఞమునకు కావలసిన పదార్థము లన్నిటిని యేర్పరచి సిద్ధముచేసి యున్నాను. గనుక నాచేత యజ్ఞము చేయించుటకు రమ్ము అని మరుత్తుడు చెప్పగా అతనిని చూచి దేవగురుడగు బృహస్పతి యిట్లనెను. మరుత్తుడా! దేవేంద్రుడు యజ్ఞము చేయదలచి తనకు ఉపద్రష్టగానుండి యజ్ఞము చేయించుటకు నన్ను యిదివరకే కోరియున్నాడు. గనుక నీచేత యజ్ఞము చేయించుటకు నే నెట్లు రావచ్చును, అని బృహస్పతి చెప్పగా మరుత్తుడు మరల యిట్లనెను. మహాత్మా! బృహస్పతీ! మాతాతయగు కరంధమనమహారాజునకు నీతండ్రియగు ఆంగిరసమహాముని ఉపద్రష్టయై అనేక అశ్వమేధయజ్ఞములను చేయించియున్నాడు. ఆప్రకారమే నీవును నాయందు కృపనుంచి నాచేత యజ్ఞమును చేయించుము. అని చెప్పగా బృహస్పతి యిట్లనెను. మరుత్తుడా! దేవతలచేత యజ్ఞములను చేయించుచున్న నేను మనుష్యుడవైన

నీచేత యజ్ఞము చేయించుటకు సమ్మతింపను. ఇది సత్యమగును గనుక ఇక విశేషముగా మాటలాడక వెళ్ళుము ఎవనినైన మరి యొకని వెదకి సంపాదించుకుని అతనిచేత యజ్ఞము చేయించు కొనుము. నేను ఖండితముగా రావడములేను. అని బృహస్పతి చెప్పగా ఆమాటలను మరుత్తుడు విని సిగ్గుగలవాడై తిరిగి వచ్చుచుండగా నారదమహాముని కనబడెను. మరుత్తుడు నారదునకు భక్తిపూర్వక ముగా నమస్కరించి నిలిచి యుండెను. నారదుడు మరుత్తుని జూచి యిట్లనెను. మరున్మహారాజా! నీవు యెక్కడికి బోయి వచ్చు చున్నావో చెప్పుము. నీముఖము చిన్నబోయి యున్నది. ఇట్లుండు టకు కారణమేమి? ఏవిధముచేతనైనను నీదుఃఖమును పోగొట్టగలను గనుక నీవు దుఃఖించుటకు కారణమును చెప్పుమని యడుగగా మరుత్తు డిట్లనెను.

మహాత్మా! నారదమునీంద్రా! నేను అశ్వమేధయజ్ఞమును చేయదలచి బృహస్పతిని ఉపాధ్యాయునిగా కోరుటకు బృహస్పతి దగ్గరకు పోతిని. ఆబృహస్పతి నన్ను చూపించి నాకు ఉపాధ్యాయు డగుటకు సమ్మతింపలేను. ఇట్లు బృహస్పతిచేత అవమానింపబడితిని. ఇక నాబ్రతుకువలన ప్రయోజనమేమని చెప్పగా నారదు డిట్లనెను. మరుత్తుడా! బృహస్పతి నీకు ఉపాధ్యాయుడు గాకున్నను, నీకు లోపములేదు. చెప్పెదనువినుము. బృహస్పతి తమ్ముడగు సంవర్తు డను యోగీశ్వరుడున్నాడు. సంవర్తుడు బృహస్పతిచేత తిరస్కరింప బడి సకలమును విడిచి మిక్కిలి గాఢమైన వైరాగ్యముగలవాడై దిగంబరుడై లోకమందు సంచరించుచున్నాడు. గనుక ఆసంవర్తముని దగ్గరకు వెళ్ళి ప్రార్థించినయెడల సంవర్తుడు నీకు ఉపాధ్యాయుడై నీచేత యజ్ఞము చేయించగలడు. అని నారదుడు చెప్పగా మరుత్తుడు సంతోషించి నారదునిజూచి యిట్లనెను.

మహాత్మా! నారదమునీంద్రా! సంవర్తుడిపుడెక్కడనుండునో యెవరు వెళ్ళి పిలిచిన, నాకు ఉపాధ్యాయుడగుటకు సమ్మతించునో చెప్పుమని యడుగగా నారదు డిట్లనెను.

మరుత్మహారాజా! సంవర్తుడను యోగీశ్వరుడు కాశీపట్టణమందు సర్వదా నివసించియుండును. అతడు పిచ్చివానివలె దిగంబరుడై ఆ కాశీపట్టణమును విడువక తిరుగుచుండును. సంవర్తుని యెరుంగు ఉపాయమును చెప్పెదనువినుము. నీవు ఇపుడు కాశీపట్టణమునకు వెళ్ళి ఒక పీనుగును సంపాదించుకొని ఆ పీనుగును పట్టణపు ముఖద్వారమందు పెట్టుకొనియుండుము. సంవర్తుడువచ్చి ఆ పీనుగును చూచిన వెంటనే గిరున వెనుకకు తిరిగి పరుగెత్తును. పరుగెత్తువాడు సంవర్తుడని తెలిసికొని ఆయన వెనుకనే భక్తిపూర్వకముగా వెళ్ళుము. ఎక్కడైనను ఆయన ఒంటరిగా నున్నపుడు వినయపూర్వకముగా సాగిలపడి నమస్కరించి శరణుజొచ్చితినని చెప్పుము. అపుడు సంవర్తుడు నాగురుతును నీకు చెప్పినవారు యెవరని అడిగినయెడల నారదుడు చెప్పెనని చెప్పుము. ఆ నారదు డిపు డెక్కడున్నాడని అడిగినయెడల నారదుడు నీగురుతు చెప్పి అగ్నిలో ప్రవేశించెనని సంశయింపక చెప్పుము. అని నారదుడు చెప్పగా మరుత్తుడు సంతోషించి కాశీపట్టణమునకు వెళ్లెను.

## మరుత్తుడు సంవర్తుని దన యజ్ఞమునకు ఉపద్రష్టగా వరియించుట

ధర్మరాజా! మరుత్తుడు కాశీపట్టణమునకు వెళ్ళి ఒకదిక్కులేని పీనుగు పడియుండగా ఆ పీనుగును పట్టించుకొనిపోయి కాశీపట్టణపు ముఖద్వారమందు పెట్టుకొని కనిపెట్టుకొని యుండెను. ఒక పిచ్చివాడు దిగంబరుడుగావచ్చి ఆపీనుగును చూచి బెదరిన పశువువలె గిర్రుక్కున వెనుకకు తిరిగి పరుగెత్తి వెళ్ళెను. మరుత్తు డాఘర్మ

గెత్తువాడు సంవర్తుడని తెలిసికొని సంవర్తుని వెంబడించి వెంటనే పరుగెత్తెను. బహుదూరమట్లు పరుగెత్తినపిమ్మట సంవర్తుడు వెనుక ప్రక్కచూచి తన వెంబడి పరుగెత్తివచ్చి మరుత్తునిమీద దుమ్ముజల్లి ఉమ్మివేసెను. శత్రువువలె సంవర్తుడు ప్రవర్తించి పరుగెత్తుచుండగా మరుత్తుడు నిలువక అసూయపడక వినయముతో నమస్కరించుచు సంవర్తుని వెంబడించుకొని పరుగెత్తెను. సంవర్తుడు బహుదూరమునకు పరుగెత్తి మనుష్యులులేని ప్రదేశమునకు పోయి ఒక మర్రిచెట్టు నీడక్రింద కూర్చుండెను. సంవర్తుడట్లు శ్రమజెంది కూర్చుండగా అతని సమీపమునకు మరుత్తుడు వెళ్ళి సాగిలపడి నమస్కరించి నిలిచి యుండెను. సంవర్తమహాముని శ్వరుడు మరుత్తుని జూచి యిట్లనెను.

మహారాజా! నన్ను నీకు దెలిపి, నిన్ను నాదగ్గరకు పంపించిన వాడెవడో వానిపేరు నాకు చెప్పుము. నీవు ఆ మనుష్యుని పేరు నిశ్చయముగా చెప్పిన యెడల నీ అభీష్టము సిద్ధింపగలదు. అబద్ధముచెప్పితివేని నీశిరస్సు నూరువ్రక్కలై పడిపోగలదు. గనుక వానిపేరు నిశ్చయముగా చెప్పుమని యడుగగా నారదుడు మిమ్మును నాకు తెలిపెనని మరుత్తుడు నిశ్చయముగా చెప్పెను. సంవర్తుడు నారదు డిపుడెక్కడ యేవిధముగా నుండునో తెలుపుమని మరుత్తునడిగెను. అపుడు మరుత్తు డిట్లనెను. మహాత్మా! సంవర్తమునీంద్రా! నారదుడు మిమ్మును నాకు తెలిపినపుడే అగ్నిప్రవేశమాయెను. అని మరుత్తుడు చెప్పగా ఆ మాటను సంవర్తుడువిని మరుత్తుని ముఖముచూచి యిట్లనెను. మహారాజా! నీవు నన్ను చూచుటకై వచ్చిన పనియేదియో చెప్పుమని యడుగగా మరుత్తుడిట్లనెను. మహాత్మా! సంవర్తమునీంద్రా! నేను చేయదలచిన అశ్వమేధ యజ్ఞమునకు మీరు ఉపాధ్యాయులుగా నుండవలయును. నేను మరుత్తను రాజును. నా తాతయగు కరంధమునకు మీ తండ్రియగు అంగిరస మహాముని ఉపాధ్యాయులుగా

నుండి అనేకములగు అశ్వమేధ యజ్ఞములను చేయించియున్నాడు. నేను ఆ కరంధమనుని మనుమడననుదును. అని మరుత్తుడు. చెప్పగా సంవర్తుడు మిక్కిలి సంతోషముగలవాడై యిట్లనెను. మరున్మహారాజా! నీవు వచ్చిన కార్యమును చెప్పితివి. నా వృత్తాంతము చెప్పెదను వినుము. మా యన్నయగు బృహస్పతి తన తపోబలమువలన నన్ను అవమాన పరచినాడు. నేను అవమానపడి నా గృహపదార్థములను ధనమును అన్నిటిని విడిచి దిగంబరుడనై పిచ్చిపట్టినవానివలె యిట్లు తిరుగుచున్నాను. నావంటి. వీనుగు నీకు ఉపాధ్యాయుడుగా నున్నయెడల యజ్ఞముచేత నీకు యెంత మాత్రము పుణ్యముగలుగునో తెలియదు గనుక మహాత్ముడగు మాయన్నయైన బృహస్పతిని ఆశ్రయింపుము. నేనే కావలయునని నీవు కోరినయెడల చెప్పెదనువినుము. బృహస్పతి నన్ను పంపించిన యెడల నేను వచ్చి నీ యజ్ఞమునకు ఉపాధ్యాయుడనైయుండి నీచేత యజ్ఞముచేయించెదను. గనుక నీవు శీఘ్రముగా మా అన్నదగ్గరకువెళ్ళి ఆయన అనుజ్ఞను తీసికొనుము. అని సంవర్తుడు చెప్పగా మరుత్తుడు యిట్లనెను.

మహాత్మా! సంవర్తమునీంద్రా! నేను యిదివరకే బృహస్పతి దగ్గరకువెళ్ళి అతనికి కృపకలుగునట్లు ప్రార్థించినాను. నా ప్రార్థనను లక్ష్యపెట్టక బృహస్పతి తాను దేవతలకు యజ్ఞములను చేయించుచు మనుష్యులకు యజ్ఞములు చేయించనని చెప్పినాడు. నాతో దేవేంద్రుడు విరోధము కలిగియుండును. ఆ దేవేంద్రుని మాటలువిని బృహస్పతి నన్నుధిక్కరించి అవమాన పరిచెను. బృహస్పతి దగ్గరకు నేను యిపుడు మరల నేమని వెళ్లుదును? నీమహాత్మ్యమువల్లన దేవేంద్రుని కంటె అధికుడనై యుండవలెననికోరి నమ్మియున్నాను. గనుక నన్ను మీరనుగ్రహించి నాకు మీరు ఉపాధ్యాయులుగా నుండవలయును. నన్ను కృపచేత రక్షింపవలయును. అని మరుత్తుడు ప్రార్థింపగా

అందుకు సంవర్తుడు సమ్మతించి అట్లగుగాకయని చెప్పి మరల మరుత్తుని జూచి యిట్లనెను.

మరున్మహారాజా! నన్ను యిపుడు ఉపాధ్యాయునిగ నుండుటకు వేడుకొంటివి. అందుకు నేను సమ్మతించితిని. పిమ్మట నీవు చపలబుద్ధి గలిగియుంటివేని అప్పుడే నీకు శాపమిచ్చెదను. గనుక స్థిరబుద్ధిగలవాడవై నాచే తప్పక యజ్ఞము చేయించుకొనవలయును. నీ యజ్ఞమునకు ఉపాధ్యాయుడనై యజ్ఞము చేయించుచుండగా దేవేంద్ర బృహస్పతు లిద్దరును మనమీద కోపించుకొని తమకోపమును జూపుదురు. నీవు చంచల బుద్ధిగలవాడవై నాచేత యజ్ఞమును చేయించుకొనని వాడవైన యెడల నాశాపము వలన నీకు కీడు కలుగును. ఇది యంతయు నిశ్చయించి మంచి స్థిరమైన ధైర్యము కలవాడవు గావలయును గనుక చక్కగా యోచించుకొనుము. అని సంవర్తుడు చెప్పగా సంవర్తునిజూచి మరుత్తుడిట్లనెను.

## సంవర్తుడు మరుత్తుని యజ్ఞమునకు ఉపద్రష్టయగుట

మహాత్మా! సంవర్తమునీంద్రా! నాయందునీకు కృపగలిగినది. నాకేవిచారమును కలిగియుండదు. దేవేంద్ర బృహస్పతులేగాక శివుడువచ్చి నన్ను ద్వేషించినను, నామనస్సు చలింపనేరదు. మీస్నేహమును నేను విడిచినయెడల సూర్య చంద్ర నక్షత్ర మేరుపర్వతములుండు పర్యంతము నాకు పుణ్యలోకగతిలేక పోవును అని పరిశుద్ధమనస్సుతో మరుత్తుడు ప్రతిజ్ఞచేయగా సంవర్తుడువచ్చి మరుత్తునితో నిట్లనెను.

మరున్మహారాజా! దేవేంద్రునికంటె నిన్ను అధికధనవంతుని చేసి పిమ్మట నీచేత యజ్ఞము చేయించెదను. నీవు ధనవంతుడవగుట యెట్లంటివేని చెప్పెదను వినుము. హిమవత్పర్వతమునకు ఉత్తరపు తట్టు ముంజవంతమను ఒక పర్వతముకలదు. ఆపర్వతమందు శివుడు

పార్వతీదేవితో గూడి విహరింపుచుండును. శివుని దేవసిద్ధ గరుడగంధర్వాది సకలభూతములును సేవింపుచుండును. ఆపర్వతమందు నివసించియుండువారలకు ముదిమి చావులును రోగములును కలుగజాలవు. ఆపర్వతమందు సకలవిధములైన పొదలును తీగెలును సర్వకాలముల యందును పుష్పించుచు ఫలించుచుండును. ముంజపర్వతముయొక్క రెండుప్రక్కలయందును బాలసూర్యుని కాంతులవలె ప్రకాశించుచు మంచి పరిశుద్ధమైన బంగారు శిలల సమూహమున్నది. చూచినవారికి ఆశ్చర్యమును కలిగింపుచున్నవి. గనుక శివుని భక్తిచేత ప్రార్థించి శివునియొక్క యనుగ్రహమునుపొంది బంగారుశిలలనుత్రవ్వి మోపులు మోపులుగా కట్టుకొని తీసికొనివత్తము లేచిరమ్ము. ఆ బంగారు మోపులను మోయుటకు అనేకజనులను తీసికొనిరమ్ము. అని సంవర్తుడు చెప్పి అనేకజనులతో మరుత్తుని తీసికొనిపోయి శివుని కృపవలన లెక్కలేని బంగారు మోపులను తీసికొని వచ్చెను. మరుత్తుడు బంగారు మోపుల నన్నిటిని తాను యజ్ఞముచేయదలచిన హిమవత్పర్వత మందుంచెను. మరుత్తుడు మహాధనవంతుడై హిమవత్పర్వత మందు తాను చేయుదలచి యజ్ఞసంబధ భూమినంతయు బంగారుమయము చేయించి తన యజ్ఞభూమికి చుట్టును బంగారుకోటను కట్టించెను. కుండలు మొదలగు క్రియాసాధనము లన్నియు, బంగారము చేత చేయించెను. మంచములు, కుర్చీలు, మేజాలు, పల్లకీలు, పీటలు మొదలగు సకల పదార్థములును బంగారము చేత చేయించెను. హిమవత్పర్వతమందు సకల పదార్థములును బంగారుమయములుగా యేర్పరచి మనుష్యులకు సాధ్యముగాని ఐశ్వర్య విభవములతో అశ్వమేధ యజ్ఞముచేయుటకు మరుత్తుడు ప్రారంభించెను. ఈ వృత్తాంతమంతయు బృహస్పతియెరిగి నానాటికి కృశించి తెల్లనైన దేహము గలవాడై మనోదుఃఖమును పొందియుండెను. అట్టి బృహస్పతిని దేవేంద్రుడు జూచి యిట్లనెను,

మహాత్మా! బృహస్పతీ! నీమనస్సు నిర్మలమైన తెలివిగలిగి యుండెనా? దేవతల బ్రతుకులను విచారించి నడపుచుంటివిగదా! దేవతలు నీకు ఉత్సాహముచేత ప్రీతిగలిగింపుచు బ్రతుకుచున్నారు గదా! అని దేవేంద్రుడు బృహస్పతియొక్క యోగక్షేమములు విచారించునట్లు అడుగగా నీవడిగినవిషయము లన్నియు కలిగియున్న వని బృహస్పతి చెప్పెను. దేవేంద్రుడు మరల బృహస్పతిని జూచి యిట్లనెను. బృహస్పతీ! నీదేహము శుష్కించి తెల్లపోవుచున్నది. నీకు మనోదుఃఖము కలిగించిన నీచులను చెప్పినయెడల అట్టినీచులను శిక్షించెదను గనుక చెప్పుము. అని దేవేంద్రుడు చెప్పగా బృహస్పతి యిట్లనెను.

మహాత్మా! దేవేంద్రా! నాకు దుఃఖమును కలిగించినవా రెవరును లేరు. మరుత్తుడు గొప్ప యజ్ఞమును అతి మనోహరముగా చేయుటకు ప్రయత్నించి యున్నాడు. ఆ మరుత్తునకు నా విరోధియగు సంవర్తుడు ఉపాధ్యాయుడై ఆ యజ్ఞమును చేయింపదలచి యున్నాడని నేనును వినియున్నాను. ఇదియే నాకు గల మనోదుఃఖమునకు కారణము. అది లేకుండునట్లు చేయవలెను. మరుత్తుడు నియమించుకొని ఉపాధ్యాయునిగా ఏర్పరచుకొనిన సంవర్తుని ఆవశ్యముగా యజ్ఞమునకు రాకుండునట్లు తొలగింపవలయును. అని బృహస్పతి చెప్పగా దేవేంద్రుడు తన ప్రక్కనుండు అగ్నిదేవునిచూచి యిట్లనెను. అగ్నిదేవుడా! నీవు మరుత్తుని దగ్గరకు పొమ్ము. మరుత్తుడు యజ్ఞము చేయుటకు ఉత్సాహము కలిగి యున్నాడు. అతని యజ్ఞమునకు బృహస్పతి ఉపాధ్యాయుడై యుండి జరిపించునట్లు ఏర్పాటుచేసి రమ్మని ఆజ్ఞాపించగా అగ్నిహోత్రుడు అట్లేచేసెదనని దేవేంద్రు నితో చెప్పి శీఘ్రముగా మరుత్మహారాజు దగ్గరకు వచ్చెను. అట్లు తనదగ్గరకువచ్చిన అగ్నిదేవుని మరుత్తుడు చూచి ఆశ్చర్యపడి

భక్తితో యెదురుగా వెళ్ళి నమస్కరించి సంవర్తుని పిలిచి అగ్ని దేవునకు పాద ప్రక్షాళనము మొదలగు ముఖ్యములగు ఉపచారము లను నడిపించిరి. అగ్నిదేవుడు కూర్చుండి మరుత్తుని జూచి యిట్లనెను.

## అగ్నిదేవుడు యింద్ర సందేశము మరుత్తునకు యెరిగింప వచ్చుట

మరున్మహారాజా! దేవేంద్రుడు నన్ను నీ దగ్గరకు పంపె నందున దూతనై వచ్చినాను. అని చెప్పగా మరుత్తు డిట్లనెను. అగ్ని దేవుడా! దేవేంద్రుడు సుఖముగా నున్నాడుగదా! అతని దేవతలందరును ప్రీతికలిగించు చుండిరిగదా దేవేంద్రుని మనస్సునకు నాయందు ప్రీతియుండెనా! అని మరుత్తుడు దేవేంద్రుని యోగక్షేమ మును అడుగగా అగ్ని దేవు డిట్లనెను. మరున్మహారాజా! దేవేంద్రుడు సుఖమైయున్నాడు. దేవతలందరును దేవేంద్రునకు ప్రీతిగలిగించు చున్నారు. దేవేంద్రునకు నీయందు మిక్కిలి ప్రీతికలదు. నేను వచ్చిన పనిని చెప్పెదను వినుము. నీవు చేయదలచిన యజ్ఞమునకు బృహ స్పతిని ఉపాధ్యాయునిగా చేసుకొని యజ్ఞము చేయుము. అంతట నీకు దేవత్వము కలిగి ప్రకాశించునట్లు బృహస్పతి చేయువలెను. గనుక బృహస్పతిని ఉపాధ్యాయునిగా గ్రహింపుము. ఇట్లు నీతో చెప్పుమని దేవేంద్రుడు నన్ను పంపినాడని అగ్నిదేవుడు చెప్పగా మరుత్తు డిట్లనెను.

మహాత్మా! అగ్ని దేవా! నేను మొదట బృహస్పతిదగ్గరకు పోయి మిక్కిలి భక్తితో నాయజ్ఞమునకు ఉపాధ్యాయుడవు కమ్మని ప్రార్థించితిని. అందుల కతడు సమ్మతింపక నన్ను యెగతాళిచేసి అవమానించెను. నే నా బృహస్పతి తమ్ముడగు సంవర్తుని ఆశ్ర యించి అతనిని నమ్మించి భక్తితో ప్రార్థించి ఉపాధ్యాయునిగా చేసు

కొంటిని. గనుక నా యజ్ఞమును చేయించుటకు యీ సంవర్తుడే చాలును. ఆ బృహస్పతికి వేయి నమస్కారములనుచేసెదను. అతడు నా కక్కరలేదు. అని మరుత్తుడు చెప్పగా అగ్నిదేవు డిట్లనెను. మరుత్తుడా! బృహస్పతి నీచేత యజ్ఞము చేయించినయెడల నీకు దేవేంద్రుడు మిక్కిలి పుణ్యలోకములను సులభముగా కలిగింపగలడు. అది నీకు మేలగునుగదా! యని అగ్నిదేవుడు మరుత్తునితో చెప్పగా సంవర్త డామాటలువిని కోపించుకొని అగ్నిదేవుని జూచి యిట్లనెను. అగ్నిదేవా! యిట్టిమాట లికమీదట చెప్పినయెడల నాయొక్క వేడి మిగల చూపుచేత నిన్ను చంపెదను. వెళ్ళుము. ఈపనికి నీవు మరల రావద్దుసుమీ! అని సంవర్తమహామునీశ్వరుడు కోపించుకొని చెప్పగా ఆమాటలకు అగ్నిహోత్రుడు భయపడి వెంటనే దేవేంద్రుని దగ్గరకు పోయి యిట్లనెను.

మహాత్మా! దేవేంద్రా! నీవు చెప్పినప్రకారము నేను మరుత్తునియొద్దకు బోయి నీ యజ్ఞమును బృహస్పతిచేత చేయించుకొమ్మని చెప్పితిని. అతడు ధృఢమైన నిశ్చయముకలిగి బృహస్పతిని తాను పిలువగా రాక తనను అవమానించినందున బృహస్పతి తమ్ముడగు సంవర్తునికోరి తెచ్చితినని సంవర్తయోగీశ్వరుడు నాకు ఉపాధ్యాయుడాయెనని నాతో చెప్పి నాకు సంవర్తుని చూపించెను. నేను నిలువక యిట్లంటిని. దేవేంద్రునకు నీవు ప్రీతికలిగించినయెడల నీకు పుణ్యలోకములు సిద్ధించును. గనుక అట్లు చేసినయెడల మంచి కలుగునని మరుత్తునితో చెప్పితిని. మరుత్తుడు సమ్మతింపలేదు. అని అగ్నిదేవుడు దేవేంద్రునితో చెప్పగా దేవేంద్రుడు మరల అగ్నిహోత్రుని చూచి యిట్లనెను. అగ్నిదేవా! మన ఆజ్ఞను మరుత్తు డతిక్రమించెను. నీవు మరల వెళ్ళి మరుత్తునితో దేవేంద్రుడు వజ్రాయుధమును పంపుచున్నాడు. అతని యిష్టప్రకారము బృహస్పతిచేత యజ్ఞమును

చేయించుకొనుము. అతని యాజ్ఞను తప్పితివేని నిన్ను చంపివేయు నని చెప్పుము. అని దేవేంద్రు డగ్నిదేవునిజూచి చెప్పగా అపు డగ్ని దేవుడు దేవేంద్రుని ముఖముజూచి యిట్లనెను. దేవేంద్రుడా ! యిక మీదట నీవు యీ కార్యమునకు యిక్కడకు వచ్చినయెడల నావేడి చూపుచేత నిన్ను భస్మముచేసి చంపెదనని సంవర్త యోగీశ్వరుడు రోషముగలిగి నాతో చెప్పినాడు. గనుక మరుత్తుని దగ్గరకు మరల వెళ్ళుటకు భయపడుచున్నాను, మరియొకనిని పంపించుమని అగ్ని దేవుడు చెప్పగా దేవేంద్రు డిట్లనెను. అగ్నిదేవుడా! నీవు అందరిని దహింపగలవు. అట్టి నిన్ను యితరులు దహింపగలరా! ఇట్లు బీద మాటలను యెందుకు చెప్పెదవు ? అని దేవేంద్రుడు చెప్పగా అగ్ని దేవు డిట్లనెను.

దేవేంద్రుడా ! నీవు మూడులోకములను నిరాటంకముగా పరి పాలింపుచు మొనగాడవై యున్నపుడు నిన్ను వృత్రాసురుడు కొట్టి నీ రాజ్యము నెట్లు తీసుకొనెనో తెలియదా ? గనుక బ్రాహ్మణ బల ముతో, యేబలమును సమానముకాదు. శర్యాతి యజ్ఞమందు అశ్వినీదేవతలకు సోమమును యివ్వవద్దని నీవుచెప్పి యివ్వకుండునట్లు చేసితివి. అపుడు భార్గవచ్యవనమహాముని అశ్వినీదేవతల పక్షముచేరి తన మంత్రబలమువలన సర్వదేవతలను నిన్ను బాధింపజేసిరి. అంతట నీవు కోపించుకొనినతోడనే వజ్రాయుధము తీసుకొని చ్యవన మునీశ్వరుని సాధింపదలచితివి. అందుకు చ్యవనుడు నవ్వుచు నీవజ్రా యుధమును నిన్ను అణచివేసి నిన్ను చంపుటకు ఒక పురుషుని సృష్టించెను. అపుడు నీవు తెలివితెచ్చుకొని చ్యవనునకు శరణుజొచ్చి అశ్వినీదేవతలకు సోమమును కలిగించితివి. గనుక బ్రాహ్మణబలము కంటె అధికమైన బలము యెక్కడనులేదు. అని అగ్నిదేవుడు చెప్పగా దేవేంద్రు డిట్లనెను. అగ్నిదేవుడా ! బ్రాహ్మణబలము మిక్కిలి శ్రేష్ఠ

మైనదని నాకు తెలుసును. అయినను నేను మరుత్తుని కష్టబెట్టుటకు తగుదును. అని దేవేంద్రుడు చెప్పి గంధర్వరాజగు ధృతరాష్ట్రుని పిలిచి యిట్లనెను. ధృతరాష్ట్రా! నీవు శీఘ్రముగా మరుదత్తునిదగ్గరకు బోయి బృహస్పతిచేత యజ్ఞమును చేయించుకొమ్మని చెప్పుము. అందు కతడు సమ్మతించనియెడల దేవేంద్రుడు వజ్రాయుధమును పంపించుననని సంవర్తుడు వినుచుండగా చెప్పవలయును. అని దేవేంద్రుడు చెప్పగా అందుకు గంధర్వరాజగు ధృతరాష్ట్రుడు సమ్మతించి వెళ్ళి సంవర్తునితో కలిసియుండెడి మరుత్తునిజూచి యిట్లనెను.

మరుత్తుడా! నేను గంధర్వరాజునగు ధృతరాష్ట్రుడనెడి పేరు గలవాడను. దేవేంద్రుడు పంపినందున నీదగ్గరకు వచ్చినాను. నేను చెప్పెడిబుద్ధిని వినుము. నీయజ్ఞమునకు బృహస్పతిని ఉపాధ్యాయునిగా చేసుకొనుము. ఇట్లు చేసినయెడల దేవేంద్రునకు ప్రీతియగును. దేవేంద్రునిమాటను అతిక్రమించి నీవు ప్రవర్తించినయెడల దేవేంద్రుడు నీమీాదికి వజ్రాయుధమును పంపగలడు. అందరు వినునట్లుగా సాటించి చెప్పితిని. అని ధృతరాష్ట్రుడు చెప్పగా మరుత్తు డిట్లనెను. మహాత్మా! ధృతరాష్ట్రా! మొదట నేను బృహస్పతిని పిలిచితిని. అతనురాక నన్ను యెగతాళి చేసెను. అంతట నేను సంవర్తుని ప్రార్థించి తెచ్చితిని. బృహస్పతిని పిలుచుట యుక్తపడదు. ఈ సంవర్తునిచేత నేను యజ్ఞమును చేయించుకొననియెడల మిత్రద్రోహము చేసినపాపము నాకు లభింపగలదు. ఈ విషయమును నీవు దేవేంద్ర బృహస్పతి సిద్ధసాధ్యాదులగు వారలందరును యెరిగేయున్నారు. అని మరుత్తుడు చెప్పగా ధృతరాష్ట్రు డిట్లనెను.

మరుత్తుడా! అదిగో! వజ్రాయుధముయొక్క భయంకరమగు ధ్వని వినబడుచున్నది. ఆవజ్రాయుధమును నీవు ఓర్వగలవో లేవో నీకే తెల్లుసున్ను, అని గంధర్వరాజగు ధృతరాష్ట్రుడు చెప్పగా ఆవ

ప్పుడీ వజ్రాయుధ ధ్వనిని మరుత్తుడు విని భయపడి సంవర్తునకు తెలిపి యిట్లనెను. మహాత్మా! సంవర్త మునీంద్రా! అదిగో వజ్రాయుధము వచ్చుచున్నది. నామనస్సునకు భయము కలిగెను. సభవారందరును భయపడి భూమిపై వ్రాలిరి. నీవు కృపచేత మమ్ములనందరిని రక్షింప వలయును. అని మరుత్తుడు ప్రార్థించగా సంవర్త మహాయోగీశ్వరు డిట్లనెను. మరుత్తుడా! దేవేంద్రునివలన కొంచెమైనను నీవు భయపడ వద్దు. దేవేంద్రుడు నన్ను యెరుగును. నేను సంస్తంభ విద్యచేత వజ్రా యుధమును అణచగలను. దేవేంద్రాది సకల దేవతల ఆయుధములను నాచేతసడలింపజేయగలను చెడుగాలి వేగపువాన మొదలగు అనేకవికా రములను అద్భుతము కలిగించి దేవతలనందరిని బాధింపగలను. అని సంవర్తుడు చెప్పగా మరుత్తు డిట్లనెను. సంవర్త మునీంద్రా! ఇదిగో వజ్రాయుధము మ్రోయుచువచ్చుచున్నది. ఏ విధముచేత నా భయ మును పోగొట్టు కొందును అని చెప్పగా అపుడు సంవర్తుడు చిరు నవ్వుగలవాడై మరుత్తుని జూచియిట్లనెను. మరున్మహారాజా! వజ్రా యుధమందు నీవు జ్ఞాపకముంచవద్దు. అది నిన్నేమియు చేయజాలదు. నీకు కావలసిన వరమును కోరుము యిచ్చెదను. నా తపోమాహాత్మ్య మునుచూడుము. అని చెప్పగా మరుత్తుడిట్లనెను. మహాత్మా! సంవర్త మునీంద్రా! నాకు గల భయమంతయు యిపుడు పోయినది. నేనొక వరము కోరెదను. ఆవరమును నాకు మీరు యివ్వవలయును. నా మీద దేవేంద్రుడు విరోధమును యెంచక యిక్కడకు వచ్చి తనకు తగిన హవిర్భాగమును తీసుకొనునట్లుగా నీచిత్తమందు తలంపుము. తక్కిన దేవతలందరును తమతమ హవిర్భాగములనన్నిటిని సంతో షముగాతీసుకొనునట్లును, నాయజ్ఞము చక్కగా పూర్తియగునట్లును అనుగ్రహింపుమని ప్రార్థించగా సంవర్తుడిట్లనెను. మరుత్తుడా! నేను వేదమంత్రములచేత పిలిచిన వెంటనే సోమపానము కొరకు దేవేం

ద్రుడు వచ్చును. అతని వెంటనే తక్కిన దేవతలందరును రాగలరు. అని సంవర్త మహాయోగీశ్వరుడు చెప్పి సమీపమునకు వచ్చిన వజ్రాయుధమును పోగొట్టి ధృతరాష్ట్రుడనెడి రాజును పంపించెను.

## మరుత్తుని యజ్ఞ హవిర్భాగమును దీసికొనుటకు ఇంద్రాదులు వచ్చుట

మహా యోగీశ్వరుడగు సంవర్త మహాముని దేవేంద్రుని, దేవతలను, మంత్రములచేత పిలిచెను. మహాత్ముడగు సంవర్తునియొక్క గొప్ప మంత్రశక్తివలన పిలువబడిన దేవేంద్రాది దేవతలందరును సంతోషముగావచ్చిరి. అపుడు సంవర్తుని అనుమతి తీసుకొనిన మరుత్తుడు దేవేంద్రాది దేవతలకు యెదురుగాబోయెను. సంవర్తుడును దేవతలను సన్మానించునట్లుగా యెదురుగా వెళ్ళెను. అపుడు మరుత్తుడు శాస్త్రప్రకారము దేవేంద్రాది దేవతలను అర్ఘ్యపాద్యాదులచేత పూజించి, దేవేంద్రునకు నమస్కరించి యిట్లనెను. దేవేంద్రా! నీవు యిక్కడకు విజయముచేసి నాజన్మమును ఫలవంతమగునట్లుగా జేసితివి. నేను కృతార్థుడనైతిని. నీవు కృపాసముద్రుడవు. నామీద విరోధమును విడిచి నన్ను చల్లగా జూచి మన్నింపుము. ఈసంవర్తముని బృహస్పతివంటివాడై నందున ఉపాధ్యాయునిగా గ్రహించితిని. అని యిట్లు విన్నపము చేయగా దేవేంద్రుడు మరుత్తునిజూచి యిట్లనెను. ఓమహారాజా! నీవలన నేను సంతోషించితిని. సంవర్తుడు బృహస్పతికి తమ్ముడగును. గనుక సంవర్తుడుబృహస్పతివంటివాడగును సంశయములేదు. అని దేవేంద్రుడు మరుత్తునిజూచి చెప్పుచుండగా అపుడు సంవర్తుడు పకపక నవ్వుచుండెడి ముఖము గలవాడై దేవేంద్రునితో యిట్లనెను.

మహాత్మా! దేవేంద్రా! నీవు సకలలోక ప్రభుడవై యున్నావు. నీవు ప్రీతిచేత యిక్కడకు వచ్చుట నా తపఃఫలము

వలన కాదు. మరుత్తుడు పుణ్యాత్ముడగుటవలన నీవు వచ్చితివి. నీవు ప్రీతితో వచ్చినందున యీతని యజ్ఞము పుణ్యములకుప్పయైనది. నీవు సకలమును సిద్ధింప జేయుటకు సమర్థుడవగుదువు. నీ కృపా దృష్టిచేత సకలయజ్ఞ మంత్ర తంత్రములును సార్థకములగును. మరుత్తుడు అధికపుణ్య పురుషుడగును. నీ కృపవలన మరుత్తునకు శ్రేష్ఠములైన పుణ్యలోకములు కలుగగలవు. అని యిట్లు సంవర్తుడు స్తుతిపూర్వకముగా దేవేంద్రునితో నిర్భయముగా మాట్లాడెను. సంవర్తుడు తన్ను స్తుతించినందుకు దేవేంద్రుడు ఉప్పొంగి పరమానందమును బొంది దగ్గరనుండెడి దేవతలను కలియజూచి వారితో యిట్లనెను. దేవతలారా! మీరు వెళ్ళి మరుత్తుని యజ్ఞభూమిని మనోహరముగానుండునట్లు అలంకరింప జేయింపవలయును. అప్సర స్త్రీజనముచేత ఆడింపుచు గంధర్వులచేత పాడింపవలయును. అని దేవేంద్రుడు చెప్పగా దేవతలు వెళ్ళి దేవేంద్రుడు చెప్పిన ప్రకారము చేయించి సకల పనులకును సహాయము చేసిరి. సంవర్తముని మరి యొక అగ్నిహోత్రునివలె ప్రకాశింపుచు ప్రకాశమానమైన పీఠము మీద కూర్చుండి హోమవిధిని చేయగా మరుత్తుని అశ్వమేధ యజ్ఞము ప్రకాశమానమై సుప్రయోగకముగా కనుపించెను. పిమ్మట సంవర్తయోగి యజ్ఞసోమమును తన చేతులతో తీసికొని దేవతలను ప్రత్యేకముగా పిలిచి యివ్వగా దేవతలందరును సోమమును తీసికొని పానముచేసి దేవేంద్రాది దేవతలందరును ఆనందమును పొందిరి.

ధర్మరాజా! యిట్లు మరుత్తుడు దేవేంద్రుని తృప్తిపరచి పంపించగా దేవతలందరును సంతోషించి తమ తమ నివాసములకు వెళ్ళిరి. మరుత్తుడు యజ్ఞమును చేయుచున్నపుడు పూర్తియైన దినమందు ఆశ్చర్యము కలుగునట్లు అనేక బంగారురాసులను, అనేక బ్రాహ్మణులకు వేడుకతోడను, భక్తితోడను యిచ్చెను. మరి

త్తుడు ముందు చెప్పిన ప్రకారము హిమవత్పర్వతమందు యజ్ఞముచేసి ముగించిన పిమ్మట యజ్ఞమునకుగాను, యేర్పరచిన బంగారు పాత్రలను, బంగారుకోట మొదలగునవి యన్నియు ప్రాణుల గుంపులకు దానముచేసెను. మరుత్తుడు సంవర్తుని యాజ్ఞనుపొంది తనపట్టణమునకు వచ్చి నాలుగు సముద్రముల లోపల నుండెడి భూమండలమంతయు ధర్మమార్గముగా పరిపాలించెను. బ్రాహ్మణులు మరుత్తునిచేత తమకు యివ్వబడిన బంగారమును తవ్వుకొని తమకు కావలసినంత దెచ్చుకొని తక్కిన బంగారమును ఒకచోట నిధిగా దాచిపెట్టి యీ బంగారమును యెవరు చూతురో వారి సొత్తేయగునని అందరును యేకవాక్యముగా జెప్పిరి. బంగారునిధినిజూచి తెచ్చుకొని నీ యిష్టప్రకారము వ్యయముచేసి అశ్వమేధయజ్ఞమును చేయుము. యజ్ఞముచేత సకలదేవతలును తృప్తిబొందుదురు. అని వేదవ్యాస మహాముని చెప్పినను బంధువిషయమైన దుఃఖముచేత తెలివినిబొందక పొగచేత కప్పబడిన అగ్నివలె నుండెడి ధర్మరాజునుజూచి కృష్ణుడు యిట్లనెను. ధర్మరాజా! వంకరయైన దుఃఖ సంకల్పములన్నియు మృత్యుమార్గమగును. వంకరలేని సత్యరూపములైన సంతోషాది సంకల్పములన్నియు బ్రహ్మమార్గమగును. ఇది సత్యము. ఇట్లయినపుడు నీవు వ్యర్థముగా చచ్చినవారిని గురించి దుఃఖింపరాదు. పండితులగువారు యిట్లు దుఃఖపడరు. గనుక నీవు దుఃఖమును బొత్తిగా విడిచిపెట్టుము. నీవు దుఃఖమును కలిగియుంటివేని నీ చేత కర్మానుష్ఠానము నిర్మలముగాచేయబడదు. ఈ హేతువులచేతదుఃఖమును నిశ్శేషముగా విడువుము. అది యెట్లనగా చెప్పెదను వినుము. నీవు దేహమందుండెడి శత్రువులను యెరుగుదువుగదా! గనుక ఆ విషయమై ఒక యితిహాసము కలదు.

## శ్రీకృష్ణుడు ధర్మరాజునకు మనస్తాపోపశమనము చేయుట

ధర్మరాజా! పూర్వము వృత్రాసురుడు సకల భూమిని ఆక్రమించి భూమియందుగల గంధగుణమును తీసికొనెను. అంతట దేవేంద్రుడు వృత్రునిమీద వజ్రాయుధమును ప్రయోగించెను. అంతట వృత్రుడు భూమినివిడిచి జలమందుచేరి జలగుణమగు రసమును అపహరించగా వృత్రునిమీద దేవేంద్రుడు వజ్రాయుధము ప్రయోగించెను. వృత్రుడు జలమును విడిచి అగ్నియందుచేరి యగ్నిగుణమగు రూపమును తీసికొనగా వృత్రునిమీద మరల దేవేంద్రుడు వజ్రాయుధమును ప్రయోగించెను. వృత్రుడు అగ్నిని విడిచి వాయువునందు ప్రవేశించి వాయుగుణమగు స్పర్శమును తీసికొనగా వృత్రునిమీద దేవేంద్రుడు వజ్రాయుధమును ప్రయోగించెను. వృత్రుడు వాయువును విడిచి ఆకాశమందుజేరి ఆకాశగుణమగు శబ్దమును తీసికొనగా వృత్రునిమీద మరల దేవేంద్రుడు వజ్రాయుధమును ప్రయోగించెను. వృత్రుడధిక వేగముతో దేవేంద్రుని దేహములోనికి ప్రవేశించగా, దేవేంద్రుడు మూర్ఛనుపొంది క్రిందబడెను. ఆసమయమున వసిష్ఠమహాముని తన మంత్రశక్తివలన దేవేంద్రుని మూర్ఛను పోగొట్టెను. అంతట దేవేంద్రుడు తన దేహములో నుండెడి వృత్రుని కనబడని దివ్యమహిమశక్తిగల వజ్రాయుధము చేత చంపెను. దేవేంద్రుడు యీధర్మరహస్యమును మునులకు జెప్పెను. మునులు నాకుజెప్పిరి. ధర్మరాజా! నీవు యీధర్మరహస్యమును తెలిసికొనుము. అని కృష్ణుడు చెప్పి మరల నిట్లనెను.

ధర్మరాజా! శరీరవ్యాధి యనియు, మనోవ్యాధి యనియు యిట్లువ్యాధి రెండువిధములుగా నున్నది. వానిస్వరూపములను చెప్పెదను వినుము. వాతపైత్యశ్లేష్మములనెడి మూడును, సమముగా నున్న సమయమున పురుషుడు సుఖముకలిగియుండును. ఆమూడును

ఏకీభవించి యున్నను, హెచ్చుతక్కువలుగా నున్నను ఆసమయమున శరీరవ్యాధియని చెప్పబడును. సత్వరజస్తమో గుణములు మూడును సమముగా నున్నయెడల పురుషుడు సుఖవంతుడై యుండును. ఈ మూటిలో సత్వముతగ్గి రజస్తమములు హెచ్చుతగ్గులైన సమయమున వ్యాధికలుగును. ఈ శరీరవ్యాధి మనోవ్యాధులగు రెంటిలో ఒకటి యుండినపుడు మరియొకటి లేకపోదు. ఈ రెండును అన్యోన్య సంబంధములు కలిగియుండును. కాలవిపర్యయమువలన రెండువిధములైన వ్యాధులలో ఒక్కొక్కటి కనబడి మరియొకటి కనబడకుండుటయు గలదు. కనబడెడి వ్యాధులను వాతగుణములని చెప్పుదురు. ధర్మరాజా ! యీ చెప్పిన పద్ధతి సూక్ష్మకర్మానుష్ఠాన ప్రకారమగును. ఇపుడు నీకు మనోవ్యాధికలిగి యున్నది. యీ మనోవ్యాధిని నీవు పోగొట్టుకొన జాలకుంటివి. గనుక నీవు కర్మానుష్ఠానమును నిర్మలముగా జరుపజాలవని అంటివి. అని కృష్ణుడు చెప్పి మరల యిట్లనెను.

ధర్మరాజా ! యేయేవిధముల చేత వాతపైత్యాది గుణములు, సత్వరజస్తమో గుణములు, హెచ్చుతగ్గులగు చున్నవో, ఆయావిధములను నీ బుద్ధిచేత యోచించుకొని నీవే తెలుసుకొని సుఖవంతుడవగుము. అట్లుగాక వాతపైత్యశ్లేష్మ గుణములను, సత్వరజస్తమములను బొత్తిగా నీయందు చేరనివ్వకుండునట్లు చేసితివేని మిక్కిలి శ్లేష్మస్వభావుడ వగుదువు. ధర్మరాజా ! మరియొక విధముగా జెప్పెదను వినుము. ద్రౌపది రజస్వలయై ఒంటివస్త్రముతో నున్న సమయమున దుశ్శాసనుడు అట్టి ద్రౌపదిని సభకు దీసుకొని వచ్చుట మరచిపొమ్ము. మీరు అడవులలో కష్టపడిన విషయములను మనస్సునందుంచుకొనకుము. జటాసుర సైంధవులు మీకుచేసిన అపకారములను తలంపకుము. విరాటరాజుదగ్గర పనులు చేసికొనుచు మీరు వేషములను పొందిన విషయములను తలంపకుండుము. భీష్మాదులతో

చేసిన యుద్ధస్తోత్రములు వాస్తవయుద్ధములుగావు. గనుక నీవు మేలు లను మనస్సునం దుంచుకొనకుము. భీష్మాదులతో చేసినయుద్ధము యుద్ధముగాని విధమెట్టిదని యంటివేని చెప్పెద వినుము. నీవు భీష్మ ద్రోణాదులతో చేసిన యుద్ధము మిథ్యయగునేగాని వాస్తవము కానే రదు. అదియెట్లనగా చెప్పెదను వినుము. ఈకనబడెడి ప్రపంచమం తయు మిథ్యయగుటవలన భీష్మద్రోణాది బంధు స్నేహితులందరును మిథ్యారూపులే యగుదురు. బంధుమిత్రుల సహాయాదిక మంతయు మిథ్యయే యగును. గనుక అట్టిసహాయాదికమువలన ప్రయోజన ముండదు. వాస్తవమగు యుద్ధము అంతరయుద్ధమగును. వాస్తవ యుద్ధమునకు మనస్సు శత్రువగును. ఆత్మసహాయుడగును. ధర్మరాజా! నీవు యీ ప్రకారముగా నైనను శాంతిని సంపాదించుకొనుము. అం తర శత్రువులగు మనఃకామక్రోధాదుల యందుగల పగను తీర్చు కొనుము. శాంతమువలన మనస్సు జయింపబడుచున్నది. గనుక దర్భకజ్జ కొనవంటి సూక్ష్మబుద్ధిని గలిగి శాంతుడవై మనస్సును జయించి ప్రకాశింపుము. ధర్మరాజా! యిటువంటి అంతరయుద్ధము చేసి నీశత్రువగు మనస్సును నీవు గెలువకుంటివా? ఇట్టినీవు యేగతిని పొందెదవో తెలియలేదు. నీవు కలుగబోయెడి గతిని నీవే తెలుసు కొని మంచిబుద్ధిమంతుడవుగమ్ము. విశేషించి మాటలను చెప్పుట వలన ప్రయోజనము లేనందున ముఖ్యమగు మాటను చెప్పితిని. అని యిట్లు కృష్ణుడు ధర్మరాజుతో చెప్పి మరలనిట్లనెను.

ధర్మరాజా! మమఅనెడి రెండక్షరములును మృత్యువగును. నమమఅనెడి మూడుక్షరములును బ్రహ్మమగును. బ్రహ్మమృత్యు వులు రెండును జనులకు కనబడనివై కలహించుకొనుచుండును. మమ యనగా నాదియని యభిమానించుట యనియు, నమమ అనగా నాది యని యభిమానింపకుండుట యనియు తెలియవలెను. ధర్మరాజా!

బ్రహ్మస్వరూపుడగు జీవుడు యెప్పటికిని నాశము లేనివాడై దేహములయందు నివసించి యుండును. సకలదేహములును తప్పక నశించునవియగును. జీవుడు ఒకనిచేత చంపబడెడివాడును ఒకనిని చంపెడివాడునుకాడు. గనుక బ్రహ్మస్వరూపుడగు జీవునియందు మృత్యుధర్మములు కలుగనేరదు. నాలుగు సముద్రములలోపల నుండెడి భూమండలమంతయు పరిపాలించిన అట్టి భూమియందు నాదియనెడు వృథాభిమానము లేనియెడల అట్టి పురుషునకు పుణ్యాపాపములు కలుగజాలవు. అడవియందుండి యేకర్మములను చేయకున్నను పదార్థములయందైనను, దేహేంద్రియాదులయందైనను అభిమానమున్నయెడల అట్టి పురుషుడు మృత్యువు పాలగుచున్నాడు. ధర్మరాజా! బాహ్యశత్రువులగు దుర్యోధనాదులను గెల్చుట గెలుపుగాదు. అంతరశత్రువులగు మనఃకామాదులను గెల్చుట గెలుపుయగును. అంతరశత్రువులను గెల్చినయెడల మోక్షము లభించుచున్నది. గనుక బాహ్యశత్రువులను గెలుచుటవలన సుఖము కలుగనేరదు. ధర్మరాజా! అంతరశత్రువులలో కామము గొప్పశత్రువగును. కామము నశించినయెడల మోక్షము సులభముగా నశింపుచున్నది. వేదాధ్యయనము. యజ్ఞదానాదులన్నియు ఆ కామముతో కూడినవే యగును. గనుక అధ్యయన యజ్ఞదానాదులచేత కామము నశింపజాలదు. ఈవిషయమై కామగీత లనెడి కొన్ని వాక్యములు గలవు. అవి చెప్పెదను వినుము. పూర్వము కాముడు లోకమును ఉద్దేశించి యిట్లనెను.

లోకమా! నేను మిక్కిలి గొప్పవాడనై వేదవేద్యుడనై యున్నాను నన్ను గెలుచుటకు ప్రయత్నము సాధనముకాదు. గనుక అపాయము లేనివాడెనడును నన్ను బాధింపజాలడు. లోకమా! ధైర్యముచేత ఎవడు నన్ను చంపదలచునో వాడే చచ్చుచున్నాడు.

అట్లు అతడు తానే చచ్చుట యెరుగడు. గనుక ధైర్యముచేత నన్ను చంపజాలక అపజయమును పొందును. లోకమా! తపస్సుచేత నన్ను యెవడు చంపదలచునో అట్టి తపస్సునందు నేను కోరిక రూపముగా ఆ పురుషునియందు పుట్టియుందును. గనుక నన్ను చంపుటకు యెవరికిని సాధ్యముగాదు. లోకమా! మోక్షమును పొంది యెవడు నన్ను చంపదలచునో అట్టిపురుషునియందు నేను మోక్ష కామరూపమును బొందియుందును. గనుక నేను యెవనిచేతను నశించువాడనుగాను. అనాదినుండి యున్నాను. అని కాముడు తనకు నాశముకలుగని విధములను చెప్పియున్నాడు. ఈ వాక్యములయందుగల ప్రకారము కామునకు నాశముకలుగదు. ఈ అభిప్రాయమునుబట్టి యేర్పడిన తాత్పర్యమును చెప్పెదను వినుము. పసిబూని ధైర్యముచేత కాముని చంపెదననెడి తలంపు లేకుండుటయు సమగ్రమగు తపఃఫలమును అపేక్షింపకుండుటయు, మోక్షమును కోరకుండుటయు యీ మూడు విధములును కాముని చంపెడి మార్గము లగును. ఈ మూడు విధములు లేనివాడే అపాయము లేనివాడని కాముడు చెప్పెనని తెలిసికొనుము.

ధర్మరాజా! విశేషించిచెప్పక ముఖ్యమగు మాటను చెప్పెద వినుము. మనస్సునందు యేవిధమైన కోరిక నుంచనియెడల కాముడు నశింపగలడని తెలిసికొనుము. నీవు మనస్సునందు యేవిధమైన కోరికను లేనివాడవై అశ్వమేధయజ్ఞమును చేయుము. ధర్మరాజా! నీవు ఆప్రకారము అశ్వమేధయజ్ఞమును చేసి ఫలమును కోరక కాముని ధర్మముగా తలచియుండుము. చచ్చిన బంధువులనుగురించి తలచినయెడల చచ్చినవారు మరల బ్రతికిరాజాలరు. నీయిష్టప్రకారము అనేకయజ్ఞములను జేయుము. అట్లు చేసినయెడల నిన్ను లోకమంతయు మెచ్చుకొనును. అటుపిమ్మట పుణ్యగతియు కలుగగలదు.

అని యిట్లు కృష్ణుడు ధర్మరాజునకు బోధించెను. వ్యాసుడును అనేక విధములుగా బోధించెను. స్థాణునారదమునులును మంచి హితవాక్యములను చెప్పిరి. భీమార్జున నకుల సహదేవులును, ద్రౌపదియు తగిన మాటలను ధర్మరాజునకు జెప్పిరి. శాస్త్రజ్ఞులైన బ్రాహ్మణులును హితవాక్యములను చెప్పిరి. ఈ ప్రకారము చెప్పిన అందరివాక్యములను ధర్మరాజు విని దుఃఖమును విడిచి రాజ్యపరిపాలన యజ్ఞములను చేయుటయందు ఆసక్తిగలవాడై చేయుటకు సమ్మతించెను, అపుడు ధర్మరాజు మునులతో నిట్లనెను. మహాత్ములగు మునులారా! నేను సూతకము వెళ్ళెడిపర్యంతము యీ గంగానదీ సమీపమందు కొన్నిదినములుండి వచ్చెదను. మీ కృపవలన నాకు గల దుఃఖమంతయు నశించెను. నామనస్సు యిపుడు సంతోషము కలిగి యున్నది. మీరు యింక వెళ్ళవచ్చును. నన్ను మరువవద్దు అని యిట్లు ధర్మరాజు చెప్పి మునులందరికిని ప్రదక్షిణముగా చుట్టుతిరిగి సాగిలపడి నమస్కరించి వేదవ్యాసుని పాదములకు అధికముగా మ్రొక్కి యిట్లనెను.

## వ్యాసనారదాదిమునులు ధర్మరాజును వీడ్కొని స్వస్థానములకు బోవుట

మహాత్మా! వ్యాసమునీంద్రా! మీయనుగ్రహమువలన తెలుపబడిన బంగారమును మిమ్మును ముందుపెట్టుకొని పోయి తీసుకొనెదను. బంగారు గనులుగల పర్వతములన్నిటిలో హిమవత్పర్వతమందు బంగారుగనులు అధికముగానుండునని ఆశ్చర్యముగా చెప్పుదురు. గనుక మీవలన రక్షింపబడినవాడ నగుచు హిమవత్పర్వతమునకు వెళ్ళవలయును. నాయందు అధికమంగళములను కలిగించెడి వాక్యములను సెలవిచ్చితిరి. మీ వంటి పెద్దల కరుణ మహాభాగ్యవంతులకు

లభించును. మీకరుణ నన్ను భాగ్యవంతునిగా తెలుపుచున్నది. అని యిట్లు ధర్మరాజు అనేకవిధములుగా వేదవ్యాసుని స్తుతించి వినయముతో ప్రార్థించెను. అట్లు ధర్మరాజు చెప్పగా మునులందరును కృష్ణార్జునుల అనుమతిని పొంది అంతర్ధానులైరి. అటుపిమ్మట ధర్మరాజు మొదలగు పాండవులు ధృతరాష్ట్రునితో గూడుకొని భీష్మునకు పరలోకక్రియలు చేసిరి. అపుడు ధర్మరాజు కర్ణాదులకు శాశ్వత దివ్యసుఖములను కలుగుటకై నానావిధములగు దానవిధులను చేసెను. అట్లు ధర్మరాజు గంగానదీతీరమందు చేయదగిన కార్యముల నన్నిటిని చేసి కొన్నిదినములకు ధృతరాష్ట్రుని ముందుపెట్టుకొని హస్తినాపురమును ప్రవేశించెను. అంతట ధర్మరాజు ధృతరాష్ట్రుని పూజించి అతని ఆజ్ఞాప్రకారము ప్రవర్తింపుచు కృష్ణుడును భీమార్జున నకుల సహదేవులును సంతోషించుచుండగా జనులు ఆనందించునట్లు రాజ్యమును పరిపాలించెను. అని యిట్లు ధర్మరాజు వృత్తాంతము వైశంపాయనుడు చెప్పగా జనమేజయ మహారాజు విని యిట్లనెను.

వైశంపాయన మునీంద్రా! యీప్రకారము ధర్మరాజు రాజ్యమును పరిపాలింపుచున్నపుడు కృష్ణార్జునులు యేవిధముగలవారై, యెక్కడుండిరో చెప్పుమని యడుగగా వైశంపాయనుడు యిట్లనెను. జనమేజయ మహారాజా! యీప్రకారము ధర్మరాజు రాజ్యపరిపాలనము చేయునపుడు కృష్ణార్జును లిద్దరును యింద్రప్రస్థమనెడి పట్టణమందు నివసించియుండి వేడుకకొరకు నదులయందును, అరణ్యాపర్వత గుహలయందును తిరుగుచు బ్రాహ్మణులను పూజింపుచు, పుణ్య కథలను వినుచు మంచి గ్రంథములను చదువుచు తాము పూర్వము చేసిన యుద్ధతంత్రములను చెప్పుకొనుచు ప్రొద్దుపుచ్చుచుండిరి. అట్టి సమయమందు తన కొడుకగు అభిమన్యుని మరణమును తలచుకొని అర్జునుడు దుఃఖించగా కృష్ణుడు దుఃఖశాంతిమాటలను చెప్పి అర్జునుని

దుఃఖము పోగొట్టెను. అంతట కృష్ణార్జునులు, మయుడు నిర్మించిన తమ సభను చూచుకొనుచు, క్రొత్త క్రొత్త వింతలను జూచుచు నానావిధ పరిజనులతో కూడి పరమానందమును పొందియుండిరి. అట్లుండి ఒకానొక దినమందు కృష్ణుడు అర్జునుని జూచి యిట్లనెను. అర్జునా! ధర్మరాజు ధర్మమార్గముచేత యుద్ధముచేసి అట్టియుద్ధమందు సకల శత్రువులను సంహరించి ధర్మము తప్పక ప్రజాపరిపాలనము చేయుచున్నాడు. సకల జనులును ప్రీతి బొందియున్నారు. ధర్మరాజు విద్వాంసులగు బ్రాహ్మణులను అధికముగా సుఖింపజేసెను. ఆ బ్రాహ్మణులందరును ధర్మరాజును స్తుతించుచున్నారు. ధర్మరాజు శాంత గుణము కలిగి యింద్రియనిగ్రహవంతుడై మంచి స్వభావముచేత ప్రకాశించుచు సిద్ధులచేతను, మునులచేతను, సేవింపబడుచున్నాడు. ఇట్లు ధర్మరాజు ప్రకాశించుచు అధికుడయ్యెను. పుణ్యాత్ముడైన ధర్మరాజునకు భీమ నకుల సహదేవులును నీవును మిక్కిలి సహాయము చేసితిరి. మీవలన ధర్మరాజు కృతార్థుడయ్యెను. అని యిట్లు కృష్ణుడు పొగడి అర్జునుని ముఖముజూచి యిట్లనెను.

అర్జునా! నీవలన నేను యిక్కడ యింతకాలమువరకు యుంటిని. ఇంక ద్వారకకు వెళ్ళవలెనని తలంపు నాకు కలిగినది. బలరాముని, దేవకీవసుదేవులను, నాయందు స్నేహముగల సకల యాదవులనుచూడవలయును. గనుక నన్ను ద్వారకకు పంపించుము. అర్జునా! నేను నాపట్టణమగు ద్వారకకు వెళ్ళి మరల వచ్చెదను. తగిన సమయము చూచి ధర్మరాజుతో చెప్పుము. ధర్మరాజుయొక్క అనుమతిని తీసికొని వెళ్ళుదునేగాని అతనితో చెప్పక వెళ్ళను. నా దేహప్రాణ పుత్ర మిత్ర బంధువులను సాధనము మొదలగునవి యన్నియు ఆధర్మరాజుయొక్క సొమ్మువము. ధర్మరాజును అనుసరించి నడచునట్లును నేను వ్రతము ధరించియున్నాను. గనుక అర్జునా! నన్నిప్పుడు పాస్తి

నాపురమునకు వెళ్ళి పుణ్యాత్ముడైన ధర్మరాజునుజూచి సమయమును కనిపెట్టి యీపనిని విజ్ఞాపనము చేసుకొనవలయును. అట్లు మనము విజ్ఞాపనము చేసికొనిన పిమ్మట ధర్మరాజు చెప్పిన ప్రకారము నడచు కొందము. వెళ్ళుదము లెమ్మని కృష్ణుడు చెప్పగా అంతట అర్జునుడు కొంచెముసేపు చింతించి అట్లు చేయుట మిక్కిలి మంచిదనిచెప్పి వెం టనే కృష్ణునితో యిట్లనెను. కృష్ణా! నేను భారతయుద్ధమును ప్రారం భముచేసెడి సమయమందు నామనస్సు కలక బారగా నీవు కృపచేత తత్వజ్ఞాన విషయములైన కొన్ని గొప్ప అర్థవంతములైన వాక్యము లను జెప్పితివి. ఆవాక్యార్థములను, నా మనస్సు నందు నిలుపుకొన జాలకపోతిని. గనుక అమృత తుల్యములగు వాక్యములను యింకొక సారి నాకు చెప్పవేయని ప్రార్థించగా అపుడు కృష్ణుడు నవ్వుచు ఒక చేతితో అర్జునుని కౌగలించుకొని యిట్లనెను. అర్జునా! నీవు తత్వ జ్ఞాన బుద్ధిలేక శ్రద్ధలేనివాడవైతివి. అప్పుడు నేను చెప్పిన వాక్య ములు గొప్ప అర్థవంతములై బ్రహ్మజ్ఞానమునకు హేతు భూతముల గును. ఆవాక్యములను బుద్ధియందు నిలుపకపోతివి. ఆవాక్యములను మరల చెప్పుటకు సాధ్యము గాదు.

## శ్రీకృష్ణు డర్జునునకు తత్వజ్ఞాన స్థిరీకరణము చేయుట

అర్జునా! యీ విషయమై ఒక యితిహాసముకలదు. అది చెప్పెద వినుము. పూర్వము నాదగ్గరకు ఒక బ్రాహ్మణోత్తముడు రాగా నేను తత్వ జ్ఞానము నుపదేశింపుమని బ్రాహ్మణుని యడిగితిని. అట్లు అడుగగా కాశ్యపుడనెడి బ్రాహ్మణుడు నాతో నిట్లనెను. కృష్ణా! నేను ఒకచోట నొకసిద్ధుని జూచితిని. ఆ సిద్ధుడు యింద్రియ నిగ్రహముగలవాడై జ్ఞానవిజ్ఞానములు గలిగి సంసార వ్యవహారము విడిచి యుండెను. అట్టి సిద్ధునకు నేను వినయమవంతుడనై శిష్య

భావముచేత భక్తి గలిగి ఆశ్రయించితిని. అపుడు సిద్ధుడు నాకు చెప్పిన వాక్యములను చెప్పెదను వినుము. కాశ్యపా! నేను యిది వరకుగల జన్మములయందు పుణ్యములనుచేసి యిహపరలోకసౌఖ్యములను పొందితిని ఇట్లు అధిక ప్రయత్నముచేత సంపాదింపబడిన పుణ్యలోక సుఖము నశింపగా మరల మనుష్యలోకమందు బుట్టుచు, చచ్చుచు మరల పుట్టుచు, చచ్చుచు అనేక జన్మములను పొందితిని, ఆయా జన్మములయందు అనేక జాతులుగల తల్లులను, తండ్రులను, అన్నదమ్ములను, పుత్రులను జూచితిని. నానావిధ జాతులయందుగల తల్లుల యొక్క పాలు త్రాగితిని. అనేకమార్లు స్నేహనాశనము, ధన నాశనము, దరిద్రములు మొదలగు అనేక సంకటములను పొందితిని. మరియు ఆయాజన్మములయందు చేయబడిన మనోవికారములవలన కలిగిన పాపముచేత నానావిధదుఃఖ నరకములు కలుగుచుండును. ఇట్లు అనేక జన్మములయందు అనేకవిధ దుఃఖములను అనుభవించి సంసారమునకు విసికి లోకవ్యవహారమును విడిచితిని. పిమ్మట ఆత్మానుగ్రహామువలన యిట్టి సిద్ధిని పొందితిని. మరియు నేను సృష్టి యుండెడి పర్యంతము లోకమును చూచుచుండుదును. ఇక కాలక్రమమున అంత కంతకు అధికదశలను పొందుచుందును. నాకు బ్రహ్మానందము సులభముగా నున్నది. అని చెప్పి మరల యిట్లనెను.

కాశ్యపుడా! నీవిషయమై సంతోషించితిని. నావలన యేమి తెలియదలచి నన్నాశ్రయించితివో, చెప్పినయెడల నీ యభీష్టమును సిద్ధింపజేయుదును. అని యిట్లు సిద్ధుడు అడుగగా నేను యిట్లని చెప్పితిని. మహాత్మా! సిద్ధుడా! నాకు తత్వజ్ఞానమును తెలిపి సంసారమందు గల జనన మరణాది దుఃఖములను పోగొట్టుమని ప్రార్థించి అతని పాదములను పట్టుకొని నమస్కరించి వినయము కలిగి నిలిచి యుండగా సిద్ధుడిట్లనెను. కాశ్యపా! నీకు తత్వజ్ఞానము గలిగెడు విధ

మును చెప్పెదను సావధాన మనస్సుచేత వినుము. సకల ధర్మము లకును దేహము సాధనమగును. ధర్మమువలన జ్ఞానము కలుగును. గనుక తనకు మేలుగోరిన వాడు మొదట తన దేహమును కాపాడు కొనవలయును. మూఢుడగువాడు తన బుద్ధిబలమును. దేహబల ములు కాపాడుకొనజాలక తన ఆయుష్కాలమును నశింప జేసికొనును. అది యెట్లనగా చెప్పెద వినుము. తాను భక్షించెడి ఆహారములను యోచించక అయోగ్యములైన పదార్థములను భక్షింపుచుండును. ఒకప్పుడు అధికముగా భక్షించును. మరియొక సమయమందు చెడు నిద్రగలిగి జాగ్రత్తగా భక్షింపకుండును. మరియొక సమయ మందు పక్వముగాని పదార్థములను భక్షించుచుండును. మరియొక సమయమందు అధికమగు జలమును భక్షించును. మరియొక సమయ మందు అధికముగా నిద్రించుచు, అధికముగా స్త్రీలతో రమింపుచు అధికములగు పనులుచేసి ఆయాస పడుచుండును. మూఢుడగువాడు యిట్లు ప్రవర్తింపు చుండును. అట్లు ప్రవర్తించినందున వాతపైత్య శ్లేష్మములనెడి దోషములు హెచ్చు తగ్గులగుచు వ్యాధులు కలిగి బాధింపగలవు.

## శ్లేష్మాది రోగవికారముల నిరూపించుట

అని యిట్లు సిద్ధుడు చెప్పి మరల యిట్లనెను. కాశ్యపా! తగినకాలములయందు తగిన పనులను చేయనందున హానికలుగు చున్నది. దేహమునకు అయోగ్యములైన భోగములను పొందుటచేత వ్యాధులును కామక్రోధాదులును కలుగుచున్నవి. ముందుచెప్పినప్రకా రము భక్షించెడి పదార్థములు హెచ్చుతగ్గు లగుటచేతను కాలాతి క్రమణ భోజనములచేతను వాతపైత్య శ్లేష్మములు హెచ్చుతగ్గులై తద్ద్వారా రోగములుపుట్టుచున్నవి. అవి చెప్పెదను వినుము. పైత్యము

అధికమై ప్రకోపించినపుడు ప్రాణములకు శీఘ్రముగా అపాయము కలుగును. పైత్య వికారములు అధికమైనపుడు యొక్క పైనను దేహమునందు భిన్నములను కలిగించును. అట్లు కలిగిన భిన్నములు మర్మములని చెప్పబడును. దేహావయవములకు భిన్నము కలిగినపుడు జీవునకు హానికలుగుచుండును. శ్లేష్మమనెడి వికారము అధికమైనపుడు అవయవములు జడములై యుండును. శ్లేష్మము దేహమునకు లోప లను బయటను మెల్ల మెల్లగా కప్పుచుండును. శ్లేష్మము రాజై నపుడు కంఠమునకు అడ్డుపడును. ప్రాణవాయువును క్రమముగా సంచారము చేయనివ్వదు. ఊర్ధ్వశ్వాసమును కలిగించును. అట్టి సమయమందు జీవుడు దేహమందుండ జాలక వెళ్ళును. శ్రోత్రము మొదలగు ఆయా యింద్రియములు తమ తమ మార్గముల ద్వారా విషయమును గ్రహింపుచుండును.

ఇంద్రియాది మార్గములు కఫములచేత అడ్డగింప బడినయెడల యింద్రియముల శక్తులును ఆ యింద్రియములను తమ కార్యములను చేయజాలక యుండును. వాయువు దేహమంతటను చక్కగా వ్యా పించని స్థలమందు నొప్పియైనను, వ్యాధియైనను పుట్టించి మాంస మును చెరచును. ఇట్లు చేయుచు రంధ్రములు మొదలగునవి కలిగిం చుచు తుదకు దేహమును మొద్దునలె జేయును. అటుపిమ్మట జీవు నకు అపాయము కలుగుచుండును. నాలుకను కదిల్చుట, కాళ్ళు చేతులు ముడుచుట. చాచుట మొదలగు పనులన్నియు వాయువు యొక్క కార్యములగును. దేహమందు ప్రాణవాయువు చక్కగా సంచరించు చున్నప్పుడు యీకార్యములన్నియు చక్కగా జరుగు చుండును. ప్రాణవాయువు చక్కగా సంచరించనియెడల పై చెప్పిన కార్యములను ఆయా అవయవములు చేయజాలవు. ఇట్లు వాతాది దోష ప్రకోపములవలన ఒక్కొక్క దానివలన కలిగెడు రోగములు

లను చెప్పితిని. వాతాదిదోషములలో రెండైనను, మూడైనను కలిసి ప్రకోపించినయెడల అట్టివ్యాధిసన్నిపాత మనబడును. సన్నిపాత గుణము అతిశాశ్చర్యముగా దేహమునుంచి జీవాత్మను విడిపింప జేయును. ఈప్రకారము మృతుడైపోయిన జీవుడు తానుచేసిన పుణ్య పాపముల వలన స్వర్గనరకములను అనుభవించి పిమ్మట తన కర్మ ప్రకారము మనుష్యలోకమందు బుట్టుచుండును. ఈ ప్రకారము మనుష్య దేహము బొందుచు కర్మములను చేయుచు స్వర్గనరకము లను అనుభవించుచు పుట్టుచు, చచ్చుచుందురు. ఆయాజీవులు తాము తమవంశమందు లేనివారై పుణ్యముచేసి. పుణ్యలోకములకును పాప ములుచేసి పాపలోకములకును బోవుచుందురు. అట్టి జీవులు మోక్ష మును పొందజాలరు. కాశ్యపుడా! పుణ్యములను చేసినవారలు ఫలాని పుణ్యలోకములకు పోదురని శాస్త్రములవలన పెద్దలు చెప్పుచుం దురుగదా! అట్టి పుణ్యలోకములను జెప్పెదవినుము. పుణ్యాత్ములగు వారు చంద్రలోకమునందును, నక్షత్రలోకముల యందును, సూర్య లోకమందును నివసించి యుందురు మూడులోకములును తేజోవంత ములై యుండును. ఆయాజీవులుయొక్క పుణ్యభేదమువలన లోక భేద స్థాన భేదములు కలిగియుండును. లోకము లయందు బుద్ధిలేని వారికి అవి మంచివికాజాలవు. ఆయాపుణ్యలోకములకు వెళ్ళినవారు తమతమ పుణ్యములు నశింపగానే మనుష్యలోకములకు నెట్టబడు దురు. అట్టి సౌఖ్యము సౌఖ్యముకాజాలదు. అది శాశ్వతసుఖము కాదు. మోక్షము శాశ్వతసుఖ మగును. అని యిట్లుతెలిపి గర్భము ధరించెడి పద్ధతిని చెప్పెదను వినుమని సిద్ధుడిట్లనెను.

కాశ్యపుడా! కోపగుణముగల జీవుడు చేసిన పుణ్యపాపములు అనుభవించకనే నశింపజాలవు. కోపమువలననే ఆత్మకు జననము కలుగుచున్నది. జననమునకు యిదియే ముఖ్యకారణమగును. స్త్రీ

పురుషులయొక్క రక్తశుక్లములు కలిసి స్త్రీ గర్భమందున్నపుడు బీజరూపమగు బ్రహ్మశక్తి శుక్లరక్తములయందు చేరినయెడల ఆశుక్లరక్తములు పిండమువంటి ఆకారము గలవగును. కాలక్రమమున అండము దేహరూపమై శిరస్సు, కాళ్ళు, చేతులు మొదలగు అవయవములు కలుగును బీజరూపమగు బ్రహ్మశక్తివలన అవయవరూపదేహము యేర్పడుచున్నదని తెలుసుకొనుము. ఇట్లు గర్భమందుగల శిశువు పుట్టుటకు యోగ్యకాలము వచ్చినపుడు తనపూర్వ జన్మపుణ్యకర్మఫలములను అనుభవించుటకై పుట్టి తన కర్మపద్ధతులను పొందును. తానుగర్భమందుండగానే తనతో చేరియుండెడి ప్రారబ్ధము నశించినయెడల తాను గర్భమందు చచ్చిపోవునని చెప్పి మరల యిట్లనెను.

ఈ ప్రకారము జనుడు యెంతపర్యంతము మోక్షపదమును పొందకుండునో, అంతపర్యంతము పుట్టుచు చచ్చుచుండును. గనుక జననమరణములను పొందకుండుటకు ముక్తికారణమగును. అట్టి మోక్షమును చెప్పెదను తెలుసుకొనుము. దానము మనోనిగ్రహము, మంచిస్వభావము. బ్రహ్మచర్యవ్రతము. రక్షించుకొనుటయు, సర్వభూతములయందు కృపయు, పరుల ధన భార్యలను అపహరించక ఆశించకుండుటయు, నియమము కలిగియుండుటయు, జ్ఞానేంద్రియనిగ్రహము, తల్లిదండ్రి గురువులను పూజించుటయు దేవతలను, అతిథులను, పితృదేవతలను పూజించుటయు సత్యము పరిశుద్ధి, శుభముగలిగెడి కార్యమందాసక్తియు, ధైర్యము కలిగియుండుటయు, క్రూరగుణము లేక ప్రవర్తించుటయు యీ గుణములన్నియు పుణ్యములను కలిగించునవి యగును. మోక్షమును పొందదలచినవాడు యీగుణములను మొదట సంపాదించుకొనవలయును. ఇవి సంపాదించుకొనినపిమ్మట ధర్మమార్గములను ఆచరింపుచు పండి

తుల దగ్గరవుండి ధర్మసూక్ష్మములను తెలిసికొనుచు ఆ పండితుల స్వభావములన్నియు యెరుగవలయును. పండితులు చెప్పిన స్వభావము లన్నియు యెరుగవలయును. పండితులు చెప్పిన మంచి అర్థవంతము లైన వాక్యములను మనస్సునందుంచుకొనిన యెడల అట్టివానికి యేవిధములైన కీడులును, కలుగనేరవు. మోక్షమును కోరువాడు వ్రతనిష్ఠగలిగి ప్రవర్తించుచు యింద్రియములను జయించి శాంతి గలిగి బ్రహ్మనిష్ఠగలిగియుండిన యెడల అట్టివానికి బ్రహ్మము అగ్ని వంటిదగును. కర్మసంబంధములగు సంసార వ్యవహారములు సమిధ పుడకల వంటివగును. జలమునంటిది మంత్రమగును. గురువు బ్రహ్మ మగును. అట్టివాడు సూక్ష్మమగు బ్రహ్మచర్యమందు నియమము గలిగి ప్రవర్తింపవలయును. అట్టివాడు సంసారమందు కలిగెడి సుఖ దుఃఖములనెడి గాలిచేత బాధింపబడడు. అట్లు ప్రవర్తించుచుండగా కాలక్రమమున సంసార సాంగత్యమును విడిపించును.

## తత్వజ్ఞాన విశేష ప్రదర్శనము

అని యిట్లు సిద్ధుడుచెప్పి మరల యిట్లనెను, కాశ్యపుడా! సంసారమును కలిగించెడి అజ్ఞానరూపమగు ప్రకృతి ప్రధానమని చెప్ప బడును. ప్రకృతిచేత బ్రహ్మదేవుడు సకల ప్రపంచమును సృష్టించు చుండును. బ్రహ్మదేవుడు సృష్టించెడి ప్రపంచమందంతటను చేతనము కలిగియుండును. ప్రకృతిని క్షరమని పెద్దలు చెప్పుదురు. నశించునది క్షరమనబడును. ప్రకృతికంటె పరమైన తత్వమును అక్షరమనియు, అమృతమనియు పెద్దలు చెప్పుదురు. అక్షరమనెడి తత్వమే ఆత్మతత్వ మగును. ఆత్మప్రకృతులవలన సకలచరాచరభూతములును కలుగుచు న్నవి. ఈ యభిప్రాయము శ్రుతులవలన తెలియబడును. ఆత్మపరమే శ్వరుడు. సకల జీవరాసులకును గమనాగమనములను కలిగించి

భ్రమింపజేయుచుండును. జీవుడు తన పుణ్యాతిశయముచేత తన్ను తాను యెరిగినపుడు సంసారసుఖదుఃఖములు నిత్యములు గావనియు, దేహము మురికి కొంపయనియు సకల ప్రపంచ పదార్థములు అసత్యములనియు కర్మములనుచేయుట అజ్ఞానమనియు తలంచుచుండును. అట్లు ఊహించి తనను కప్పిన అజ్ఞానమనెడి చీకటిని పోగొట్టుకొని మోక్షమును కోరినవాడు సంసార సముద్రమందు మునుగజాలడు. అని యిట్లు చెప్పి మరల యిట్లనెను.

కాశ్యపుడా! జనన మరణ రోగాదులను చూచి భయపడి చక్కగా ప్రకృతి విధమును తెలిసికొని ఆ ప్రకృతివలన కలిగెడి దుఃఖములకు విసిగినవాడు మోక్షపదమును వెదుక గలడు. మోక్షపదమును వెదికెడివారు నిర్జనమైన పరిశుద్ధస్థలమందు కూర్చుండి మనస్సునందు యే చింతయును లేనివారై పరమాత్మను ధ్యానింపుచున్నప్పుడు మనస్సునందు పుట్టెడిసంకల్పములను వెంటనే విడిచి, ధ్యాననిష్ఠను గలవాడును, సర్వభూతములయందును సమబుద్ధిగలిగి యింద్రియ నిగ్రహవంతుడై జ్ఞానాభ్యాసము చేయుచు నిర్భయుడై యుండువాడును, కామక్రోధములులేక అధిక శాంతుడై ఆత్మతత్వవిచారణమును చేయువాడును మాన అభిమానములు లేక సర్వభూతములను తనయందున్నట్లు చూచెడివాడును యీ చెప్పబడినవారలు మోక్షమును పొందుదురు. లాభనష్టములు ప్రియద్వేషములు, సుఖదుఃఖములు యివి యేజనులకు సమానములై యుండునో అట్టివారును, ఆశలేనివారును, అవమానము కలిగినను మనోవికారము చెందనివారును, సర్వధర్మములను ఆచరింపుచున్నను కర్మఫలమును గోరనివారును వీరు సహాయము జేయువారనియు, వీరివలన ప్రయోజనము లేదనియు, తలచక అందరిని సమానముగా జూచుచు ధర్మార్థ కామములయందు యెవరికి యిష్టములేకుండునో అట్టివారును, యెవని

యందు కర్మాసక్తి లేకుండునో వారును, తాపత్రయములు లేక మంచి వైరాగ్యములు గలవారును యీ చెప్పబడిన వారందరును నాశము లేని మోక్షపదమును పొందగలరు. ఆ మోక్షపదము వికారము లేనిదియు, శబ్దస్పర్శ రూపరస గంధములు లేనదియు గుణము లేనిదియు నగును. అట్టి సత్యజ్ఞానానంద స్వరూపమగు మోక్షపదమును సర్వదా ధ్యానముచేత అభ్యసించినవాడు పొందగలడు. సకల సంకల్పములను విడిచి పరమశాంతుడై యుండువాడు అగ్నిహోత్రము కట్టెలను దహించుచు వృద్ధిబొంది ప్రకాశించునట్లు జ్ఞానాగ్నిచేత సకల కర్మములను దహించి నిర్వికార పరమానంద రూపమగు మోక్షమును పొందగలడు. అని యిట్లు సిద్ధుడు జ్ఞానమార్గమువలన మోక్షమును పొందెడి ఉపాయము తెలిపి యోగిజనులచేత అనుభవించబడెడి స్థానమును చెప్పదలచి వినుమని యిట్లనెను.

కాశ్యపుడా! యోగులు యోగమువలననే ఆత్మనుచూచి ఆనందమును పొందుచున్నారు ముంజ యనెడి గడ్డిలోపల నుండెడి యిషీకమనెడి లేతగడ్డినియు క్తి చేతబయటకుతీసినట్లు పంచకోశమయమగు దేహమందుండెడి ఆత్మను ఆకోశమువలన విభజించి తెలుసుకొందురు. (ఇషీకముపైన చుట్టుకొని యుండెడి పెద్దగడ్డి ఆకులను విభజించి యిషీకమును బయటకు తీయుట యిక్కడి యుక్తియని తెలియవలెను,) దేహము ముంజ గడ్డివంటిదియగును. ఆత్మ ఇషీకము వంటిది యగును. యోగులగువారు యీ ప్రకారము ఆత్మలు తెలిసికొందురు. గనుక యోగమార్గము నైష్కర్మ్యరూపమగును. కాశ్యపుడా! యీ ప్రకారము నిష్కర్మరూపముగా జీవాత్మను యోగి యెరుగుచున్నందున అట్లు తనను తాను తెలుసుకొనిన యోగి జనన మరణాది సంసార దుఃఖములను పొందనేరడు.

కాశ్యపుడా ! ము క్తిని బొందినవాడు ముదిమిచావులు లేనివాడై సంసార విషయ దుఃఖములను విడిపించి, యోగమును విడిచినవాడై బ్రహ్మచర్యవ్రత శ క్తివలన తన భక్తులకును మోక్షపదమును యివ్వ గలడు. దేహము స్థిరముగాదని తలంచి ఆత్మయందు అధికనిష్ఠ గల వాడు సకలభూతములవలన భయములేనివాడై రోగాది దుఃఖములను పొందడు. కాశ్యపుడా! యోగనిష్ఠగల వానికి శస్త్రులు మొదలగు వానివలనను, జలమువలనను, అగ్నివలనను, మరికొన్ని హేతువుల వలన బాధలు కలుగజాలవు. అట్టి ఆత్మనిష్ఠగల యోగి దేవేంద్ర పదమునైనను అపేక్షింపడు. గనుక తనయందు పరమాత్మయగు తనను చూచుటకంటె అధికమైన సుఖము మరియొకటి యెక్కడను లేదు. అట్లు తనను తాను తెలుసుకొనుటకు అనుష్ఠింపదగిన అనుష్ఠా నమునకు విసుకక అనుష్ఠించిన యెడల అట్టి శ్రద్ధావంతునకు అవశ్య జ్ఞానము కలుగగలదు. అనుష్ఠానము యెటువంటిది యని అడిగితివేని చెప్పెదవినుము. తాను యెరిగిన ప్రకారము బుద్ధిని దేహములోపల సంచరించునట్లు చేసి పిమ్మట బుద్ధిని మరల బైటకు రాకుండునట్లు దేహములోపలనే వుంచవలయును. ఆ వుంచుట ఎట్లనగా చెప్పెద వినుము. పండ్లును, నాలుకయు, కంఠము, దవడలును, కంఠరంధ్రము, వక్షస్థలము మొదలగు స్థలములకు బుద్ధిప్రవేశించిన యెడల ఆయా స్థలములయందే నిలిపి బయటకు రాకుండునట్లు ఆపవలయును. అర్జునా ! యీప్రకారము సిద్ధుడు కాశ్యపుడను బ్రాహ్మణునకు చెప్పె నని నాతో ఆ బ్రాహ్మణుడు చెప్పి మరుపువలన శిష్యుడా ! అనెడి మాటచేత పిలిచి బ్రాహ్మణుడు కొంచెముసేపు యోచించి నా మొగము చూచి నవ్వుచు నాతో మరల యిట్లనెను.

కృష్ణా! సిద్ధుడనెడివాడను నేనే. నీవెరుంగని విషయము లేదు. నేను కాశ్యపుడనెడి బ్రాహ్మణుడననియు నాకు సిద్ధుడు తత్వజ్ఞాన

వాక్యములను చెప్పెననియు నీతో యిదివరకు చెప్పియుంటిని. నేను కాశ్యపుడ నెడి శిష్యుడనుగాను. ఆ కాశ్యపునకు చెప్పిన సిద్ధుడ నేయని తెలిసికొనుము. కృష్ణా! కాశ్యపుడు మరల నన్నడిగిన పద్ధతియు అందుకు నేనుమరల చెప్పిన వాక్యపద్ధతి చెప్పెద వినుమని యిట్లనెను. మహాత్మా! సిద్ధుడా! పరమమోక్షమును కలిగించెడి సులభమైన సూక్ష్మధర్మమును మరల చెప్పుమని అడుగగా సిద్ధుడిట్లనెను. కాశ్యపుడా! నేచెప్పెడిమాటలను సూక్ష్మబుద్ధిచేత వినుము. అనేక పశువు లుండెడి స్థలమందు పాలకుండను పెట్టినవాడు సకలపనులను చేయు చున్నను పాలకుండను చూచుచున్నట్లు దేహములోపల ముందు చెప్పినప్రకారము మనస్సునుంచి యేమరక ఆత్మను వెదుకుచుండ వలయును. ఆ ప్రకారము ఆత్మను వెదకుటకు ప్రయత్నించినవాడు తెలివిగల మనస్సుచేత మంచి జ్ఞానవంతుడై స్వయంజ్యోతియగు పరబ్రహ్మమును చూడగలడు. కాశ్యపుడా! పరబ్రహ్మతత్వము నేత్రాది యింద్రియములకు కనబడదు. కేవల సాత్వికరూప మగు మనస్సుచేత తెలియబడుచున్నది. పరబ్రహ్మమందు కాళ్ళును చేతు లును, శిరస్సులు మొదలగునవి యన్నియు ప్రకాశించుచుండును. అట్టి విశ్వరూపమగు సగుణబ్రహ్మమును ముందుచెప్పిన ధ్యానయోగి చూడగలడు. కాశ్యపుడా! యీ ప్రకారము తన దేహముకంటె అన్యముగా నుండెడి పరబ్రహ్మమగు తనను చూచు చుండగా అజ్ఞాన మనెడి చీకటిని పోగొట్టెడి వెల్తురు బుద్ధియందు కలిగియుండును. కాశ్యపుడా! బ్రహ్మవిద్యా రహస్యమంతయు నీ కిపుడు చెప్పితిని. ఇంక నీవు సుఖవంతుడవుగమ్ము పొమ్ము. కృష్ణా! అని నేనుచెప్పగా కాశ్యపుడనెడి నా శిష్యుడు సకల సంశయములను విడిచినవాడై వెళ్ళెను. అంతట నేను నీ దర్శనము చేసికొని వెళ్ళుటకు వచ్చినాను. అని యిట్లు సిద్ధుడు నాతో చెప్పి కనబడకపోయెను. అర్జునా! పరమ

గీతయనెడి వాక్యార్థములను నీవు వింటివిగదా. నీవు యుద్ధము ప్రారంభించునపుడు రథమునుండి యీ వాక్యార్థమునే నీకు చెప్పియున్నాను. అని కృష్ణుడు చెప్పి అర్జునునితో యిట్లనెను.

అర్జునా! యీ బ్రహ్మవిద్యను సందేహము గలవానికి అధికారి గానివానికిని, శాంతము లేనివానికిని చెప్పరాదు. నేను సృష్ట్యాది యందు యీ బ్రహ్మవిద్యను నీవుతప్ప యితరమనుష్యులు వినుటకు యోగ్యులుగారు. బ్రహ్మవిద్య అధికరహస్యమైనది యగును. ఈ చెప్పనప్రకారము తత్వజ్ఞానమువలన బ్రహ్మవస్తువును చూచినవారు పురుషులైనను. స్త్రీలైనను, వైశ్యులైనను, శూద్రులైనను, సంసార దుఃఖములను విడిచి మోక్షమును పొందగలరు. బ్రాహ్మణులును, రాజులును, జ్ఞానమువలన మోక్షమును పొందుటకు సంశయములేదు. పాపయోనులను వైశ్యులే జ్ఞానమువలన ముక్తిని బొందుచుండగా పుణ్యాత్ములగు బ్రాహ్మణ క్షత్రియులకు జ్ఞానము వున్నయెడల మోక్షముబొందుదురని చెప్పవలసిన పనిలేదు. అర్జునా! నిన్ను బోధించుటకు మోక్షోపాయములను చెప్పితిని. ఈ ఉపాయమువలన ఆత్మను దెలిసికొనిన వానికి కలిగెడి సుఖముతో సమానమగు సుఖము మరియొకటి కలుగనేరదు. ఈ మోక్షోపాయ ప్రకారము శ్రద్ధగలిగి సకలలోకవ్యవహార చింతను విడిపించి ఆత్మవిచారణమును చేయువాడు మోక్ష లక్ష్మీపతియగును. ఇందుకు కొంచెమైనను సంశయము లేదు.

అర్జునా! నీకుచెప్పవలసినఅన్నివిషయములను చెప్పితిని. నేను చెప్పినట్లు నీకు మరియొక డెవడును చెప్పజాలడు. నేను ముందు చెప్పిన ప్రకారము ధ్యానయోగమును ఆరుమాసముల పర్యంతము అభ్యసించినవా డిట్టియోగసిద్ధిని పొందగలడని కృష్ణు డర్జునునకు అధ్యాత్మవిషయములగు వాక్యములను చెప్పెనని వైశంపాయనుడు

జనమేజయునితో చెప్పగా జనమేజయుడిట్లనెను. మహాత్మా! వైశంపాయనమునీంద్రా! అటుపిమ్మట కృష్ణార్జునులు యేప్రకారముగా ప్రవర్తించిరో చెప్పుమని యడిగెను.

ఇది శ్రీ మహాభారతమునందలి అశ్వమేధపర్వమునందు
ప్రథమాశ్వాసము

---

## ద్వితీయాశ్వాసము

---

దేవా! హరిహరనాథా! వైశంపాయనమునీంద్రుడు జనమేజయునితో యిట్లనెను. జనమేజయ మహారాజా! కృష్ణుడర్జునునకు బ్రహ్మవిద్యావిషయములైన వాక్యములను చెప్పి అర్జునునియందుగల ప్రేమచేత యిట్లనెను. అర్జునా! భార్యాభర్తలకు జరిగిన సంవాదమొకటి కలదు. ఆ సంవాదము అభయమనెడి పేరుగలిగి యితిహాసరూపముగా లోకమందు ప్రవర్తించియున్నది. ఆ యితిహాసమును జెప్పెదను వినుము. అర్జునా! మంచి తత్వజ్ఞాన విచారవంతుడైన యొక బ్రాహ్మణోత్తము డొక పరిశుద్ధమైన స్థలమం దుండెను. బ్రాహ్మణుని భార్య అధికవినయముతో తిన్నగా బ్రాహ్మణుని దగ్గరకు వచ్చి నమస్కరించి యిట్లనెను. మహాత్మా! ప్రాణనాథా! నాకు అధ్యాత్మజ్ఞానమును దెలిపి నన్ను కృతార్థురాలనుగా జేయుమని ప్రార్థించగా బ్రాహ్మణుడు కృపగలవాడై చిరునవ్వుతో తన భార్యను జూచి యిట్లనెను. ప్రియురాలా! యీమాటకు నామనస్సు సంతోషించెను. ఇంత అధికవిద్యను స్త్రీకి యెట్లుచెప్పవచ్చునా అని నేను తలచక నీకు మంచిమాటలన్ను చెప్పెదను వినుము. అని చెప్పి

బ్రాహ్మణుడు పతివ్రతతో యిట్లనెను. సుందరీ! కర్మములను చేయువారలు అజ్ఞానముచేత మోహింపబడినవారలై కర్మములవలన సకల సిద్ధులును కలుగునని చెప్పుచు, పరులవలన వినుచు చేయుచుండగా జూచుచు కర్మములను చేయుచుందురు. అట్లు కర్మములను చేయువారలు లోకమందు కర్మసన్యాసరూపమగు నిష్కర్మత్వము లేదనియు యెవరైనను బ్రహ్మనిష్ఠ కలిగి కర్మమును సన్యసించి యుండిరేని అట్టివారిని నిందింపుచుందురు. కర్మసన్యాసమార్గము మిక్కిలి శ్రేష్ఠమైన దగును. నిష్కర్మరూపమగు మనస్సునందు పరబ్రహ్మము నిర్వికారముగా ప్రకాశించుచు తోచుచుండును. బ్రహ్మాదులగు దేవతలందరును యింద్రియములను జయించి శాంతనిబొంది అక్షరమగు పరబ్రహ్మ తత్త్వమును ఉపాసించుచుందురు. అక్షరములయొక్క స్వరూపపద్ధతులను చెప్పెదను వినుము. ప్రియురాలా! అక్షరమనెడి ఆత్మతత్త్వము శబ్దస్పర్శరూప రసగంధములలో నెద్దియును గాని హేతువుచేత శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణము లనెడి యింద్రియములచేత గ్రహింపబడదు. ఆత్మతత్త్వము కేవల సాత్వికరూపమగు నిర్మలబుద్ధిచేత తెలియబడుచున్నది. ఆత్మతత్త్వమును ఆశ్రయించుకొని ప్రాణాది పంచవాయువులును వర్తింపుచున్నవి. మరియు ఆ పంచవాయువులు ఆత్మతత్త్వమందే లయింపుచుండును. ప్రాణఅపానవాయువులు రెండును సమానమనెడి పేరుగల వ్యానవాయువుయొక్క మధ్యమందు నడుచుచుండును, ప్రాణఅపానవాయువులకు నడిమి ప్రదేశము తట్టు ఉదానవాయువు సంచరించుచుండును. ఇట్లు శ్రుతి స్పష్టీకరించి యున్నది. ప్రియురాలా! జీవుడు ప్రాణ అపానవాయువులయందు కలిసి నిద్రించినయెడల అంతట సమాన వ్యానము లనెడు రెండు వాయువులును లయింపుచుండును. ఈవిషయమందు యోగులగువారు సంశయింపరు. ప్రాణనాయకీ! జీవుడు ఉదానవాయువులతో కలిసి నిద్రిం

చిన యెడల ప్రాణఅపానవాయువులు రెండును పురుషుని విడువవని తెలిసికొనుము. యోగులగువారు యీప్రకారము చూచుచుందురు. ఇట్లు చెప్పుటచేత సమాన వ్యానవాయువులు రెండును యేకరూపముగా నున్నట్లు స్పష్టమగుచున్నది.

## అంతర్యాగ ప్రకారము

సుందరీ! ఇకను అంతరయజ్ఞ క్రమమును చెప్పెదను వినుము. 1. ప్రాణము 2. అపానము 3. ఉదానము 4. సమానము 5. వ్యానము యీఅయిదువాయువులును 6. మనసు 7. బుద్ధియు నీ యేడును వైశ్వానరుడనెడి అగ్నికి నాలుక లగును. ప్రాణులదేహమందు అగ్నిరూపముచే ప్రకాశింపుచుండెడి ఆత్మవైశ్వానరుడని యెరుగవలయును. 1. ఘ్రాణేంద్రియముచేత వాసనచూడతగినదియు 2. జిహ్వేంద్రియము చేత భక్షింప దగినదియు 3. నేత్రేంద్రియముచేత చూడదగినదియు 4. త్వగింద్రియముచేత స్పృశింపదగినదియు 5. శ్రోత్రేంద్రియముచేత వినదగినదియు 6. మనస్సుచేత తెలియదగినదియు 7. బుద్ధిచేతబోధింపదగినదియు అగు యీవిషయములు ఏడును సమిధలనెడి పుడకలగును. 1. ఘ్రాణేంద్రియముచేత వాసనచూచెడివాడును 2. జిహ్వేంద్రియముచేత భక్షించెడివాడును 3. నేత్రేంద్రియముచేత రూపమునుచూచెడివాడును 4. త్వగింద్రియముచేత స్పృశించెడివాడును 5. శ్రోత్రేంద్రియముచేత శబ్దమును వినెడివాడును, 6. మనస్సుచేత యెరిగెడివాడును 7. బుద్ధిచేత బోధించెడి వాడును అగు యీ ఏడుగురును ఋత్విజు లగుదురు. ఈ యేడుగురు ఋత్విజులును ముందు చెప్పిన ఘ్రాణేంద్రియాదులయొక్క విషయములనెడి హావిస్సులేడింటిని వైశ్వానరుని నాలుకలయందు క్రమముగా హోమముచేసెడి వారగుదురు. ఇట్లు యోగిజనులు జీవాత్మను ఉపద్రష్టగా యేర్పరచుకొని అంతర

యజ్ఞమును నడుపుదురు. యజ్ఞము చేయించెడు ముఖ్య ఉపాధ్యాయుడు ఉపద్రష్టయని చెప్పబడును. ఇది సప్తహోతృవిధానయజ్ఞ ప్రకారమని తెలిసికొనుము. ఇక దశహోతృవిధానయజ్ఞ ప్రకారమును చెప్పెద వినుము. వైశ్వానరునకు పదిముఖములుగలవు. అవి చెప్పెదవినుము. 1. దిక్కు 2. ఆకాశము 3. సూర్యుడు 4. చంద్రుడు 5 భూమి 6. అగ్ని 7. విష్ణువు 8. ఇంద్రుడు 9. ప్రజాపతి 10. మిత్రుడు అనెడి యీపదియు, పూర్వము చెప్పిన వైశ్వానరునకు ముఖములగును. 1 శబ్దము 2. స్పర్శము 3. రూపము 4. రసము 5. గంధము 6. వాక్కుచే చెప్పదగినదియు 7. చేతిచే చేయదగినదియు 8. పాదముచేత వెళ్ళదగినదియు 9. గుదముచేత పురీషమును విడుచుటయు 10. ఉపస్థముచేత ఆనందించుటయు యీ పదియు హావిస్సులగును 1. శ్రోత్రము 2. త్వక్కు 3. చక్షువు 4. జిహ్వాయు 5. ఘ్రాణము 6. వాక్కు 7. పాణి 8. పాదము 9, పాయువు 10. ఉపస్థ యీపదియు హోతలగుదురు. ఈపదిమంది హోతలచేత ముందు చెప్పిన పదివిధములగు హావిస్సులను వైశ్వానరుని పదిముఖములయందు హోమమును చేయించవలయును. జీవాత్ముండు ఉపద్రష్టయగును. ఇట్లు దశహోతృ విధానముగా యజ్ఞముచేసి యోగిజనులు జననమరణాది సంసారబంధమువలన ముక్తులగుదురు. ముందు చెప్పిన సప్తహోతృ విదాన యజ్ఞప్రకారముగానైనను, దశహోతృవిధాన యజ్ఞప్రకారముగానైనను అంతర యజ్ఞమును నడిపిన వారికి మరల జన్మము కలుగదు. బాహ్యాయజ్ఞమును చేసినవారలు పరలోకములకువెళ్ళి మరలవచ్చి మనుష్యులై పుట్టుచుందురు. అంతర యజ్ఞమును నడిపిన వారలకు మరల జన్మముకలుగక నిత్యసౌఖ్యమైన మోక్షమును పొందుదురు. అని యిట్లు బ్రాహ్మణుడు తన భార్యతో చెప్పి యిట్లనెను.

భార్యామణీ! ప్రణవము మొదలగు స్వరూప స్వభావమును నిశ్చయించి చెప్పునప్పుడు వాక్కు పుట్టుచున్నది. ఆవాక్కును వెంబ డించుకొని పురుషార్థబుద్ధిగలదై మనస్సు వాక్కు వెనుక ప్రవర్తించు చుండును. అని బ్రాహ్మణుడు చెప్పగా అతని భార్య యిట్లనెను. మహాత్మా! ప్రాణనాథా! మనస్సు ప్రేరేపణము చేసిన సమయమున వాక్కు పుట్టి పైకివెడలి ఉచ్చరింపబడు చున్నది. ఇట్లయినప్పుడు వాక్కును అనుసరించి మనస్సు ప్రవర్తించుచున్నదని మీరు చెప్పితిరి. అదియేమని ప్రశ్నించగా బ్రాహ్మణుడిట్లనెను. ప్రియురాలా! ఉదాన వాయువు మనస్సు, యివిరెండునుకూడ ప్రేరేపణము చేయగా ఆ రెంటివలనను వాక్కు కలుగుచున్నది. నీవు చెప్పినమాటయు జనుల అనుభవప్రకారమే యున్నది. అయినను లోకమందు కార్యమును గురించి మాటలాడు సమయమున మాటల ననుసరించి మనస్సు ప్రవ ర్తింపుచున్నందున నేనును, వాక్కుననుసరించి మనస్సు ప్రవర్తింపు చున్నదని చెప్పితినేగాని మరియొకటికాదు. అని బ్రాహ్మణుడు చెప్పి మరల యిట్లనెను.

సుందరాంగీ! పూర్వము మనోవాక్కులు రెండును చేరి బ్రహ్మ దేవుని దగ్గరకుబోయి మాయిద్దరిలో అధికులెవరో చెప్పుమని ప్రశ్నిం చగా మనస్సు అధికమైనదియని బ్రహ్మదేవుడు చెప్పెను. వాగ్దేవి బ్రహ్మదేవునితో యిట్లనెను, నా హృదయేశ్వరా! బ్రహ్మదేవా! నేను నీకు కామమోహినియగు భార్యనై యుంటిని. అట్టి నన్ను మనస్సుకంటె తక్కువని యెట్లు చెప్పితివని ప్రశ్నించగా బ్రహ్మదే వుడు వాగ్దేవినిజూచి యిట్లనెను. వాగ్దేవీ! స్థావరమనస్సనియు, జం జంగమమనస్సనియు నాకురెండు మనస్సులు గలవు. ఆ రెంటిలో స్థావర మనస్సు నీదగ్గిరయుండును. జంగమమనస్సునాదగ్గరయుండును. నీవలన కలిగెడి వర్ణమంత్ర స్వరములు జంగమ మనస్సుని తెలుసుకొనుము.

వంగను మనస్సుకంటె నీవు అధికమైన దానవగుదువు. నీకంటె స్థావరమనస్సు అధికమైనదగును గనుక నన్ని మాటను నీవు అన తగదు. అని బ్రహ్మదేవుడు నిశ్చయించిచెప్పగా ఆమాటలను వాగ్దేవి విని బదులుచెప్పక మూర్ఛపోయి కొంతసేపటికి మూర్ఛ తెలిసి కొని బ్రహ్మదేవునకు నమస్కరించెను. అని యిట్లు బ్రాహ్మణుడు చెప్పగా ఆతనిభార్య యిట్లనెను. ప్రాణనాథా! బ్రహ్మదేవునిమాటకు మూర్ఛిల్లిన వాగ్దేవి దేనిచేత మూర్ఛతెలసెనో చెప్పుమని ప్రశ్నించగా బ్రాహ్మణుడిట్లనెను. ప్రియురాలా! ఆవాక్కు ప్రాణఅపాన వాయువులతట్టు నిలిచి యుండును గనుక ప్రాణవాయువు వాగ్దేవిని చుట్టుకొని వాక్కుయొక్క క్షీణత్వమును పోగొట్టెను. వాగ్దేవి! బ్రహ్మదేవునియొక్క ప్రభావమందు నివసించి యుండుటవలన అధికమైన దని తెలుసుకొనుము. సుందరీ! వాక్కుమనస్సుయొక పద్ధతు లును చెప్పెద వినుము. వాక్కు ప్రాణవాయువుచేత చుట్టబడినదై అపానవాయువునుబొంది తాను ఉదానవాయురూపము గలదగుచు దేహమును విడిపించి వ్యానవాయువుయొక్క పనియగు సర్వవ్యాప కత్వమును పొందినయెడల అపుడు సమాన వాయువునందు మనస్సు స్థిరముగా నిలిచియుండును. మనస్సు స్థిరముగా నుండుటయే ముక్తికి కారణమగును.

భార్యామణీ! ఘోషిణియనియు, అఘోషిణియనియు రెండు విధములుగా వాగ్దేవి ప్రకాశించుచుండును ఆ రెండువిధములలో ఘోషిణియనెడి విధముగల రూపము మిక్కిలి శ్రేష్ఠమగును, శ్రేష్ఠ ములైన పాలను గోవుయిచ్చినట్లు ఆఘోషిణియనెడు వాగ్దేవి నాశము లేని దివ్యప్రభావముగల పరబ్రహ్మమును వాదింపుచుండును. ఈ ప్రకారము వాగ్దేవియొక్క పద్ధతిని యెరుగుటవలన మహానందము కలుగును. అని బ్రాహ్మణుడు చెప్పి మరల యిట్లనెను, మనోహరీ!

శ్రోత్రాది జ్ఞానేంద్రియములైదును. మనోబుద్ధులు రెండును, యివి యన్నియు తనకు ఆధారుడగు యొకఆత్మయందే యుండినను తమ తమ విషయములను తప్ప యితరవిషయములను యెరుగజాలక కల హించుకొనుచుండునని బ్రాహ్మణుడు చెప్పగా అతనిభార్య యిట్లనెను. మహాత్మా! ప్రాణనాథా! ఆ యింద్రియ మనస్సులు కలహించుకొను విధమును చెప్పవలసినదని ప్రార్థించగా బ్రాహ్మణుడిట్లనెను. భార్యామణీ! వాసనను ఘ్రాణేంద్రియ మెరుగునేగాని, తక్కిన శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వేంద్రియములును, మనోబుద్ధులును యెరుగ జాలవు. రసమును జిహ్వేంద్రియమే యెరుగునుగాని తక్కిన ఆరును యెరుగవు. రూపమును చక్షురింద్రియమే యెరుగునుగాని, తక్కిన ఆరును యెరుగనేరవు. స్పర్శమును త్వగింద్రియమే యెరుగును. గాని, తక్కిన ఆరును యెరుగజాలవు. శబ్దమును శ్రోత్రేంద్రియమే యెరుగునుగాని, తక్కిన ఆరును యెరుగనేరవు. సంశయించెడి తెలివి మనస్సునందే యుండునుగాని తక్కిన ఆరింటియందును. కలుగనేరదు. నిష్ఠబుద్ధివలననే యగునుగాని తక్కిన ఆరింటివలన కలుగనేరదు. ఈ ప్రకారము ఒక్కొక్క యింద్రియమునకు యొక్కొక్క విషయ జ్ఞానమే యుండునుగాని ఇతరవిషయ జ్ఞానముండదని తెలిసికొనుము.

## ఇంద్రియమనః పరస్పర సంవాదము

ప్రాణనాయకీ! ఇట్లు యొక్కొక్క యింద్రియమునకు యొక్కొక్క విషయ జ్ఞానముండుట స్పష్టమాయెను గదా! యింద్రియములన్నియు యేకీభవించి పూర్వము ఒకానొకప్పుడు మనస్సునుజూచి యిట్లనెను. మనస్సా! మేమును నీవును ఒక్కరూపమే యగుదుము అని చెప్పగా అపుడు యింద్రియములను జూచి మనస్సు యిట్లనెను, ఇంద్రియములారా! నేనున్నందుననే మీరందరును మీమీవిషయ

ములను యెఱుగుచున్నారు. నేను తొలగిన యెడల ముక్కు వాస నను గ్రహింప నేరదు. నాలుక రుచిని యెఱుగజాలదు. నేత్రము రూప మును చూడ నేరదు. చర్మము స్పర్శమును యెఱుగ నేరదు. చెవిశబ్ద మును యెఱుగ నేరదు. మీతో నేనును సమానమైన దానవని చెప్ప రాదు. నేను మీయందరికంటె శ్రేష్ఠమగుదును. నేను నిశ్చయముగా తొలగిపోయినయెడల మీరందరును చల్లారిన నిప్పువలె జనులు లేని గృహములవలెను అప్రయోజకములైన స్వరూపములు కలిగి యుం దురు. గనుక మనలోపల నేను అధికమైన దాననగుదును. ఇది నిశ్చ యమేగాని అబద్ధముకాదు. అనిమనస్సు చెప్పగా అపుడుయింద్రియము లిట్లనెను. మనస్సా నీవు చెప్పినదంతయు, నిశ్చయమే యగును. ఇంతమాత్రముచేతనే నీకు అధికత్వము కలుగ నేరదు. మమ్ములను నీవు విడిచి నీయుంతటనీవు ఒక విషయమును అనుభవించితివేని అపుడు నీవు అధికమైన దానవని చెప్పవచ్చును. మా అయిదుగురిలో ఒక యింద్రియము నశించినయెడల ఆ నశించిన యింద్రియ విషయ మును నీవు అనుభవింప నేరవు అదియునుగాక శబ్దమును శ్రోత్రము వలననే తెలిసికొని అనుభవించెదవేగాని మరియొక యింద్రియము చేత అనుభవింపజాలవు. స్పర్శమును త్వగింద్రియముచేత అనుభవిం చెదవేగాని మరియొక యింద్రియముచేత అనుభవింప నేరవు. రూప మును నేత్రేంద్రియముచేత అనుభవించెదవేగాని మరియొక యింద్రి యముచేత అనుభవింప నేరవు. రసమును జిహ్వేంద్రియముచేత అనుభవించెదవేగాని మరియొక యింద్రియముచేత అనుభవింప జాలవు. వాసనను ఘ్రాణేంద్రియముచేత అనుభవించెదవేగాని మరి యొక యింద్రియముచేత అనుభవింప నేరవు. ఇట్లు శక్తి లేనిదానవ య్యును, మాకంటె అధికత్వమునకు వ్యర్థముగా ఆశపడితివిగాని అధికత్వము నీకు కలుగ నేరదు.

మనస్సా! ఆయా విషయములను మేము మొదట గ్రహించిన వెనుక నీవు అనుభవించుచున్నావు గనుక నీవే తెలుసుకొని యోచించి మనలో యెవ్వరధికులో చెప్పుము. నీవు లయించినపుడు ప్రాణ యలు కాపాడుటచేతను, మాయందు పూర్వము తెలియబడిన పదార్థ జ్ఞానశక్తి నిలిచి యుండుటవలనను, నీకు పిమ్మట తెలివికలుగు చున్నది. గనుక యీ విషయమునుకూడ ముఖ్యముగా చేర్చుకొని యోచించుము. మనస్సా! అట్లు కాదనియు. ఇట్లనియు ఆజ్ఞాపించుట కొరకు ఒక ఉపాధ్యాయుడు మంచిచేప్పుటకు శిష్యులదగ్గరకుబోయి వారికి వినిపింపదలచిన వారివలన చక్కగా తాను చెప్పదలచిన అభి ప్రాయములను వినినట్లు మిమ్ము సహాయము చేసికొని విషయము లను నీవు అనుభవింపుచున్నావు. నీకుస్వప్నములుకలిగినప్పుడు మేము లేనందున ఆ స్వప్నవిషయములు అబద్ధము లగుచున్నవి. అట్లు అబ ద్ధము లైనపుడు వాకిలిలేని గృహమునుపొంది లోపలికిపోజాలక వెను కకుతిరిగి వచ్చినట్లు అవమాన పడెదవు గాని వాస్తవమైన జీవనము నీ కెప్పటికిని కలిగియుండలేదు గనుక యిది యంతయు చక్కగా యోచించుకొనుము. మేము నీవునుకలిసి ప్రవర్తించిన యెడల నీకు సకల భోగములును కలుగుచున్నవి. అని యిట్లు మనస్సును, యింద్రి యములును సంవాదము చేసికొనెనని చెప్పి బ్రాహ్మణుడు మరియొక విషయమును వినుమని తనభార్యనుజూచి యిట్లనెను. భార్యామణీ! ప్రాణము మొదలగు పంచవాయువులును యేకీభవించి ఒక్కటేసారి బ్రహ్మదేవుని దగ్గరకుబోయి యిట్లనిరి. మహాత్మా! బ్రహ్మదేవా! మాలో అధికుడెవడో చెప్పుమని ప్రశ్నించగా అప్పుడు బ్రహ్మదేవు డిట్లనెను. ప్రాణాదివాయువులారా! మీలో నెవ్వరు, యెవ్వరివలన కార్యములు చేయుటవలన అధికు లగుదురు. మీ రందరును అన్యోన్యమిత్ర భావములను పొందియుండుడు. ఇట్లు అన్యోన్యస్నే

హాము గలిగి యున్న యెడల మీకు మేలుకలుగును. కొండని చెప్పగా ఆసమయమున బ్రహ్మదేవుని మాటవలన వాయువులన్నియు సమత్వము గలిగియుండెను. ప్రియులారా! ప్రాణనాయకీ! వాయువువిషయమై నారద దేవమతసంవాదము కలదు. అదిచెప్పెద వినుము దేవమతుడనెడి యొక బ్రాహ్మణుడు పరిశుద్ధ ప్రదేశమందు నారదమహామునినిజూచి వినయభక్తులతో నమస్కరించి నారదుని సమీపమునకు వెళ్ళెను. అంతట నారదుడు యిక్కడకు రమ్మని పిలిచెను. ఆసమయమున బ్రాహ్మణుడు నారదుని దగ్గిర కూర్చుండి వినయముతో చేతులుజోడించుకొని నమస్కరించుచు యిట్లనెను.

మహాత్మా! నారదమునీంద్రా! ప్రాణాదిపంచ వాయువులలో ఏవాయువువలన జంతువు మొట్టమొదటపుట్టి ప్రవర్తించుచుండునో చెప్పుమని ప్రశ్నించగా నారదుడిట్లనెను. బ్రాహ్మణోత్తమా! మొట్టమొదట జీవుని గర్భమందు నివసించుటకు ఏవాయువు ప్రవేశింపజేయునో ఆజంతువు పుట్టెడిసమయమందు జంతువులోపల కలిసియుండెడి ఆ వాయువే జంతువులను బయటకు రప్పించి వృద్ధిబొందించును. పురుష శిశువునందు సమాన వాయువును స్త్రీ శిశువునందు వ్యానవాయువును చేరినవై పుట్టించుచుండును. బ్రాహ్మణోత్తమా! శుక్లశోణితమువలన పిండము కలుగుచున్నవి, పిండమందు దైవముచేత సమాన వ్యానవాయువులద్వారా జీవుడు ప్రవేశించి పురుషుడైగాని స్త్రీ రూపముగా గాని పుట్టునని తెలుసుకొనుము. ఇట్లు శుక్లరక్తములు చేరుటయు అందువాయువుచేత జీవుడు ప్రవేశించుటయు యీమొదలగున్నవన్నియు దైవమువలననే కలుగుచున్నవని యెరుగవలయును. అట్లు గర్భమునందుండెడి పిండము రక్తమువలన వృద్ధిబొందును. శుక్లమువలన ప్రాణవాయువు వృద్ధిబొందును. ప్రాణశుక్లములను ముఖ్యకారణముగా జేసికొని అపానవాయువు నడుచుచుం

డును. గర్భమందుండెడి శిశువునందు ప్రాణవాయువు అధోగతిగా సంచరించుచుండును. యీప్రకారముగా సంచరించెడి ప్రాణఅపానములనెడి రెండువాయువులయందును ఉదాన వ్యాన సమానములనెడి మూడు వాయువులును వర్తించుచుండును. అందు ఉదానవాయువు అగ్నిమయముగా నుండును. బ్రాహ్మణోత్తమా! అగ్నిహోత్రుడు సకల దేవస్వరూపుడగును. ప్రాణఅపాన వాయువులకు నడుమ ప్రవర్తించెడి ఉదానవాయువు అగ్నిస్వరూపమని తత్వజ్ఞానులు చెప్పుదురు. ప్రాణ అపానములే అహోరాత్రములనియు, శుభ అశుభములనియు, సత్య అబద్ధములనియు, సత్తు అసత్తులనియు యిట్లు జంట లగు యితర పేర్ల చేత చెప్పబడు చున్నవి. ప్రాణ అపానములయొక్క మధ్యమందు అగ్నిరూపమైన ఉదానవాయువు నిర్ద్వంద్వరూపముగా నున్నట్లు యోగీశ్వరులు చూచుచుందురు. పరమ శాంతియనెడి పదార్థమునకు, బ్రహ్మమనెడి మంత్రమునకును, భేదము లేదని చెప్పినట్లు పరబ్రహ్మమునకు ఉదానవాయు రూపమును, కలిగియున్నదని బ్రహ్మదేవుడు చెప్పగా వినియున్నాము. అని యిట్లు దేవమునియగు నారదుడు దేవమతుడనెడి బ్రాహ్మణునకు గర్భస్థ శిశుసమాచారము చెప్పినట్లు బ్రాహ్మణుడు తన భార్యను జూచి చెప్పి యిట్లనెను. భార్యామణీ! యీపైనచెప్పిన ప్రకారము యింద్రియమనో వాయువులయొక్క పద్ధతులను తెలుసుకొనుటవలన వీనియన్నిటికంటె పరమైన ఆత్మతత్వమును తెలిసికొనుటకు సులభమైయుండును. గనుక శ్రేష్ఠమైన రహస్యమును జెప్పెద వినుమని బ్రాహ్మణుడు తనభార్యతో యిట్లనెను.

## జీవాత్మస్వరూప నిరూపణప్రకారము

ప్రియులారా! ప్రాణనాయకీ! కరణ కర్మకర్తలనెడి యీ మూడింటిచేతను సకలలోకములును వ్యాపించబడియున్నవి. పనిచేయు

టకు తగిన పనిముట్లు కరణమనబడును. చేయుట కర్మమనబడును. చేసెడివాడు కర్తయనబడును. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములనెడి జ్ఞానేంద్రియములైదును. మనోబుద్ధులు రెండును, యీ ఏడును కరణమునకు హేతువులగును, ఈ ఏడింటియొక్క విషయములగు శబ్ద స్పర్శ రూప, రస, గంధ, సంకల్ప, నిశ్చయములనెడి ఏడును కర్మ హేతువులగును. ఇంద్రియమనస్సులతో గూడియుండి అజ్ఞానముచేత మోహించి తనను తాను యెరుగకుండెడి జీవుడు కర్తృత్వమునకు హేతువగును. ఇంద్రియమనస్సులకంటెను వాని విషయములగు శబ్ద స్పర్శాదులకంటెను జీవాత్ముడు అన్యుడగును. ఆ జీవాత్మునకు విషయములను అనుభవించెడి నేర్పరితనము స్వతః లేదు. సకలవిషయములను అనుభవించుచుండగా ఆ జీవాత్మ తన స్వరూపమును తాను తెలిసికొనజాలక మనస్సే తానని అభిమానించి సుఖదుఃఖరూపమగు విషయభోగమును అనుభవించుచున్నాడు. గనుక యింద్రియ మనస్సులే జీవాత్మకు కర్తృత్వమును కలిగించుటకు హేతుభూతములగునని తెలిసికొనుము. ఆవిషయసుఖదుఃఖములను అనుభవించుటకు యిష్టపడక జీవుడుచేసెడి నిష్ఠలన్నియు మోక్షహేతువులగును. కర్మమును తెలిసిపెడి శాస్త్రవిధి కారకమనబడును. భార్యామణీ! యీ చెప్పినప్రకారము కరణకర్మకర్తృకారక రూపములుగ నుండెడి జీవాత్ముడు భోక్తయైనందున తక్కిన యింద్రియ మనోవిషయాదులన్నియు హవిస్సులవంటివగును. హవిస్సులను ఆత్మయనెడి అగ్నియందు సాక్షిభావమనెడి నిష్ఠచేత హోమము చేయవలయును. అట్లు చేయుగా ఆత్మయనెడి అగ్నిహోత్రము చక్కగామండి అవిద్యయనెడి పొగలేనిదగుచు ప్రకాశించుచుండును. అట్లు ప్రకాశించుటయే మోక్షపద్ధతి యగును. ఈ చెప్పినప్రకారము జీవాత్ముడు ప్రవర్తింపక తాను భోక్తనని తలచియుండినయెడల అదియే బంధమగును.

గనుక ఆజీవుడు తనయందు అవిద్యచేత కల్పితమైన దేహేంద్రియాది ప్రపంచముకంటె తనను వేరుగా చూచుచు పూర్వోక్త ఆంతర యజ్ఞమును చేయవలయును. అని యిట్లు బ్రాహ్మణుడు నిశ్చయించి చెప్పి మరల యిట్లనెను.

భార్యారత్నమా! మోక్షభావమునకు మూలమైన యోగ యజ్ఞమందు నేను ప్రవర్తించుచున్నాను ఆయోగయజ్ఞమునకు సర్వ సంకల్ప పరిత్యాగరూపమైన కర్మసన్యాసమే దక్షిణయగును. అట్టి దక్షిణచేత పూర్వోక్తయోగయజ్ఞమును చేసినయెడల సర్వాత్మకుడైన నారాయణమూర్తి సంతోషించి అట్టియోగిని తనలో ఐక్యము చేసికొనును. అట్టి స్థితియే ముక్తియని మునులు చెప్పుచున్నారు. అని బ్రాహ్మణుడు యిట్లనెను. ప్రాణనాయకీ! నారాయణమూర్తి యొక్కడే సర్వలోకములను శిక్షించువాడగును. అతని ఆజ్ఞాప్రకారము నేను ప్రవర్తించుచుందును. నారాయణమూర్తి యొక్కడే సర్వలోకములకును గురుడగును. గురువు చెప్పిన అభిప్రాయమును నా చిత్తమందుంచుకొని మరువకయుందును. నారాయణు డొక్కడే సర్వమును వినెడివాడగును. అతనిని యెరుగవలెననెడి బుద్ధిచేత సర్వదా ప్రవర్తించుచుందును. నాకు దుఃఖముకలిగినపుడు నారాయణుని చూచుచు నా దుఃఖమును పోగొట్టుకొందును. దుఃఖమును పోగొట్టుకొనెడి విధమును పెద్దలవలన నేను తెలుసుకొనియున్నాను. భార్యారత్నమా! పూర్వము దేవతలును, మునులును బ్రహ్మదేవుని దగ్గరకుపోయి మాకు మేలును కలిగించెడి పనియెద్దియో చెప్పుమని యడిగిరి. బ్రహ్మదేవుడు అక్షరుడగు ఆత్మధ్యానము చేసినయెడల నీకు మేలుకలుగునని చెప్పెను. గనుక భార్యామణీ! దుర్గమప్రదేశ మనెడి దుఃఖమును నేను దాటెదను. దుర్గమనెడి దుఃఖమును దాటెదనని చెప్పవలసిన పనిలేదు. అట్టిదుఃఖమును యిదివరకే దాటి

యున్నాను. ఆదుర్గమనెడి దుఃఖప్రదేశమునకు క్రోధము చీకటివంటిది యగును. లోభము సర్పమువంటిదగును. కామము దొంగలవంటి దగును. అంధకార సర్పచోర బాధలుగల సంసారదుఃఖ మనెడి దుర్గమప్రదేశమును దాటి ఒకవనమున ప్రవేశించితిని. అని బ్రాహ్మణుడు చెప్పగా అతనిభార్య యిట్లనెను. మహాత్మా! ప్రాణనాథా! ఆవనము యెటువంటిదో చెప్పుమని యడుగగా బ్రాహ్మణుడు యిట్లనెను.

సుందరాంగీ! వనముకంటె సూక్ష్మవస్తువులును, పెద్దవస్తువులును లోకమం దెక్కడను లేవు గనుక ఆ వనము సూక్ష్మవస్తువుల కంటె అతిసూక్ష్మముగాను, పెద్దవస్తువులకంటె మిక్కిలి పెద్దగా నుండును. ఆ వనమును పొందినవారికి దుఃఖము నిశ్శేషముగా నశించి అధికసౌఖ్యమును కలిగించెడి విషయమై వనముతో సమానమైనది మరియొకటి లేదు. ఏచింతయు లేక వనమం దుండువారికి కొంచెమైనను భయము కలుగజాలదు. వనమం దుండువారికి మోక్షము గలుగగలదు. వనమం దుండెడి వృక్షములు దేహాది పదార్థములవలె యొక్కరంగు గలిగియుండును. వనమం దుండెడి మరికొన్ని వృక్షములకు దేవతల దేహములవలె అవ్యక్తవర్ణము గలిగి మంచివాసనతో మనోహరములై యుండును. వృక్షములయం దుండెడి పుష్పఫలములకు పంచేంద్రియములవలె అయిదురంగులు గలిగియుండును. వనమం దుండెడి దేహములవంటి వృక్షములకు దీక్షాగుణము లుండును. అతిథులకు తృప్తిగలిగించు చుండును. అతిథులు బ్రాహ్మణులవలె నుందురు. అట్టి వనభూమియం దుండెడి మునులు ఆనందమనెడి నీటి యందు తేలుచుందురు. వనమం దుండెడి సరస్సులకును, ఆకాశమునకును యిపి హద్దులని చెప్పుటకు సాధ్యముగాదు. వనభూమియందు క్షేత్రజ్ఞుడనెడి ఆత్మయొక్క ప్రకాశము తప్ప మరియొక సూర్యచం

ద్రాది ప్రకాశము ప్రవేశించ నేరదు. గనుక అట్టి వనమందు క్షేత్రజ్ఞుడే సూర్యునివలె ప్రకాశింపజేయుచుండును. క్షేత్రజ్ఞుడనెడి ఆత్మను సేవించినవారికి సంసారబంధము నశించుచున్నది. వనమం దుండెడి బుద్ధివృత్తులవంటి నదులయందు ఆత్మానందమనెడి అమృతజలములు ప్రవహించుచుండును గనుక బుద్ధివృత్తులవలె నుండెడి నదులును, మనోబుద్ధి చిత్తఅహంకారములవలె నుండెడి పర్వతములును. యింద్రియములవలె నుండెడి తపస్సంపన్నులును, అవ్యయమైన పదమును పొందుదురు. వనము ఇటువంటిది యగును. మంచి నియమ తప శ్శాంతి, యింద్రియ మనోనిగ్రహ వైరాగ్యసమాధివంతులగు పెద్దలు అట్టి వనమందు నివసించి యుందురని తెలిసికొనుము. అని బ్రాహ్మణుడు తన భార్యతో చెప్పెను.

ప్రియురాలా! భార్యామణీ! నేను వాసన చూచెడివాడను గాను. రుచిచూచెడివాడనుగాను, రూపమును చూచెడివాడనుగాను. స్పర్శముగలవాడనుగాను, శబ్దమును వినెడివాడనుగాను. సంకల్పము గలవాడను గాని నిష్ఠను చేసెడివాడను గాను. ఏ భోగమునైనను యిష్టపడి అనుభవించెడివాడను గాను. ఇష్టపడక విడిపించెడివాడను గాను, ఇవి యన్నియు ఆయా యింద్రియ మనస్సులు చేయుచున్నవి. గుణము లన్నియు నన్ను బొందజాలవు. మేలు కలుగవలసినపుడు గలుగకమానదు. కీడు సంభవించునపుడు రాకమానదు. ఇది యంతయు నేను తెలిసికొని తామరాకునందు నీరు అంటకున్నట్లు ఆయా సుఖములను పొందుచుందును. అని మఱియు బ్రాహ్మణుడు భార్యతో నను. భార్యారత్నమా! ఒకానొక సమయమందు యొక అధ్వర్యునకు, యొక యతికిని జరిగిన సంవాదము గలదు. అది చెప్పెదను వినుము. (యజ్ఞమును చేయించెడి యాజకు డధ్వర్యు డనబడును.) ఒకానొకప్పు డధ్వర్యుడు యజ్ఞపశువును యజ్ఞమందు హింసించు

టకై పశువుమీద నీళ్ళు ప్రోక్షించుచుండగా ఒకయతి జూచి అతనితో యిట్లనెను. అధ్వర్యుడా! పశువును హింసించుట హింసారూపముగదా! యిది యజ్ఞమందు హింసింపదగిన మేకపోతుయగును. దీనిని యజ్ఞమందు హింసించినయెడల దీనికి పుణ్యలోకము కలుగునే గాని నాశము గలుగనేరదు. ఇట్లు వేదవాక్యములు చెప్పుచున్నవి. నీవు వేదవాక్యములను నిశ్చయమని నమ్మినయెడల యిట్లు అడుగరాదు. అని చెప్పి పశువు నుద్దేశించి మరల యిట్లనెను. యజ్ఞమందు పశువును హింసించినయెడల మరియొక జన్మమందు పశువునందుగల జీవు డధిక సౌఖ్యవంతు డగును. అని అధ్వర్యుడు చెప్పగా యతి యిట్లనెను.

అధ్వర్యుడా! యజ్ఞమందు పశువును హింసించినయెడల దీనికి పుణ్యగతికలుగును. దీనిని హింసించుటవలన నీకేమి ప్రయోజనమో చెప్పుము. అని యతి యడుగగా అధ్వర్యు డిట్లనెను. యతీశ్వరుడా! పశువిధి పూర్వకముగా యజ్ఞముచేసినయెడల అట్టి కర్తకు స్వర్గభోగము కలుగునని వేదము చెప్పుచున్నది. అట్టి వేదవాక్యము అసత్యముకాదుగదా! అని అధ్వర్యుడు చెప్పగా యతి యిట్లనెను. అధ్వర్యుడా! వేదవాక్యములే హింసవలన పాపము కలుగునని చెప్పుట చేత పశువును హింసించి నందున నీకు పాపముకలుగునని చెప్పితిని. అని యతి చెప్పగా అధ్వర్యుడిట్లనెను. యతీశ్వరా! నీవు సమాధిని అభ్యసించుచు ప్రాణ నిగ్రహమును, మనోలయమును పుణ్యములుగా దలచి చేయుచున్నావు. సమాధి మొదలగు పుణ్య కర్మముల చేత యోగభోగమును పొందెదవు. ఆ ప్రాణ నిరోధము మొదలగు పుణ్యములను చక్కగా యోచించిన యెడల అవియు హింసలే యగును. అని అధ్వర్యుడు చెప్పగా యతి యిట్లనెను. అధ్వర్యుడా! స్వధర్మ తపస్సుచేత పరిపక్వ చిత్తముగలిగి తత్వవిచారణచేత సమాధి

నిష్ఠుడై బ్రహ్మానందమును పొంది సంసారబంధమును విడిపించు కొను టకును నీవు హింసయని చెప్పుచున్నావు. ఇట్లు చెప్పుట మూఢత్వ మగునేగాని వివేకముగాదు. అని యతి చెప్పగా అధ్వర్యు డిట్లనెను. మహాత్మా! యతీంద్రా! పెద్దల అమృతవాక్యములను వినినవాడు కీడు మేలులను యోచించుటకు సమర్థుడై ప్రవర్తించును. నేను మీవంటి పెద్దలవలన ధర్మములను వినలేదు. నేను పశుకార్యమును చేయునపుడు మీరు అనుగ్రహించి చెప్పిన ప్రకారము ప్రవర్తించె దను. జ్ఞాన అజ్ఞానములను తెలిసికొని నడచుకొనెదను. పశుహింస నము లేకుండునట్లు యజ్ఞముచేసి మేలుపొందెదను. అని అధ్వర్యుడు చెప్పగా యతి యిట్లనెను. అధ్వర్యుడా! పశుయజ్ఞముకంటె తపో యజ్ఞము శ్రేష్ఠమగును. గనుక యీ మాటను నీకు చెప్పదలచి పశుయజ్ఞము దోషమని చెప్పితినేగాని మరియొకటిగాదు. గనుక చింతించక తపోయజ్ఞమందు ప్రవర్తింపుము. అని యతి చెప్పగా ఆ మాటకు అధ్వర్యుడు సమ్మతించెను. అని బ్రాహ్మణుడు తన భార్యతో యిట్లనెను.

భార్యారత్నమా! యీ యజ్ఞవిషయమై యొక యితిహా సము కలదు. అది చెప్పెదను వినుము. పూర్వము వేయిచేతులుగల కార్తవీర్యార్జునుడనెడి యొకరాజు గలడు. అతడు తన ప్రభావ బలమువలన సప్తద్వీపములను పరిపాలించుచు గర్వించి తనకు యెదురు లేకుండుటచేత పొగరుపట్టి పరశురామునితో విరోధము పెట్టుకొని పరశురామునకు అపకారము చేసెను. అపుడు పరశు రాముడు వృక్షమును నరికినట్లు గండ్ర గొడ్డలిచేత కార్తవీర్యార్జు నుని వేయి చేతులను నరికి చంపెను. అంతట కార్తవీర్యార్జునుని కొడుకులు తమ బంధువులను చేర్చుకొని పోయి పరశురాముని తండ్రి జమదగ్ని మహామునిని చంపిరి. అంతట పరశురాముడు అధిక

కోప రోషాగ్నిగలవాడై గండ్రగొడ్డలి తీసుకొని భూమినంతయు వెదకి యిరువదియొక్కమార్లు రాజులను చంపెను. అపుడు పరశురాముని యొక్క పితృదేవతలు పరశురాముని దగ్గరకు వచ్చి యిట్లనిరి. పరశురాముడా! నీవు బ్రాహ్మణుడవైయుండి రాజులను యింత కఠిన హృదయముతో చంపరాదు, గనక యింక చంపవద్దని చెప్పగా అపుడు పరశురాము డిట్లనెను. పితృదేవతలారా! మీ రిట్లు నాతో చెప్పవద్దు. నేను అధిక నియమము గలిగి రాజులనెడి పశువులను హింసించి పశువిధి ప్రకారము మహారోషాగ్నిచేత తృప్తిబొందునట్లుగా వీరయజ్ఞమును చేసెదను గనుక రాజులను హింసింపవద్దని నాతో చెప్పక మీరు వెళ్ళుడు. అని పరశురాముడు చెప్పగా పితృదేవతలు యిట్లనిరి. పరశురాముడా! యజ్ఞములో తపోయజ్ఞము శ్రేష్ఠమైన దగును. గనుక నీవు తపోయజ్ఞమును చేయుము. శాంతము మంచిదినుమా! పరశురామా! పూర్వము అలర్కుడనెడి రాజు తపస్సును తాకియుండెడి యింద్రియముల మీద కోపించుకొని ఆ యింద్రియముల మీద దివ్యాస్త్రములను ప్రయోగింప దలచెను. అపుడు యింద్రియములు యలర్కునితో యిట్లనెను.

అలర్క మహారాజా! నీ అస్త్రముచేత మేము నశింపము. రోషముచేత అస్త్రములను ప్రయోగించినవాడే చెడిపోవును. నీకు శక్తియున్నయెడల తపోమయములైన అస్త్రములను అభ్యసించి ప్రయోగింపుము. అని యిట్లు యింద్రియములు చెప్పగా అలర్కుడు క్రోధమును విడిచెను. అలర్కుడు యోగముచేత శాంతిని బొంది తపఃఫలములనెడి అస్త్రములచేత యింద్రియములను గెల్చెను. పరశురామా! నీవును తపస్సుచేత అంతరశత్రువులగు యింద్రియ మనస్సులను జయించి సౌఖ్యవంతుడవు గమ్ము. బాహ్యశత్రువులను గెల్చుట జయముగా నెంచుకొనకుము. అని పితృదేవతలు నిశ్చయించి చెప్పగా

పరశురాముడు విని శాంతమనస్సుగలవాడై మంచి గొప్ప తపస్సు చేసి మేలు పొందెను, అని బ్రాహ్మణుడు తన భార్యతో చెప్పెను. సుందరీమణీ! తొమ్మిది గుణములు గలవు. అవి చెప్పెదను వినుము. సాత్వికభావము, అభిమానము, సంతోషము యీమూడును సాత్విక గుణములగును. క్రోధము. భయము, దుఃఖము యీమూడునురాజస గుణములగును. మోహము, మంద స్వభావము, స్వప్నము యీ మూడును తామసగుణములగును. ఈ తొమ్మిదిగుణముల నెడి శత్రువు లను చంపుటకు యే అస్త్రములు వుపయోగించునో అట్టి అస్త్రముల చేత ఆంతరశత్రువులనందరిని చంపవలయును అట్లు తొమ్మిదిగుణ ములను యింద్రియములును, మనస్సును జయించి శాంతముగలిగి మోక్షమును పొందవలయును. అంబరీషగీతలు ముఖ్యవైరిని నిర్ణయిం చుచున్నవి. ఆవాక్యములను చెప్పెదను వినుము. భార్యారత్నమా! పూర్వము అంబరీషు డనెడిరాజు రాజనీతి ప్రకారము పరమ ప్రభు త్వమునుపొంది శత్రువులనందరిని చంపి రాజ్యమును పరిపాలించుచు యొకనాడు విద్వాంసులను జూచి యిట్లనెను. విద్వాంసులారా! నేను శత్రువులనందరిని జయించియు, అట్టి జయమును జయముగా తలచ లేదు. శత్రువులలో అధిక శత్రువు, లోభగుణమగును. అట్టి ఆంతర శత్రువగు లోభమును జయించనివానిని మృత్యువుపట్టుకొని చంప గలదు. గనుక ఆంతర శత్రువులగు యింద్రియ మనస్సులను లోభ మును జయించినవారలకు శాంతము గలుగగలదు. అని అంబరీషుడు చెప్పి ఆయాంతర శత్రువులశక్తిని పోగొట్టి రాజ్యముచేసి సుఖించెను అని బ్రాహ్మణుడు తన భార్యతో చెప్పెను.

## జనకునకు బ్రాహ్మణరూప ధరుండైన యమునితోనైన సంవాదము

భార్యారత్నమా! జనక మహారాజునకు నొక బ్రాహ్మణు నితో జరిగిన సంవాదమును చెప్పెదను వినుము. జనక మహారాజు

రాజ్యము చేయునప్పుడు జనకుని యెదుట యొక బ్రాహ్మణుడు తప్పిదము చేసెను. అపుడు జనక మహారాజు బ్రాహ్మణునితో యిట్లనెను. బ్రాహ్మణుడా! నీవు తప్పిదము చేసితివి. గనుక నీవు నాదేశమందు నివసింపవద్దు. మరియొక దేశమునకు వెళ్ళుమని చెప్పగా బ్రాహ్మణుడు యిట్లనెను. జనకరాజా! నీదేశము యెంతవరకున్నదో చెప్పిన యెడల నీదేశమును విడిచి పరదేశమునకు వెళ్ళెదను. అని బ్రాహ్మణుడు చెప్పగా ఆ మాటలను జనకుడు విని ఊరకుండి మూర్ఛబోయెను. కొంతసేపటికి మూర్ఛ తెలిసికొని బ్రాహ్మణునిజూచి యిట్లనెను. బ్రాహ్మణుడా! నాతాత తండ్రులు మొదలుకొని పరిపాలించుచుండెడిభూమి నావశమందున్నను భూమియందు నాది యని నాకు మమకారము కలుగదు, మిథిలాపట్టణమందు నేను సదా నివసించి యున్నను యీపట్టణము నాదియని నాకు అభిమానము కలుగదు. గనుక యిది నా దేశమని నిశ్చయముగా జెప్పుటకు వల్లపడనందున యింతకుముందు నీతో చెప్పిన మాటవలన పుట్టిన దుఃఖముచేత నాకు మూర్ఛవచ్చెను. అని జనకుడు చెప్పగా ఆమాటలు బ్రాహ్మణుడు విని యిట్లనెను. జనకుడా! నీవు పరిపాలించెడి దేశమందును, పట్టణమందును నీకు మమకారము బుద్ధిలేనట్లు చెప్పితివి. నీదేశ పట్టణములు నీకు యెరువులైయున్నట్లు తోచుచున్నది. ఇట్లు ఏకారణము వలన నీకు మమకార బుద్ధికలుగలేదో ఆ కారణమును చెప్పుమని యడుగగా జనకుడు యిట్లనెను. బ్రాహ్మణుడా! యీ దేహమే నశించుచుండగా దేశము నాదియని చెప్పుటయుక్తపడదు. గృహమందుండెడి ధనాదిపదార్థములలో యిది నాదియని అంగీకరింపబడనపుడు దేశమునాది యని చెప్పుటకువల్లకాదు. యెట్లనగా చెప్పెదను వినుము ఘ్రాణేంద్రియములకు విషయములైన గంధాదులు నశించెడివగుట వలన నాదియని చెప్పుటకు వల్లపడనందున గంధాదులకు ఆధారము

లైన భూమ్యాది భూతములు నాచేత జయింపబడి నావశములై యుం డును. గంధాది విషయములను నాదియని చెప్పుటకు వల్లలేనందున గంధాదులకు ఆధారములగు భూమ్యాదిభూతములను నావి యని చెప్ప తగదు. అని జనకుడు చెప్పగా బ్రాహ్మణుడు విని నవ్వుచు జనకునితో నిట్లనెను. జనకమహారాజా! నేను యముడను, నిన్ను పరీక్షింప దలచి వేడుకగాయిక్కడకు వచ్చినాను. ఇపుడు నీకుగల వివేకము పరి పక్వమును బొంది శాంతిని కలిగింపుచు అభివృద్ధియై సర్వదా నీ మన స్సునందునిలిచి యుండుగాక. అని యముడు జనకమహారాజునకు వర మిచ్చి అంతర్ధానమయ్యెను. అని బ్రాహ్మణుడు తనభార్యతో చెప్పి నీకు హితోపదేశమును చేసెదవినుమని యిట్లనెను.

భార్యామణీ! నేను సంసారప్రవర్తనమును విడిచి రహస్య స్థలమందు ఒంటరినైయుంటిని. నీవు నావైరాగ్యమును చెరుపదలచి వచ్చి కపటముగల దానవై అధ్యాత్మవిద్యను చెప్పుమని నన్నడిగి తివి. నీకపట స్వభావమును నే నెరిగియు. యెరుగని వానివలె నీకు అధ్యాత్మ విషయములైన వాక్యములను చెప్పితిని. నేను లోకమందు గలిసి యితర జనులవలె ప్రవర్తించువాడనుగాను. నేను యిపుడు నిశ్చయముగా బ్రాహ్మణుడనైతిని. బ్రహ్మచారినైతిని. జీవించి యుండియే సంసారబంధ విముక్తుడనైతిని. మీాతో సమానముగా నన్ను జూచుచున్నావు. నాపద్ధతినీకు తెలియదు. నేను సకలజగత్తును వ్యాపించియున్నాను. ఇపుడు నేనున్న స్థితినిబట్టి సకలభూమండలము నైనను స్వర్గలోక రాజ్యమైనను నా బుద్ధి లక్ష్యపెట్టదు. నా బుద్ధియే నాకు ధనమగును, కొయ్యలయందు అగ్నియున్నట్లు సకలజంతువుల యందును నాబుద్ధి వ్యాపించి యుండును. గురువు దగ్గిర నివసించి యుండెడి బ్రాహ్మణులకును మంచిమార్గము యొక్కటే యుండును యొక్కటున్నను ముందుచెప్పిన ప్రకారము మోక్షమార్గము ఒక్కటే

యగును. సకల నదులును సముద్రమును పొందినట్లు బ్రాహ్మణులందరును యేఆశ్రమమందున్నను మోక్షవిచారణము చేసినయెడల అవశ్యము మోక్షమును పొందుచున్నారు. బుద్ధిమార్గమునుబట్టి ప్రవర్తించవలయునుగాని శరీరమార్గమునుబట్టి ప్రవర్తింపరాదు. కర్మములకు ఆద్యంతములు కలిగియున్నవి. శరీరము కర్మబంధమును కలిగించును. ఇదంతయు నేనెరుగుదును. గనుక నాకు పరలోక భయము లేదు. నేను చెప్పిన ఆధ్యాత్మ విద్యావిషయములైన వాక్యములకు తాత్పర్యము తెలుసుకొని చిత్తమందుంచి ధ్యానము చేయుచుండుము. అట్లు ధ్యానము చేసితివేని నాతో సమానురాల వగుదువు. భయపడకుము. అని బ్రాహ్మణుడు హితోపదేశము చేయగా అతని భార్య సాగిలపడి నమస్కరించి వినయముతో యిట్లనెను.

ప్రాణనాథా! మీరుచెప్పిన జ్ఞానవిషయములైన వాక్యములు మహాబుద్ధిమంతులకును తాత్పర్యములుగావు. నావంటి మందబుద్ధికి బొత్తిగా తెలియదు. గనుక అట్టితత్త్వజ్ఞానము కలుగుటకు ఆధారమైన యొక ఉపాయమునుచెప్పి నన్ను రక్షింపుమని ప్రార్థించగా బ్రాహ్మణు డిట్లనెను. భార్యామణీ! క్రిందవుండెడి అరణి బ్రాహ్మణుడగును. పైనవుండెడి అరణి గురువు అగును. ఈ రెండు అరణులను తపస్సుచేత మథించగా జ్ఞానమనెడి అగ్నిపుట్టును. అని బ్రాహ్మణుడు చెప్పగా అతనిభార్య యిట్లనెను. ప్రియుడా! నీవుచెప్పిన బ్రాహ్మణుడనగా క్షేత్రజ్ఞుడైన ఆత్మయగును. అరణియనగా అగ్నికొరకు మథించెడి, సమిధయనెడి కట్టెయగును. అట్టిఆత్మను అరణిని మథించినట్లు మథించవలెనని చెప్పితిరి. ఆత్మవస్తువును యెరుగక మథించుటకు సాధ్యముగాదు. గనుక ఎట్లుమథించవలెనో స్పష్టముగా చెప్పుమని ప్రశ్నించగా బ్రాహ్మణు డిట్లనెను. భార్యారత్నమా! ఆత్మను యెరిగెడి సాధనములులేవు. ఇంద్రియములకు ఆత్మకనబడదు. ఆత్మను

ప్రపంచమందుగల పదార్థములవంటి లక్షణములు లేవు. ఆత్మనిర్గుణు డగును. గనుక అహంకారము సమాధినిష్ఠచేత అణగినయెడల ఆత్మ తోచుచున్నాడు. గనుక అట్టిఆత్మను అరణిగా యూహించుకొని గురు వనెడి ఉత్తరారణిచే మథించినయెడల జ్ఞానము కలుగును. అట్టిజ్ఞా నముచేత ఆత్మను యెరుగవలయును. ఆత్మను యెరుగుటకంటె మరి యొక ఉపాయములేదు. ఇది మిక్కిలి సులభమైన ఉపాయమగును. అని సిద్ధాంతముగా బ్రాహ్మణుడు చెప్పెను. ఆమాటలను అతనిభార్య విని క్షేత్రజ్ఞ విషయమైన సంశయమును విడిచి శాంతినిపొందెను. అని యిట్లు కృష్ణుడు చెప్పగా అర్జునుడు విని యిట్లనెను. కృష్ణా! నీవు చెప్పిన బ్రాహ్మణుడును అతని భార్యయు మిక్కిలి మహాత్ములుగా నున్నారు. వారు యెక్కడుందురో నాకు తెలుపుమని ప్రశ్నించగా కృష్ణదేవు డర్జునునితో యిట్లనెను. అర్జునా! నామనోబుద్ధులు రెం డును బ్రాహ్మణుడని తెలుసుకొనుము. క్షేత్రజ్ఞుడైన ఆత్మ బ్రాహ్మణ స్త్రీయని యెరుగుము. అప్రమేయ స్వరూపుడగు క్షేత్రజ్ఞుడు నేనే యగుదు ననెను.

## గురుశిష్య సంవాదము కృష్ణుడర్జునున కెరిగించుట

అని కృష్ణుడు చెప్పగా అర్జును డిట్లనెను. కృష్ణా! నీ యను గ్రహమువలన నాబుద్ధి మిక్కిలి పరిశుద్ధముగాను. సూక్ష్మముగాను వున్నది. పరబ్రహ్మముయొక్క స్వరూపమును తెలుపుమని యడు గగా కృష్ణు డిట్లనెను. అర్జునా! గురుశిష్య సంవాదమనెడి యొక యితిహాసము గలదు. అది వినినయెడల నీవడిగిన ప్రశ్నము తెలియ గలదు. మేధావియనెడి యొక మంచి శిష్యుడు మంచితీక్ష్ణమైన వ్రతముగలవాడై యొక గురువును యీప్రకారము యడిగెను. ... మునులకు బ్రహ్మదేవుడు చెప్పిన జ్ఞానమును చెప్పెద విను

మని యిట్లనెను. శిష్యుడా! పూర్వము బృహస్పతి భరద్వాజ భార్గవ గౌతమ కాశ్యప వశిష్ట అత్రి విశ్వామిత్రాది మహామునులును అంగీరసమునిని ముందుపెట్టుకొని బ్రహ్మదేవుని దగ్గిరకు బోయి నమస్కరించి యిట్లనిరి. మహాత్మా! బ్రహ్మదేవా! మేలును కలిగించెడిది యెద్దియో చెప్పుము. అట్టిదానిని పొందుటకు మంచిమార్గమును చెప్పుమని ప్రార్థించగా బ్రహ్మదేవుడు కృపగలవాడై మునులకు తెలిపిన పద్ధతిని నీకు చెప్పెదను వినుము. శిష్యుడా! బ్రహ్మదేవుడు మునుల ముఖములను కలియజూచి వారితో యిట్లనెను.

మునులారా! త్రిగుణాత్మకమైన ప్రకృతిసత్వ మనబడును. సత్వమువలన సకలభూతములును పుట్టుచున్నవి. పుట్టిన భూతములన్నియు సత్వమందే ప్రవర్తింపుచు లయింపుచున్నవి. గనుక సత్వముయొక్క ప్రసిద్ధిని జెప్పెద వినుము. సత్వమునకు శ్రుతియనియు, తపమనియు, ప్రజాపతియనియు మూడుపేర్లు గలవు. సత్వమనునది. వేదముచేత తెలియదగినదని తెలుసుకొనుము. మునులారా! కామక్రోధాదులను నిశ్శేషముగా విడిపించి సర్వదా యోగీశ్వరులు ఆసత్వమును సేవింపుచుందురు అట్టి సత్వము మేలైనది యగును. దానిని పొందుటకు మంచి మార్గమును చెప్పెద వినుము. బ్రహ్మచర్యాదులగు నాలుగాశ్రమములయొక్క ఆచారములను తమతమ కులాచార ధర్మములను చక్కగా జరుపుచుండుటవలన శుభము కలుగును. నాలుగాశ్రమములకును ఆత్మతత్వజ్ఞానము సమానముగానే వుండును. యే ఆశ్రమం దున్నవాడైనను తత్వజ్ఞానమును విచారింపవచ్చును. తత్వజ్ఞానములేక పరతత్వమగు బ్రహ్మమును పొందజాలడు. తత్వజ్ఞానము మారుతి, ఆదిత్య, యింద్ర, ప్రజాపతులగు దేవగణములకును, మనుష్యులకును, యొక విధముగానే యుండును. ఇరువది

నాలుగు తత్త్వములను తెలిసికొనుటయే తత్త్వజ్ఞానమగును. గనుక ఆ యిరువదినాలుగు తత్త్వములను చెప్పెదవినుము. ఆకాశము మొదలగు అయిదుభూతములు, శబ్దస్పర్శాదులగు అయిదు గుణములును, శ్రోత్రాది జ్ఞానేంద్రియము లైదును, వాక్కు మొదలగు కర్మేంద్రియము లైదును, మనో అహంకార చిత్తములు మూడును, వీటి యన్నిటికిని కారణమగు ప్రకృతి యొకటియు యివి యన్నియు చేరి యిరువదినాలుగు తత్త్వములగును, ఇరువదినాలుగు తత్త్వములు పుట్టిన క్రమమును, నశించెడి పద్ధతిని, వాని స్వభావగుణములను చక్కగా యోచించి తెలిసికొనినవాడు పరమాత్మను యెరిగి సంసారబంధమును తప్పించుకొనగలడు. అని బ్రహ్మదేవుడు నిశ్చయించి చెప్పెను.

మునులారా! యిరువదినాలుగు తత్త్వములకు కారణమగు ప్రకృతివ్యక్తమనియు, అనిర్వాచ్యమనియు అవ్యక్తమనియు స్థిరమనియు, ధృవమనియు, వ్యాపియనియు, దురాయుక్తమనియు, గుణత్రయరూపియనియు, నవద్వారపురమనియు చెప్పబడును. ప్రకృతి ముందు చెప్పబడిన యిరువదినాలుగు తత్త్వముల స్వరూపముగా నున్నందున యిట్టి పేర్లచేత చెప్పబడును. తత్త్వజ్ఞానముచేత ప్రకృతి నశింపుచున్నందున సాధ్యమని చెప్పబడును. ప్రకృతియందుగల జ్ఞానవస్తువును ప్రకృతికంటెను దాని కార్యములగు పూర్వోక్తతత్త్వముల కంటెను భిన్నపరచి చూచుటయే సాధనమగును. ఇట్టిసాధన జ్ఞానాభ్యాసముచేత ప్రకృతిని సాధింపవచ్చును. ప్రకృతి సత్త్వరజస్తమో గుణములచేత బలవంతమైయుండును. గుణజ్ఞానవంతులగువారిచేత ప్రకృతి సాధింపబడుచున్నది. మునులారా! సత్త్వరజస్తమము లనెడి మూడుగుణములును ప్రకృతి రూపమగును. ఆ మూడుగుణములును ఒకటిలో మరియొకటి చేరియుండును. ఆ మూడుగుణములును ఒకటిని

మరియొకటి అన్యోన్యరూపముగా ఆశ్రయించి ప్రవర్తించుచు ఒక్క గుణముచేత మరియొకగుణము ఉపజీవించుచు తోచబడక గూఢములై యుండును. తమోగుణము అణగినపుడు రజోగుణము పెరుగును. రజోగుణము అణగినపుడు సత్వగుణము పెరుగును. సత్వగుణము అణగినపుడు తమోగుణము పెరుగును. లోభము, దుఃఖము, మోహము, నిద్రయు, భయము, వికారము, అహంకారము. మౌఢ్యము, పాపములను చేయుటయు, కోపము, శౌర్యభేదము యీ గుణములన్నియు తమోగుణమువలన పుట్టినవి యని తెలియవలయును. తమోగుణ ప్రాధాన్యులగు జనులు పాపములుగాను, తేళ్ళుగాను పశువులుగాను, పందులుగాను, కుక్కలు, చేపలు, కోళ్ళు, చీమలు, కాకులు, పురుగులు, జింకలు, నక్కలు, కొంగనక్కలుగాను, దోమలు, చెట్లు పొదలుగాను పుట్టిరని తెలిసికొనుము. వ్యాధుల చేతను, పీడలచేతను బాధింపబడువారును పూర్వము తామస గుణాధిక్యులై యుందురు.

ఈ చెప్పబడిన జంతువులవంటి నీచజంతువు లన్నియు తమోగుణాధిక్యతవలననే పుట్టుచున్నవి. ఇట్లు తామసగుణ స్వభావములను తెలుసుకొని, లోభాది తామసగుణ వికారములను విడిచిన యెడల అట్టిజనులకు అధోగతి గలుగదు. బలశౌర్య మదములను, ప్రభు స్వభావము, సుఖదుఃఖములయందు అభిమానించుటయు, స్నేహము చేయుటయు కోరికయు, యిష్టముగాని దానిని ఒల్లకుండుటయు, ప్రతాపము, కలహించుటయు, ఈర్ష్యము అనేక వికల్పములుగా మాటలాడుటయు, స్త్రీలయందు అధికకామము, అబద్ధమాడుటయు, ఉబ్బుటయు, యివి యన్నియు, రజోగుణ వికారములని యెరుగవలయును. ఈ రజోవికార గుణములను పూర్వజన్మమందు గలిగియున్నవారు యిపుడు మనుష్యులై పుట్టి అవివేకులై ధర్మార్థ

కామముల యందు ప్రవర్తించుచు ధనముల యందు అత్యాశ గలవారగుచు కామ సుఖముల యందు సర్వదా ప్రవర్తించు చుందురు.

ఈ రాజసగుణ స్వభావములను తెలుసుకొని ఆ గుణములను విడిపించి ధర్మమార్గమందు ప్రవర్తించిన యెడల శుభమును పొంద గలరు. ఇక సాత్వికగుణ స్వభావములను చెప్పెదవినుడు. సంతోషము, ప్రకాశము, ప్రేమ, ఆనందము, కరుణయు. ఓర్పుతనము, సత్య మాడుటయు, పరిశుద్ధియు, ధైర్యము, కృపయు, సుఖదుఃఖము లను సహించుటయు, అహింసయు, వంకరగుణ స్వభావము లేకుండు టయు, ప్రాణులయందు సమబుద్ధి యుండుటయు, కార్యములయందు సమర్థత్వము గలిగియుండుటయు, శ్రద్ధచేత దానాదిపుణ్య కార్య ములు చేయుటయు, క్రూరస్వభావము లేకుండుటయు, సిగ్గుగలిగి యుండుటయు, గౌరవగుణము కలిగియుండుటయు యివియన్నియు సత్వగుణ స్వభావములగును.

ఈ గుణములను పూర్వజన్మమందు గలవారు యిపుడు అహం కారమమకారములు లేనివారై ధనమందు ఆశలేక కామముచేత పీడింప బడక జ్ఞానవంతులై ఊర్ధ్వములగు పుణ్యలోకములకు పోదురు. ఈ సాత్విక గుణములను తెలిసికొని ఆ గుణములయందు యిష్టపడక ఆత్మతత్వ విచారమును చేసినయెడల ఆ గుణములు నశించును. అట్టివాడు ఊర్ధ్వలోకములకు పోక అపరోక్ష జ్ఞానము చేత ముక్తుడగును. అని బ్రహ్మదేవుడు చెప్పి యిట్లనెను,

మునులారా! సత్వరజస్తమములనెడి మూడు గుణములును యెప్పటికిని వేరు వేరుగా నుండును, ఆ మూడును అన్యోన్యముగా

కలిసియుండును. ఆ గుణములను గలవారు అవశ్యము సంసారమందు ప్రవర్తింపుదురు. ఆ మూడు గుణములలో యేగుణము అధికమగు చుండునో ఆ యాగుణ స్వభావములు కలుగుచు నశించుచుండును. తమోగుణము అధికముగా గలవాడు అధోగతిని పొందును. రజో గుణాధిక్యత గల జీవుడు మనుష్యుడై పుట్టును. సత్వగుణాధిక్యముగల వాడు ఊర్ధ్వలోకములను పొందును. ఆయా గుణాధిక్యతచేత ఆయా లోకములయందు శరీరభేదములు కలుగునని తెలుసుకొనుడు. ఆ మూడుగుణములును విడిపించుటవలన మేలుకలుగును. ధర్మార్థ కామ ములను తెలిపెడి పనులకు క్రమముగా సత్వరజస్తమోగుణ వికార ములు కారణములగును. ఈ మూడుగుణములను విడిచినయెడల మోక్షము కలుగుచున్నది. ప్రాణవాయువు సత్వగుణ స్వరూపమగును అపాన వాయువు రజోగుణ స్వరూపమగును. ఉదానవాయువు తమో గుణ స్వరూపమగును. మునులారా! జపతప యజ్ఞదానాది పుణ్య కర్మములను చేసెడివారు యెంత సాత్విక గుణవంతులై యుందురో అంతమాత్రపు ఫలము కలుగుచున్నది. గనుక అన్నివిషయము లందును సత్వగుణము శ్రేష్ఠమగును. సత్వరజస్తమములు హెచ్చు తగ్గు లేక సమముగా నుండెడి స్థితియే అవ్యక్తమనెడి ప్రకృతియగును. అవ్యక్తతత్వము శివమనియు, అచలమనియు శాశ్వతమనియు చెప్ప బడును. అవ్యక్తతత్వము వస్తురూపముగాను, మిథ్యారూపముగా నుండును. అవ్యక్తతత్వ స్వరూపమును యెరిగినవాడు విజ్ఞానదశను పొంది సత్వరజస్తమోగుణములను గెలిచి యెప్పటికిని ఉపద్రవము లేని పరమాత్మ పదమునుపొంది ముక్తుడగును. అని బ్రహ్మదేవుడు మునులకుపదేశించి యిట్లనెను.

## మనోబుద్ధ్యహంకారాది తత్త్వప్రకారము

మునులారా! అవ్యక్తమనెడి ప్రకృతితత్వమువలన మొట్ట మొదట మహత్తత్వము పుట్టును. ఆ మహత్తత్వము బుద్ధిరూపము గాను, మనోరూపముగాను, ధైర్యశక్తి రూపముగాను, ప్రసిద్ధిరూప ముగాను, తెలివిగలరూపముగాను అయినదగుచు సర్వత్రచూచుచు, వినుచు పోవుచు, చేయించుచు ప్రభు తుల్యముగా ప్రకాశించు చుండును. ఆమహత్తత్వమువలన అహంకారమనెడి తత్వముపుట్టెను. అహంకారమువలన సకలకార్యనీతులును జరుగుచున్నవి. అహంకా రమువలననే ధర్మార్థకామములును, అధ్యయనము, వ్రతములును. యజ్ఞతపస్సులు మొదలగు క్రియలును నడచుచున్నవి. సకలజంతువు లును అహంకారము కలిగినందుననే సకలకార్యముల యందును ప్రవర్తించుచున్నవని తెలిసికొనుము. ఇది లోకప్రసిద్ధమై యున్నది. అహంకార తేజస్సువలన జగత్తులును రంజిల్లుచున్నవి. అహంకార తత్వమహిమవలన ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అనెడి పంచభూతములు పుట్టెను. ఆకాశమునకు శబ్దమును వాయువు నకు స్పర్శము, అగ్నికి రూపమును, జలమునకు రసమును, భూమికి గంధమును గుణములగును. ఇవియే విషయములని చెప్పబడును. ఈవిషయములందు మనస్సుగల జంతువు మోహమనెడి గొప్ప చీకటియందు చిక్కుపడును. అహంకారతత్వము వలననే సకలజను లును మోహింపబడి నశించుచున్నారు. వివేకులగువారు యీ అహంకారమును జ్ఞానవివేకముచేత నిగ్రహించి శుభమును పొందు దురు. శబ్దస్పర్శాదివిషయములు విషముతో సమానము లగును, అనిత్యములగును. వికారమును కలిగించునవియగును. విషయములు మోహలోభగుణములగును కలిగించి బుద్ధివృత్తు లన్నిటిని పాపవంతము

లుగా చేయుచున్నవి. మునులారా! రక్తమాంసాది మయమగు దేహాములే తామని తలచియుండెడి మూఢులు శబ్దస్పర్శాదివిషయములవలన కలిగెడు కీడును యెరుగజాలక సంసారమందు చిక్కుపడి చెడిపోవుచున్నారు. ఇది సత్యమగును. పండితులగువారు శబ్దాది విషయములవలన చెడిపోరు. అని బ్రహ్మదేవుడు చెప్పెను. మును లారా! ప్రాణాదిపంచవాయువులకంటె యింద్రియ మనోబుద్ధులుకంటె ప్రత్యగాత్మ వేరుగానుండునని స్పష్టమాయెనుగదా! ఆ యెనిమిదింటి వలన కలిగెడి సకలదుఃఖములకును ప్రత్యగాత్మ ఉపాదానకారణ స్వభావమును దాల్చియుండును. కార్యములయొక్క స్థితిలయములకు ఆధారమైన కారణవస్తువు ఉపాదానకారణమనబడును. ఘటరూప మనెడి కార్యమునకు ఆ ఘటము ఏర్పడుటకు కారణమైనట్టి ఉపాదానకారణమని తెలియవలెను. ఈప్రకారము ఎరుగుట మోక్ష మార్గమగును. అని బ్రహ్మదేవుడు చెప్పి యిట్లనెను. మునులారా! శ్రోత్రత్వక్చక్షు ర్జిహ్వాఘ్రాణము లనెడి జ్ఞానేంద్రియము లైదును వాక్పాణిపాదపాయూపస్థ లనెడి కర్మేంద్రియములైదును, మనస్సు ఒకటియు యివి యన్నియు పదునొకండు యగును. పదునొకండును అహంకారతత్వమువలన పుట్టినవగును. ఇంద్రియముల అధీనముగా నుండినయెడల కష్టముకలుగును. గనుక మంచి వివేకముగల బుద్ధి చేత యింద్రియమనస్సుల నిగ్రహించి తన వశమందుంచుకొని ప్రవర్తించినవాడు పరతత్వమగు ప్రత్యగాత్మను యెరుగగలడు. అని బ్రహ్మదేవుడు యిట్లనెను.

మునులారా! చెమటవలన పుట్టెడి పేనులు, నల్లులు మొదలగు జంతువులకంటె నీటిబుగ్గలయందు పుట్టెడి జంతువులు శ్రేష్ఠములగును, గనుక చెమటవలన పుట్టెడిజంతువులు అధమములనియు నీటిబుగ్గవలన పుట్టెడి జంతువులు మధ్యమములనియు గ్రుడ్డువలన

పుట్టెడి జంతువులు శ్రేష్ఠములనియు చెప్పబడును. వీనియన్నిటికంటె మానవులవలన పుట్టెడి మనుష్యపశ్వాదిజంతువులు శ్రేష్ఠములగును. జంతువుల తారతమ్యము తెలిసికొనుట మంచిది. గనుక చెప్పితిని. అధ్యాత్మాదులను చెప్పెదనువినుడు. అధ్యాత్మాదులను యెరుగుట వలన జ్ఞానముకలుగును. గనుక నిశ్చలబుద్ధిచేత వినుచుండుడు. ఆకాశము మొదటిభూతము. రెండవది వాయువు. మూడవది యగ్ని. నాల్గవది జలభూతము. ఐదవది భూమి. అధ్యాత్మాదులకు భూతములు ఆధారములగుటవలన అవి మొదటచెప్పితిని. ఇక అధ్యాత్మాదులను చెప్పెదను వినుడు, శ్రోత్రేంద్రియము అధ్యాత్మమగును. దానివిషయ మను శబ్దము అధిభూతము. శ్రోత్రేంద్రియమునకు దిక్కులు అధి దైవతములు, త్వగింద్రియము అధ్యాత్మము. దానికి స్పర్శము అధి భూతము. దానికి వరుణుడు అధిదైవతము. ఘ్రాణేంద్రియము అధ్యా త్మము. దానికి గంధము అధిభూతము. దానికి అధిదైవము అశ్వినులు. ఇట్లు జ్ఞానేంద్రియములకు అధ్యాత్మాదులను తెలిసికొనుడు.

ఇంకను కర్మేంద్రియములకు అధ్యాత్మాదులను చెప్పెదను వినుడు. వాగింద్రియము అధ్యాత్మము. దానికి మాట అధిభూతము. బ్రహ్మదేవుడు అధిదైవతము. పాణీంద్రియము, అధ్యాత్మము. దానికి చేయుట అధిభూతము. ఇంద్రుడు అధిదైవతము పాదేంద్రియము అధ్యాత్మము. నడచుట అధిభూతము. దానికి ఉపేంద్రుడు అధిదైవ తము. ఉపస్థేంద్రియము అధ్యాత్మము. శుక్లమూత్రములను విడుచుట అధిభూతము. దానికి ప్రజాపతి అధిదైవతము. పాయురింద్రియము అధ్యాత్మము. మలమును విడుచుట అధిభూతము. మృత్యువు అధి దైవతము. ఇవి కర్మేంద్రిములకు అధ్యాత్మములు. అహంకారము అధ్యాత్మము. దానికి అభిమానము అధిభూతము రుద్రుడు అధిదైవ తము. మనస్సు అధ్యాత్మము, దానికి సంకల్పవృత్తి అధిభూతము.

చంద్రుడు అధిదైవతము. బుద్ధి అధ్యాత్మము. దానికి నిశ్చయము అధిభూతము. బ్రహ్మ అధిదైవతము. వేదము చెప్పిన ప్రకారము అధ్యాత్మాదులను చెప్పితిని. ఈ ప్రకారము యింద్రియములను, వాని కార్యములను, వానికి అధిదైవతములను చక్కగా తెలిసికొనుట వలన జ్ఞానము కలుగును. అట్టి జ్ఞానము వలన సంసారవిముక్తి కలుగు నని బ్రహ్మదేవుడు చెప్పి మరల యిట్లనెను. మునులారా! నివృత్తి యనెడు కర్మ సన్యాస మార్గము సూక్ష్మ భావము సంపాదించి శుభము నిచ్చుచున్నది. కర్మ సన్యాప పద్ధతిని చెప్పెదను వినుడు. తాబేలు తన అవయవములను తన వశము చేసికొని తన యిష్టప్రకారము అవయవములను వికసింపజేయుచు తన దేహములోనికి అణచుకొనుచుండును. ఆ ప్రకారమే విద్వాంసుడగువాడు తత్వజ్ఞానేంద్రియములను తన వశము చేసికొని వ్యవహరించుచు మనస్సులోపలికి అణచుచుండవలయును. అట్టివాడు ముక్తిమార్గమును బొందగలడు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను పదింటిని గ్రహించి నిర్వికారుడై యుండుట మంచిమార్గము. అట్లు నిర్వికల్ప మనస్సు గలిగి యున్న యెడల మనస్సు నిర్మలమై ప్రకాశించును. అట్టి సూక్ష్మ మనస్సుచేత ఆత్మను చూడవచ్చును.

పంచ భూతములును సముద్రముల వంటివి. ఆ భూతములు వ్యాధిదుఃఖములతో గూడిన అల్ప సౌఖ్యమునకు కారణములు. ఆ సముద్రములకు కామక్రోధములు ప్రభువులు. ఇంద్రియ మనోనిగ్రహము గలిగిన యెడల కామక్రోధములను జయించి పంచభూతములనెడి సముద్రములను దాటవచ్చును. అట్లు యింద్రియములను మనస్సునందు జేర్చి మనస్సును మనస్సునందే నిలిపి ఆత్మన చూచినవాడు సర్వజ్ఞుడని చెప్పబడును. అట్టివాడు నిర్వికల్పసమాధిచేత సకలభూతములను చూచుచుండును. మునులారా! ఆత్మ తత్వము ఒక్కటే

ఒక దీపము అనేక దీపములను కలిగించునట్లు ఆత్మయొక్కడే అనేక దేహములయందు నివసించియున్నాడు. అట్టి ఆత్మను తెలిసికొనిన వాడు భ్రమించక సర్వాత్మరూపుడై ప్రకాశించుచుండును. ఆ పరం జ్యోతి స్వరూపుడగు ఆత్మయే ఆయా శ్రేష్ఠ దేహములయందుండి, అర్యముడనియు, వరుణుడనియు, వాయుదేవుడనియు, చంద్రుడనియు బ్రహ్మదేవుడనియు, విష్ణుదేవుడనియు, శివుడనియు, యిట్లు అనేకము లగు పేర్ల చేత చెప్పబడుచున్నాడు. మహాత్ములగువారు అట్టి ఆత్మను తెలిసికొని భక్తిచేత స్తుతించుచుందురు అని బ్రహ్మదేవుడు చెప్పి మరల యిట్లనెను.

మునులారా! ఇంకను కొన్నిలక్షణములను చెప్పెదను వినుడు. ధర్మమునకు అహింస లక్షణము. అధర్మమునకు హింస లక్షణము. దేవతలకు ప్రకాశము లక్షణము. మనుష్యులకు కర్మము లక్షణము. ఆకాశమునకు శబ్దమును, వాయువునకు స్పర్శమును, అగ్నికి రూప మును, జలమునకు రసమును, భూమికి గంధమును, వాక్కునకు సత్య మును, మనస్సునకు చింతయు, బుద్ధికి నిశ్చయమును, బుద్ధిసంబంధ మైన మహత్తత్త్వమునకు ధ్యానమును, అవ్యక్తమనెడి ప్రకృతికి సమత్వ భావమును, యోగమునకు నడవడికయు, జ్ఞానమునకు కర్మ సన్యాసతయు. లక్షణములు. గనుక, మునులారా! సర్వకర్మ సన్యాస రూపమగు జ్ఞానము, పలతత్త్వమును తెలుపుటకు హేతువు. జ్ఞాన పూర్వకమగు కర్మసన్యాసము మోక్షము నిచ్చును. శీతోష్ణసుఖ దుఃఖాది ద్వంద్వములు లేనివాడు జనన మరణాది సంసారమును తప్పించుకొనుటకు సమర్థుడగును.

## అవ్యక్తనామ తత్త్వనిరూపణ ప్రకారము

మునులారా! ప్రకృతి అవ్యక్తతత్త్వము, ఒకానొక విధమైన గురుతుగలది. ఆత్మ అట్టిగురుతు లేనివాడు. గనుక, అవ్యక్తతత్త్వము సలింగమనియు, ఆత్మ అలింగుడనియు చెప్పబడును. అవ్యక్తమునకు ప్రకృతియనియు క్షేత్రమనియు రెండు పేర్లుగలవు. అవ్యక్తమనెడి క్షేత్రమును ఆత్మయెరుగుచున్నందున, క్షేత్రజ్ఞుడని ఆత్మ చెప్పబడును. అవ్యక్తతత్త్వము రజస్తమములనెడి గుణములను పుట్టించుచున్నది. ఆగుణములు జ్ఞానశక్తిగల పదార్థములు కానందున ఆత్మను యెరుగలేవు. ఆత్మ ఆగుణముల కార్యముల నన్నింటిని యెరుగుచున్నాడు. గనుక, ఆత్మయొక్కటే జ్ఞానవస్తువు. ఆత్మకంటె అన్యములగు ప్రకృతి మొదలగు పదార్థములన్నియు జడపదార్థములు, ఆహేతువుచేత సత్త్వరజస్తమో గుణములను విడిచి నిశ్చల బుద్ధిచేత ఆత్మను యెరిగినవాడు పరిపూర్ణ జ్ఞానానంద నిత్యశుద్ధ రూపమగు మోక్షపదమును బొందుచున్నాడు. ఆత్మతత్త్వమే మోక్షపదమని తెలిసికొనుడు.

మునులారా! శ్రేష్ఠవస్తువులను చెప్పెదను వినుడు. ప్రకాశవస్తువులలో సూర్యుడధికుడు. పంచభూతములలో అగ్ని శ్రేష్ఠము. విద్యలయందు ప్రధాన సావిత్రియు, దేవతలలో ప్రజాపతియు, వేదములయందు ప్రణవమును, పంచవాయువులయందు ప్రాణవాయువును, వేదాంగములయందు గాయత్రియు, పశువులయందు మేకపోతును, నాలుగుకాళ్లుగల జంతువులయందు గోవును, మనుష్యులయందు బ్రాహ్మణుడును, పక్షులయందు డేగయు, యజ్ఞవిధులయందు హోమమును, యుగములయందు కృతయుగమును, ధాతువులలో బంగారమును, శ్రేష్ఠములు. ఓషధులయందు గోధుమలును, భోజన

పదార్థములయందు అన్నమును, త్రాగెడి వస్తువులయందు జలమును పర్వతములయందు హిమవత్పర్వతమును, వృక్షములయందు రావి చెట్టును, దిక్కులయందు ఊర్ధ్వదిక్కును, నదులయందు గంగానదియు సరస్సులలో సముద్రమును, ఆశ్రమములయందు గృహస్థాశ్రమ మును, ప్రజాపతులయందు నేనును నాకంటె విష్ణుదేవుడును, సకల దేవతలకంటె శివుడును అధికులు. ఆత్మవస్తువు యొక్కటే బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపమునుదాల్చి యుండును. సకల జ్ఞానముల కంటె ఆత్మవస్తువును యెరిగెడి జ్ఞానము శ్రేష్ఠము. అట్టి జ్ఞానము కలిగి బ్రహ్మవిష్ణు మహేశ్వరులు ముగ్గురును ఒక్కటే రూపమని యెరుగుట శ్రేష్ఠము. మునులారా! పగలును, రాత్రియు, ఒకటిని వెంబడించుకొని మరియొకటి వచ్చినట్లు జంతువులకు సుఖదుఃఖము లును సర్వదా కలుగుచు నశించుచుండును. గనుక, సుఖదుఃఖములు కలిగినపుడు మనోవికారమును బొందరాదు. పొదలు తగ్గుటకొరకు పొడుగుగా యెదుగుచున్నవి. విరోధము కలుగుట కొరకు అధిక స్నేహము కలుగుచున్నది. చచ్చుటకొరకు పుట్టుక కలుగుచున్నది. ఇది లోకస్వభావమని తెలిసికొనుము.

మునులారా! గురుశాస్త్ర అనుభవముల ప్రకారము ఆత్మ జ్ఞానము కలిగిన యెడల అట్టి జ్ఞానమున కెప్పటికిని నాశము కలుగ జాలదు. గనుక, అహంకార మమకారములు లేక ఆత్మజ్ఞానమును సంపాదించినవాడు మోక్షమార్గమును తెలిసికొనును. అని బ్రహ్మ దేవుడు మునులకు చెప్పి ఆశ్రమపద్ధతులను తెలిపెదనని చెప్పి యిట్లనెను. మునులారా! బ్రహ్మచారియగువాడు తన గురువునకు మేలు చేయుచుండవలయును. వేదముచదువుచు, బిచ్చమెత్తుకొనిభక్షించుచు మారేడు మోదుగు చెట్ల కర్రను ధరించి సంచరింపవలయును. బ్రహ్మ చారియగువాడు స్నానములచేత పరిశుద్ధుడై స్త్రీలతో మాటలాడక

నియమముతో బ్రహ్మచర్య వ్రతము జరుపుచు ఇంద్రియ నిగ్రహము గలిగి యుండవలయును. సర్వదా పరిశుద్ధిగలిగి యజ్ఞోపవీతమును ధరించి అధికముగా జనులతో మాటలాడక యుండవలయును. గట్టి మొలతాడును గట్టికొని, తగినట్లు పండుకొనుచుండ వలయును. సత్య వంతుడై శాంతముకలిగి ప్రవర్తింపవలయును. పాపకార్యములను చేయుటకైనను, చేయించుటకైనను సమ్మతింపరాదు. ఈ ప్రకార ముగా బ్రహ్మచర్యాశ్రమమును బ్రహ్మచారి జరుపవలయు. ఇకను, గృహస్థధర్మములను చెప్పెదను వినుము. పూర్వోక్త ప్రకారము బ్రహ్మ చర్యాశ్రమ ధర్మమును నడిపిన బ్రహ్మచారి తగినట్లు సమావర్తన క్రియను జరుపుకొని, తన భార్యయందు రమించుచు నిర్మలములగు పుణ్యకార్యములను జేయుచు పంచయజ్ఞములను నడుపుకొనుచుండ వలయును. అతిథులను పోషించి పూజించుచు, తెల్లని వస్త్రము లను ధరించుకొని, తన శక్తికొలద దానముచేయుచు చపలమగు ఇంద్రియ గుణములులేక పరిశుద్ధుడై ప్రవర్తించవలయును. సర్వ జనులతోటి స్నేహముగలిగి వేదముచదువుచు మంచి వ్రతనియమము కలిగి తనకు శక్యమైన యెడల యజ్ఞముచేయుచు, వేదమును చెప్పు చుండవలయును. ఓర్పుగలిగి, మంచిదానమును తీసికొనుచు మాటల వ్యవహారమందు మిత్ర శత్రు భావములను తలచక మధ్యస్థునివలె ప్రవర్తించవలయును. ఇవి యన్నియు గృహస్థ ధర్మములు. వాన ప్రస్థాశ్రమ ధర్మమును చెప్పెదను వినుము. వానప్రస్థాశ్రమమును పొందినవాడు తన నివాస గ్రామము విడిచి, అడవికివెళ్ళి, పర్ణ శాలలు కల్పించుకొని సూర్యోదయాస్తమయ కాలములయందు రెండు మార్లు స్నానముచేయుచు బ్రహ్మచర్య వ్రతమును జరుపుచుండ వలయును. గడ్డివల్లకలికిన ధాన్యములును, పండ్లును, కందమూలము లును, ఆహారముగా భక్షించుచుండవలయును. కృష్ణాజినమును

నారబట్టను. వస్త్రముగా ధరించుకొని భూమిమీద పండుకొని నిద్రించుచు, అతిథులకు తన ఆహారమును పంచిపెట్టుచుండ వలయును. అధ్యయన హోమములను చేయుచు, సకలేంద్రియములను జయించి ప్రకాశించుచుండవలయును. ఇని వానప్రస్థాశ్రమధర్మములు. ఈమూడు ఆశ్రమములలో యే ఆశ్రమమందున్నవారైనను ఆత్మ జ్ఞానమును కోరి సన్యసింపదలచినయెడల సన్యాసాశ్రమమును పొంద వచ్చును. సన్యాసాశ్రమధర్మములను చెప్పెదను వినుడు. కర్మ సన్యాసాశ్రమమును పొందినవాడు సర్వభూతములయందును దయ గలిగి గడచిపోయినవిషయములను చింతింపక, కలుగబోయెడి వస్తు వులయందు ఆశనుంచక ప్రస్తుతకాలమందు లభించిన వస్తువుయందు ప్రీతినుంచక భక్షించుచుండవలయును. తాబేలు తన అవయవము లను లోనికి అణచుకొన్నట్లు ఇంద్రియములను మనస్సులోనికి అణచు చుండవలయును. తగిన కాలములయందు భిక్షాన్నములను భక్షించి ఆభిక్షాన్నముచేత తన దేహమును బ్రతికించుకొనవలయును. తన దేహమును బ్రతికింపజేసికొనెడి అన్నము మొదలగు ఆహారపదార్థ ములను తప్ప యితరవస్తువులు యేమేమి లభించినను తీసికొనరాదు. దివమునకు ఒకసారి భక్షింపుచు పరులకు నమస్కరింపక స్నేహము జేయక, స్తుతింపక, నిగ్రహింపక, ప్రవర్తింపవలయును. ఇవియన్నియు సన్యాసాశ్రమ ధర్మములు.

యతికి ముఖ్యవ్రతములను చెప్పెదను వినుడు. అసూయ లేకుండుటయు, క్రోధములేకుండుటయు, మంచిస్వభావము కలిగి ఇంద్రియములను నిగ్రహించుటయు, బ్రహ్మచర్య నియమము కలిగి యుండుటయు, వంకరగుణస్వభావము లేకుండుటయు, సత్యము జెప్పు టయు, నీచస్వభావము లేకుండుటయు, ప్రాణులను పీడింపక, హింసింప కుండుటయు, ఈగుణములు యతికి ముఖ్యవ్రతములు. యతియనగా,

సన్న్యాసియని తెలియవలెను. యతియగువాఁడు వృక్షముల్ క్రింద నైనను, నదీతీరములయందైనను, జనులు లేనిగృహములయందైనను, అరణ్య పర్వతగుహా దేవాలయ నిర్జనప్రదేశముల యందైనను నివసించుచు, కుటిలస్వభావము లేక, యేపదార్థములనైనను సంపాదించక ప్రవర్తించవలయును. యతియగువాఁడు తన మహాత్మ్యమును పరులకు తెలుపక తనను చూచెడివారికి తాను సాక్షిచందముగా ప్రవర్తించుచుండవలయును. అట్లు ప్రవర్తించెడి యతి ముక్తుఁడగును. అని బ్రహ్మదేవుఁడు నాలుగాశ్రమముల ధర్మములను తెలిపి యిట్లనెను.

సన్న్యాసమనగా తపస్సు. తపోజ్ఞానములుగల జనులు యేఆశ్రమమందున్నను సత్యజ్ఞానానంద స్వరూపమగు పరబ్రహ్మమునుచూడగలరు. తామస రజోగుణములను బొత్తిగావిడిచి శుద్ధ సత్వగుణముగలవారు తపస్సుచేసి అట్టి తపస్సువలన సర్వాత్మరూపమగు ఆత్మను తెలిసికొని ద్వంద్వగుణములు లేనివారై ముక్తులగుదురు. సంసారము ఒక వృక్షమువంటిది. సంసారవృక్షము అవ్యక్తమువలన బుట్టినది. బుద్ధి సంసారవృక్షముయొక్క ప్రమానువంటిది, అహంకారము మొదటి పెద్దకొమ్మ. పంచమహాభూతములు చిన్నకొమ్మలు. ఇంద్రియములు తొర్రలు, పుణ్యపాపములు పండ్లు. మునులారా! ఇట్టి సంసారవృక్షమును జ్ఞానమనెడి తీక్ష్ణమగు కత్తిచేతనరికివేసి అభిమాన అహంకారములులేని మనస్సుగల పురుషుఁడు బ్రహ్మానందమునుపొందగలఁడు. ఏ పురుషుఁడైనను పరమనియమముగలిగి ఒక నిమిషకాలమైనను మనస్సుచేత ఆత్మనుచూచినయెడల అట్టిపురుషుఁడు పరిపూర్ణదివ్యబోధగల మహామునులుపొందెడి మోక్షమున్బొందుచున్నాఁడు. పరమనియమమనగా ప్రాణనిగ్రహము. ప్రాణనిగ్రహమునుక్రమముగా చేయుచురాగా అది క్రమముగా వృద్ధియై నిశ్చలముగ నిలిచియుం

డును. అట్టి యోగబలమువలన యిష్టసిద్ధికలుగును. అవ్యక్తమనెడి తత్వమువలన సత్యమనెడి దివ్యతీర్థము పుట్టియున్నది సత్యతీర్థమును సేవించినయెడల అమృతపదము లభించుచున్నది.

మునులారా! బ్రహ్మతత్వ జ్ఞానముకంటె అధికమైన కర్మమైనను, జ్ఞానమైనను, మరియొకటిలేదు. అట్టి బ్రహ్మజ్ఞానమువలననే బ్రహ్మమును పొందవలయును. ఆ బ్రహ్మమునుపొందుటకు మరియొక సాధనము లేదు. మునులారా! ఆత్మను తెలిసికొనినయెడల పరబ్రహ్మప్రాప్తి కలుగుచున్నది. ఆత్మ బ్రహ్మములకు శబ్దభేదముగాని వస్తుభేదము యెంతమాత్రమైనను కలుగనేరదు. గనుక, దేహమందుండెడి ఆత్మను యెరిగినయెడల బ్రహ్మప్రాప్తిలక్షణమైన మోక్షము అవశ్యముకలుగగలదు. ఆత్మజ్ఞానమువలన తప్ప మరియొక ఉపాయముచేత ఆత్మను యెరుగలేరు. గనుక జ్ఞానమును అవశ్యము అభ్యసింపుడు. అట్టి జ్ఞానము యెట్లు లభించునని యంటిరేని చెప్పెదను వినుడు. సత్యము, సంతోషము, అహింసయు, ధైర్యశక్తియు, ఓర్పును, సమ్యస్వభావగుణము కర్మసన్యాసము, సర్వఫలత్యాగము, విజ్ఞాన యోగాభ్యాసము ఈగుణములు సాత్వికములగును. గనుక, తత్వవిచారణము చేయుచు ఈ గుణములను గలవారు ఆత్మను పొందగలరు. పురుషుడు, అవ్యక్తతత్వము, ఈ రెండును ఒక్కటియే యని కొందరు పెద్దలు చెప్పుదురు. అట్లు కానేరదు. అత్తిపండుయందు దోమలున్నట్లును అవ్యక్తతత్వమందు ప్రత్యగాత్మయుండునని అనేకులగు పెద్దలు నిశ్చయించియున్నారు. నిర్గుణ పరబ్రహ్మ తత్వమువలన ప్రపంచసృష్టి కలుగనేరదు. గనుక, బ్రహ్మమందుండెడి అవ్యక్త తత్వముపైన చెప్పబడిన సకలసృష్టిని చేయుచున్నది. అవ్యక్తతత్వము సత్వమనబడును. అవ్యక్తతత్వమువలన యేర్పడిన ఇరువది నాలుగు

తత్త్వములను విచారించుట తత్త్వజ్ఞాన మనబడును. ఆతత్త్వజ్ఞానమువ లన బ్రహ్మప్రాప్తి కలుగగలదు. అని బ్రహ్మదేవుడు చెప్పగా మునులు విని యిట్లనిరి. మహాత్ముడవగు బ్రహ్మదేవా!! ధర్మములు అనేకవిధములుగానున్నవి. ఈధర్మములలో యెవడు ఏధర్మమును ఆచరించుచుండునో వాడు ఆధర్మమును మంచిదని చెప్పును. మేము అన్ని ధర్మములయందు ఇష్టముగలవారమై శ్రేష్ఠధర్మమెద్దియో తెలియక సంశయముగలిగి యుందుము. గనుక యేధర్మము శ్రేష్ఠమో దేనిని అనుష్ఠింపవలెనో అట్టి ధర్మమును మాకు చెప్పుము. మరియు ప్రకృతి యనెడి సత్యమునకును, ఆత్మయనెడి పురుషునకును సంబంధము కలిగియుండు విధమును స్పష్టముగా చెప్పుమని యడుగగా బ్రహ్మదేవు డిట్లనెను.

## సత్యంబవశ్యానుష్ఠేయంబుగా నిరూపించుట

మునులారా! సకల ధర్మములలో యేజంతువునైనను హింసింపకుండుట పరమ ధర్మమగును. పరమధర్మము అహింసయనబడును. అహింసాధర్మముతో గూడినవానికి మంచి జ్ఞానము ఉదయించును. కర్మఫలమును కోరుచు కర్మములను చేసినవాడు పుణ్యలోకములకు పోవుచు, మరలపుట్టుచు, చచ్చుచు యిట్లు సంసారమందు తిరుగుచుండును. ఫలమును అపేక్షింపక ఈశ్వర సమర్పణపూర్వకముగా పుణ్యకర్మములను చేసినయెడల అట్టివానికి జ్ఞానము కలిగి ముక్తిలభించుచున్నది. తత్త్వజ్ఞానము కలవాడు విషయసుఖములను అనుభవించుచున్నను తామరాకును జలము అంటనట్లు విషయసుఖములయందు అభిమానింప కుండును. మునులారా! ఆత్మను చూచుటకు అవ్యక్తమనెడి సత్వము మంచిదీపమువంటిది. కనుక అవ్యక్త తత్త్వమనెడి సత్వమును విడువక చిదానందరూపమగుఆత్మను

యెరుగవలయును. ఆత్మను పొందుటకు యిది మంచిమార్గము. లోకమందు ప్రతికార్యమందును. అపాయములేని మంచిసాధనముచేత మేలుకలుగుచున్నది. లేనియెడల మేలుకలుగదు. యెట్లనగా చెప్పెదను వినుడు. దూరమార్గమునకు నడిచి వెళ్ళువాడు మంచివాహనము గలవాడైనను ఓడచేత యేటిప్రవాహమును దాటవలయును. తెప్పయనెడు సాధనములేమి వాడు నదిని దాటజాలడు. ఇట్లు తెలిసియు, అహంకార బలగర్వములవలన తెప్పను సాధనముగా గ్రహించక ఏటియందు దిగినయెడల యేటిని దాటక పోవుటమాత్రమేగాక దుఃఖములును కలుగగలవు గనుక, సాధనములేక యేకార్యమున్నైనను సాధింపరాదు. స్థలమార్గమునకు తెప్పయు, జలమార్గమునకు బండిగుఱ్ఱము మొదలగు వాహనములును సాధనములును సాధనములుగావు. గనుక, యేకార్యమునకు యేదిసాధనముగునో అట్టిసాధనమును యేర్పరచికొనినవాడు దుఃఖములను తప్పించుకొని సుఖింపగలడు. మునులారా! నదినిదాటెడి పర్యంతము తెప్పను ఆశ్రయించి పిమ్మట ఆసాధనమగు తెప్పను విడిపించినట్లు ఆత్మనుయెరిగెడి పర్యంతము అవ్యక్తమనెడి సత్వము సాధనముగా జేసికొని ఆత్మను యెరిగిన పిమ్మట ఆసత్వమును విడువవలయును. అని బ్రహ్మదేవుడు చెప్పి మరల యిట్లనెను. మునులారా! అవ్యక్తమనెడి ప్రకృతియొక్క గుణము మహత్తత్వము. మహత్తత్వగుణము అహంకారము, అహంకారముయొక్క గుణములు పంచమహాభూతములు, పంచమహాభూతములగుణములు శబ్దాదులు. అది యెట్లనగా చెప్పెదను వినుడు. ఆకాశమునకు శబ్దము గుణము. వాయువునకు శబ్దస్పర్శముల నెడి రెండుగుణములును కలవు. అగ్నికి శబ్దస్పర్శరూపముల నెడి మూడు గుణములు గలవు. జలమునకు శబ్దస్పర్శరూపరసముల నెడి నాలుగు గుణములు గలవు. భూమికి శబ్దస్పర్శరూపరసగంధముల నెడి అయిదు

గుణములగును. శబ్దము మృదుఖరాదివిధములచేత అనేక ప్రకార ములుగానుండును. స్పర్శము శీతఉష్ణాదిభేదములచేత అనేకవిధములై యుండును రూపము తెలుపు, నలుపు మొదలగు అనేకవిధములుగా నుండును. రసము తీపు, చేదు మొదలగు నానావిధములుగానుండును. గంధము మంచివాసన, చెడువాసన మొదలగు అనేకవిధములుగా నుండునని యెరుగుటవలన ఆ విషయములను విడుచుటయందు బుద్ధి కలుగును.

మునులారా! భూమికంటె జలము శ్రేష్ఠము. జలముకంటె అగ్ని అధికము. అగ్నికంటె వాయువు అధికము. వాయువుకంటె ఆకాశము అధికము. ఆకాశముకంటె అహంకారతత్వము అధికము. అహంకారతత్వముకంటె బుద్ధిఅధికము. బుద్ధికంటె ప్రకృతియనెడి అవ్యక్తతత్వము అధికము. వీని యన్నింటికంటె ఆత్మయనెడి పురుషుడు అధికుడు. ఈప్రకారము భూతతత్వములయొక్క హెచ్చు తక్కువలను గ్రహించినవారలు పరంజ్యోతిస్వరూపుడగు పురుషుని తెలిసికొని శాశ్వతసుఖముగల మోక్షమును పొందగలరు. మును లారా! రథసారథి గుఱ్ఱములను నడుపుటకు సమర్థుడైనట్లు మనస్సు యింద్రియములను పంచభూతముల విషయముల తట్టుకు పంపించు టకును. నిలుపుటకును సమర్థమైనది. పంచభూతములు రథము వంటివి, ఆరథమునకు యింద్రియములు, గుఱ్రములు, మనస్సుసారథి, అట్టి రథముమీద నుండెడి రథికపురుషుడు ఆత్మ. అట్టి పురుషుడు అట్టి దివ్యరథముమీద నెక్కి తనకు తనకు యిష్టమైన చోటికి వెళ్ళగలడు. మనస్సుయనెడి సారథి వివేకియై జాగ్రతతోటి యింద్రియములనెడి గుఱ్ఱములను చక్కగా మంచిమార్గమందు నడిపినయెడల పురుషుడు కోరిన స్థలమునకు పోగలడు. లేనియెడల గుఱ్ఱములు చెడుమార్గమందు నడిచి దుఃఖపెట్టును. ఇట్లు తెలిసికొనిన పండితుడు భయంకరమైన

సంసారమనెడి ఉరిని తప్పించుకొనగలిగి నిర్గుణమగు అవ్యయమోక్ష పదమును పొందగలరు.

మునులారా! సముద్రమందు అలలు వెంబడివెంబడి పుట్టుచున్నట్లు అవ్యక్తమనెడి ప్రకృతివలన దేవమనుష్య పశుపక్షివృక్షపర్వతాదులగు చరాచర ప్రపంచము పుట్టుచున్నది. ప్రకృతి మొదలగు సకలతత్వ ప్రపంచములును పురుషుడనెడి ఆత్మను ఆశ్రయించుకొని ప్రవర్తించుచున్నవి. మంచిజ్ఞానముచేత ఈప్రకారముగా తెలిసికొనినవారలు అజ్ఞాన మోహామువలన కలిగిన సంసారబంధమునుండి ముక్తులగుచున్నారు. మునులారా! ఇట్లు పరత్వమగు ఆత్మను తెలిసికొనుటకు మొట్టమొదటి సాధనము తపస్సు. గనుక, మంచి నిష్ఠచేత ఫలమును అపేక్షింపక తపస్సును సంపాదించ వలయును. మంచిగొప్ప తపోశక్తివలననే ప్రజాపతులు బహువిధములగు జంతువులను సృష్టించుటకు సమర్థులైరి. వనమందుగల కందమూలాది పదార్థములను ఆహారముచేసికొని మునులు తపస్సు చేయుదురు. అట్టి తపస్సువలననే మూడు లోకములయందును సంచరించుచు మూడుకాలములను యెరిగెడి దివ్యదృష్టి గలిగియున్నారు. తపస్సువలననే అనేకవిద్యల వలన గౌరవము కలుగుచున్నది. మరియొక ఉపాయముచేత పొందరాని మహాపదములను తపస్సువలన పొందుచున్నారు. తపస్సువలననే, బ్రహ్మహత్యాదోషము, కల్లు త్రాగిన పాపము మొదలగు మహాపాపము లన్నియు నశించుచున్నవి. మంచితపస్సువలన సకలభూతములును ప్రీతి బొందగలవు. మునులారా! అహంకారమమకారములులేక మంచి తపస్సుచేసిన యెడల అట్టి తపస్సుచేత బ్రహ్మలోకము కలుగుచున్నది. ఈవిషయమై సంశయములేదు. అహంకారమమకారములను విడిచి మంచి ధ్యాననిష్ఠవలన తపస్సుచేసినవాడు సకలపదములకంటె శ్రేష్ఠమైన అవ్యయపదమును బొందుచున్నాడు.

మునులారా! వైరాగ్యముగల ముని రజస్తమోగుణములను బొత్తిగా, విడిచి సత్వమనెడి అవ్యక్తతత్వమందు రమించుచు నిర్గుణతత్వమగు ఆత్మనుచూచి తనతో కలసియుండెడి ప్రకృతి విడుచును. అట్లు ప్రకృతిని విడిచి స్వస్వరూపమగు పరబ్రహ్మముగా నుండుటయే ముక్తియనబడును. మునులారా! వేదాంత రహస్యములచేత చెప్పబడెడి ఆనిర్గుణ పరబ్రహ్మతత్వము ఈదేహమందుండెడి క్షేత్రజ్ఞుడైన ఆత్మయేనని తెలిసినవాడు సర్వజ్ఞుడనబడును. మునులారా! వృత్తి విశేషములను చింతించెడి చిత్తము వెంబడి మనస్సును చేర్చి అట్టి వృత్తులుగ చిత్తమును యోగమందు నిలిపి మనస్సును నిశ్చలముగా నుంచవలయును. ఇది ఉత్తమరహస్యమని పెద్దలు చెప్పుదురు. మునులారా! అవ్యక్తమనెడి ప్రకృతితత్వము మొదలుకొని శోచెడి తత్వములన్నియు అవిద్యవలన కలిగినవని తెలిసికొనుడు. అవిద్యయనగా అజ్ఞానము. అదియేబంధము, అట్లు అవిద్యవలన కల్పితమైన దేహేంద్రియాది ప్రపంచమందైనను భార్యాపుత్ర ధనాది పదార్థములయందైనను నాది యనెడి యభిమానము కలిగినయెడల బంధము మృత్యువగును. దేహేంద్రియాది ప్రపంచమందు నాది యనెడి అభిమానము కలుగని యెడల మోక్షరూపమగు అమృత కర్మలయందు ఆసక్తిగలవారు కర్మమార్గము శ్రేష్ఠమని చెప్పుదురు. జ్ఞానులగువారు జ్ఞానమార్గము శ్రేష్ఠమని చెప్పుదురు. ఆత్మవలననే పదియారు అవయవములు గల లింగదేహము పుట్టెను. జ్ఞానేంద్రియములైదును కర్మేంద్రియములైదును, పంచవాయువులును, మనస్సునొకటియు యివి యన్నియుచేరి పదియారగును. ఈపదియారును లింగదేహమని చెప్పబడును. లింగదేహము ఆత్మ నిత్యుడనియు, దేనిచేతను గ్రహింపదగినవాడు కాడనియు తెలుపుచున్నది. గనుక ఆత్మకు కర్మరూపము లేదనియు, జ్ఞానరూపముచేత ప్రకాశంబుగలిగియున్నదనియు శ్రుతులు

సాటించుచున్నవి. జ్ఞానము, యేమహాత్మునకు కలిగియుండునో, ఆ మహాత్ముడు సకల సంకల్పములను విడిచి తనయందే తనను జూచుకొనుచు నెప్పటికి ఉపద్రవములేని అమృతరూపమగు మోక్ష పదమును పొందుచున్నాడు గనుక కర్మమార్గముకంటె జ్ఞానమార్గము శ్రేష్ఠమగును. అని బ్రహ్మదేవుడు చెప్పి యిట్లనెను.

మునులారా ! దివ్యజ్ఞానములచేత మోక్షపదము యీప్రకారముగా నిర్ణయింపబడి యున్నది. గనుక కర్మసన్యాసరూపముగల జ్ఞానముచేత మోక్షపదము లభించుచున్నది. అని బ్రహ్మదేవుడు జ్ఞానముచేతనే మోక్షము కలుగునని సిద్ధాంతముగాజెప్పి యిట్లనెను. మునులారా! సకల కామములను విడిచి సర్వసంగ పరిత్యాగము చేసి సకలప్రాణులయందును పరబ్రహ్మ మొక్క టేవిధముగా నుండు ననెడి సమబుద్ధిగల మహాత్ములు మోక్షపదమనెడి విదేహ కైవల్యమును పొందుటకు సమర్థులు. చెప్పవలసిన దంతయు మీకిపుడు చెప్పితిని. ఈప్రకారము మీరు నడుపుకొనుడు. జ్ఞానవిషయము తప్ప మరియొకవిషయ సంకల్పమును మీ మనస్సునందు వుంచవద్దు. ఇది మీకు తగినమార్గము. ఈ జ్ఞానమార్గమువలన మీకు తప్పక మోక్షము సిద్ధింపగలదు. అని బ్రహ్మదేవుడు వుపదేశించగా మునులు నిర్గుణ సమాధిగలవారై సుఖమును పొందిరి. అని గురువు తన శిష్యులతో జెప్పి యిట్లనెను. శిష్యుడా! మునులకు బ్రహ్మదేవుడు చెప్పిన వాక్యములను నీ కిపుడు చెప్పితిని. నే జెప్పిన వాక్యములను మనస్సునం దుంచుకొని నిర్మలమైన సమాధిని అభ్యసించిన యెడల నీకు సులభముగా మోక్షము లభింపగలదు. అని గురువు చెప్పగా శిష్యుడు జ్ఞానవంతుడై జ్ఞానము అభ్యసించి అపరోక్ష జ్ఞానముచేత నిత్యసౌఖ్యముగల మోక్షమునుపొందెను. అని కృష్ణుడు

చెప్పగా అర్జునుడు సంతోషించి యిట్లనెను. మహాత్మా! కృష్ణా! గురుశిష్యులు మహాత్ములుగదా! వారిద్దరును యెవరో చెప్పుమని ప్రార్థించగా కృష్ణు డర్జునుని జూచి నవ్వుచు యిట్లనెను. అర్జునా! గురువు నేనేయగుదును. శిష్యుడు నామనస్సని యెరుగుము. నీమీద నాకుగల కృపచేత జ్ఞానమును గురుశిష్య సంవాదరూపముగా పేరు పెట్టి చెప్పితిని. జ్ఞానము యితరులకు సాధ్యముగాదు, అతిరహస్య మగును. నీచిత్తమును నిర్మలముగాను నిశ్చలముగా నుండునట్లుచేసి నాయందుంచి నామీద భక్తికలిగి యుండుము. సర్వదా నే జెప్పిన వాక్యములకు అర్థమును యోచింపుము. అట్లు చేసితివేని సకలపాప ములను పోగొట్టుకొని శుభమును పొందగలవు, ఈ జ్ఞానమును మునుపు నీవు యుద్ధభూమియం దున్నప్పుడు చెప్పితిని. ఇపుడు నీవు అడిగినందున గురుశిష్య సంవాదరూపముగా జెప్పితిని. నీవు యిక నైనను నిశ్చలబుద్ధిగలవాడవై ఆత్మతత్వమందు రమింపుము. అని కృష్ణు డర్జునకు అధ్యాత్మవిషయములైన వాక్యములను చెప్పెనని వైశంపా యనుడు జనమేజయునకు చెప్పగా అంతట జనమేజయు డిట్లనెను. మహాత్మా! వైశంపాయనమునీంద్రా! గురుశిష్యులగు కృష్ణార్జునులు యేవిధముగా ప్రవర్తించిరో వినవలెనని నాకు అపేక్ష గలిగియున్నది కనుక చెప్పుమని యడిగెను.

ఇది శ్రీ మహాభారతమునందలి అశ్వమేధపర్వమునందు
ద్వితీయాశ్వాసము ముగిసెను.

# తృతీయాశ్వాసము



దేవా! హరిహరనాథా! వైశంపాయనుడు జనమేజయుని జూచి యిట్లనెను. జనమేజయమహారాజా! కృష్ణుడు అర్జునుని మంచి జ్ఞానవంతునిగా జేసి అర్జునునితో యిట్లనెను. అర్జునా! నా మనస్సు నా తండ్రియగు వసుదేవుని చూడదలచియున్నది. అందుకు నీయను మతి గోరియున్నాను. నన్ను ద్వారకాపట్టణమునకు పంపించుము. అని కృష్ణుడు చెప్పగా అర్జునుడు యిట్లనెను. కృష్ణా! నీవు వెళ్ళదలచిన యెడల మనము హస్తినాపురమునకు వెళ్ళి ధర్మరాజుతో చెప్పి ఆయన అనుమతిని పొందవలయును. ధర్మరాజు ప్రీతిపూర్వకముగా నిన్ను ద్వారకకు పంపించును. నేనును ధర్మరాజుతో సమయము చూచి చెప్పెదను. అని అర్జునుడు చెప్పగా కృష్ణుడు తన సారథియగు దారుకుని రప్పించి రథము సిద్ధముచేయుమని చెప్పెను. అర్జునుడు తమతోపాటు హస్తినాపురమునకు వచ్చుటకై తగిన పరిచారకులను సిద్ధపరచుటకు కొందరిని పంపించెను, కొంతసేపటికి దారుకుడు రథము సిద్ధముచేసి తీసుకొనివచ్చెను. అర్జునుడు పంపించిన జనులు, పరిచారకులను తీసికొనివచ్చిరి. అంతట కృష్ణార్జునులు ప్రయాణమునకు తగిన అలంకారములను చేసికొని రథమెక్కి హస్తినాపురమునకు వెళ్ళెడి మార్గమును పట్టివెళ్ళుచుండిరి. అట్లు వెళ్ళునపుడు వినయభక్తులతో అర్జునుడు కృష్ణునితో నిట్లనెను, కృష్ణదేవా! నీకరుణవలన మేము కౌరవసైన్యమనెడి మహాసముద్రమును దాటి గెలిచితిమి. భీష్మ, ద్రోణ, కర్ణులు మొదలగు అసాధ్యులగు మొనగాండ్రను గెలిచితిమి. నీవు మాశత్రువులనందరిని మొదట చంపినపిమ్మట అట్టివారిని మేము బాణములు వేయుచు చంపితిమి, నీ కృపవలన మేము విజయము

బొంది కీర్తివహించితిమి. పూజ్యమగు రాజ్యమును ధర్మరాజు పరిపాలింపుచున్నాడు. ఈచెప్పిన కార్యములన్నియు నీకృపవలన మాకు కలిగెనేగాని మరియొకటిగాదు. కృష్ణా! నీమహిమను నేను పొగడజాలను. నీవు సకలలోకములను సృష్టించెడి పరమేశ్వరుడవే గాని యాదవుడవు కావు. నీ తేజస్సే అగ్నిష్టోమమనెడి యజ్ఞరూపమగును. నీవే కాలస్వరూపముగా ప్రకాశింపుచుందువు. నీ యొక్క క్రోధము మృత్యువు. నీ నిశ్వాసము మహావాయువు. నీ అనుగ్రహము మహాలక్ష్మి. నీవలననే అమృత ఆనందములు కలుగుచున్నవి. మహాత్మా! కృష్ణదేవా! నీవలననే సకల చరాచరప్రపంచమంతయు సృష్టిస్థితి సంహారములను పొందుచున్నది. నీవు మనస్సుచేత స్మరింపరాని పరబ్రహ్మము, సర్వేశ్వరుడవు. లోకమును రక్షించుటకు మనుష్యుడవై పుట్టితివి. కృష్ణా! నారద దేవల కౌశికవ్యాసాది మహామునులు చెప్పినందునను, భీష్ముడు చెప్పినందునను నీవు సర్వాత్మకుడవని యెరిగియున్నాను. గనుక నీవు నాయందుగల కృపచేత నాకు జ్ఞానవాక్యములను చెప్పి రక్షించితివి. నీవుచెప్పిన వాక్యాభిప్రాయమును మనస్సునం దుంచుకొని ఆనందింపుచుండెదను. అని అర్జునుడు భక్తిపూర్వకముగా కృష్ణునితో సంభాషణము చేసెను. కృష్ణుడు అర్జునునితో కొన్ని మాటలు చెప్పి సంతోషించెను.

## కృష్ణార్జును లింద్రప్రస్థమునుండి హస్తినాపురమునకు వచ్చుట

జనమేజయ మహారాజా! కృష్ణార్జునులు మాట్లాడుచు బోయిరి. కృష్ణార్జునులు వచ్చెదరనెడి అభిప్రాయముతో హస్తినాపురమం దుండెడి జనులు పట్టణమును శృంగారించిరి. కృష్ణార్జునులు హస్తినాపురమునకు వెళ్ళి మొట్టమొదట ధృతరాష్ట్రుడుం

డెడి గృహమునకు పోయి వినయపూర్వక నమస్కారముల చేత ధృతరాష్ట్ర గాంధారులను సంతోషపరచిరి. పిమ్మట కృష్ణార్జునులు కుంతీదేవికి నమస్కారము చేసి విదుర, ధౌమ్య యుయుత్సు సంజయులను తనగ్రప్రకారము చూచిరి. అంతట కృష్ణార్జునులు భక్తి వినయపూర్వకముగా తగినరీతిగా ధర్మరాజును జూచిరి. అంతట ధర్మరాజు కృష్ణార్జునులను కౌగలించుకొనెను. అంతట కృష్ణార్జును లిద్దరును, ఒక గృహమందుండిరి. వెళ్ళిన దినమందు అర్జునుడున్న గృహమందు కృష్ణుడుండి అర్జునుడు చేసిన పూజలకు సంతోషించెను. మరునాడు న్యాయసభాస్థానమందుండెడి ధర్మరాజుదగ్గరకు అర్జునునితో కూడ వెళ్ళెను. అంతట సుఖముగా మాట్లాడెడి సమయమందు అర్జునుడు ధర్మరాజుతో యిట్లనెను. అన్నా! ధర్మరాజా! కృష్ణుడుబహుకాలము నుంచి మనదగ్గర నుండెను. కృష్ణుని తండ్రియు సహోదరాది జనులును కృష్ణుని చూచుటకు అపేక్షకలిగి యుందురు. కృష్ణుడు వారి జూచుటకు కోరియున్నాడు. గనుక నీవు అనుమతి యిచ్చిన యెడల కృష్ణుడు ద్వారకాపట్టణమునకుబోయి తనతల్లి తండ్రి అన్నదమ్ములు మొదలగువారి నందరిని జూచి యిక్కడకు వచ్చును. ఈ విషయమై తమ దివ్యచిత్తమందు యేమితోచునో ఆప్రకారము సెలవిమ్ము. అని అర్జునుడు ధర్మరాజుతో చెప్పగా ధర్మరాజు సంతోషించి ప్రీతిపూర్వకముగా అర్జునునితో యిట్లనెను.

తమ్ముడా! అర్జునా! మహాత్ముడగు కృష్ణదేవు డవశ్యముగా ద్వారకకు వెళ్ళి మన మేనమామయగు వసుదేవుని చూచి మనకు బదులుగా నమస్కరించి కౌగలించుకొనవలెను. బలరాముని దేవకీదేవిని జూచి మనకు బదులుగా పూజించి నమస్కరింపవలయును. ద్వారకయందుండెడి మన బంధువుల నందరిని కృష్ణుడు చూచి వారి క్షేమములను మనము అడిగినట్లుగా తెలిపి తగినప్రకారము

వారిని నేను ఆదరించినట్లు చెప్పవలెను. కృష్ణుడు ద్వారకయందుండెడి తన పరిచారకులయొక్క యోగక్షేమములను విచారించి పురజనులకు ప్రీతితో మాటలు చెప్పి తగిన కార్యములను చూచుకొని సన్మానింప దగినవారికి సన్మానగౌరవములు జరిపి కార్యములు అనుకూలించు వరకు నిలువవలసియున్నయెడల నిలువవలెను. ద్వారకయందుండి మనము చేయదలచిన అశ్వమేధయజ్ఞమునకు సకల బంధువులను తీసి కొని రావలెను. అని ధర్మరాజు అర్జునునితో చెప్పగా కృష్ణుడు సంతోషించి ధర్మరాజునకు నమస్కరించి కుంతీదేవి ద్రౌపదులతో చెప్పి ద్వారకకు వెళ్ళుటకు ప్రయత్నించెను. అంతట కృష్ణుడు సుభద్రను తనతోగూడ తీసికొనిపోదలచి కుంతీదేవి అర్జునుల అనుమతిని బొందెను. కృష్ణుడు రథమునీద యెక్కి వెళ్ళుచుండెను. కృష్ణుని పంపించుటకు పాండవులు, ఇతర బంధుజనులును అనేక రథముల మీద యెక్కినవారై కృష్ణుని రథముతో వచ్చుచుండిరి. సాత్యకి మరియొక రథముమీద కూర్చుండి ద్వారకకు పోవుచుండెను. హస్తినాపురముదాటి కొంతదూరమునకు వచ్చినపిమ్మట యొకచోట కృష్ణుడు నిలిచి తన వెనుక వచ్చుచుండెడి పాండవులు మొదలగు సకల బంధువులను నిలువుడని చెప్పి వారందరిని హస్తినాపురమునకు పంపించి వెళ్ళుచుండెను. అట్లు వెళ్ళెడి కృష్ణుడు తన మనస్సును అర్జునునిమీద వుంచి తిన్నగా బోవుచు మరలి అర్జునుని చూచు చుండెను. కంటికి కనబడునంతవరకు వెనుకకు తిరిగి అర్జునుని చూచి వెళ్ళుచుండెను. కృష్ణుని రథము ముందు పోవుచుండెను. కృష్ణుని రథము వెనుక మరియొక రథముమీద సాత్యకి వెళ్లుచుండెను. సాత్యకి రథము వెనుక మరియొక చిన్నరథముమీద సుభద్ర కూర్చుండి వెళ్లు చుండెను. కృష్ణునిమీద దేవేంద్రుడు పుష్పవర్షమును కురిపించెను. కృష్ణుడు వెళ్ళునపుడు వాయువు అనుకూలముగా వీచుచుండెను. నానావిధములైన శుభశకునములయ్యెను.

## శ్రీకృష్ణుడు ఉదంకాశ్రమమునకు బోవుట

జనమేజయమహారాజా! కృష్ణుడు ద్వారకకు వెళ్ళుచు బహు దూరమునకు పోయిన పిమ్మట మార్గసమీపమందుండెడి ఉదంకుడనెడి మునియొక్క ఆశ్రమమునకు పోయెను. ఉదంకాశ్రమమునకు వెళ్ళి వినయముతో ఉదంకుని చూచెను. ఉదంకముని కృష్ణునకు అతిథి పూజలు చేసెను. పూజలకు కృష్ణుడు సంతోషించి వుదంకమహాముని దగ్గర కూర్చుండగా ఉదంకుడు కృష్ణునితో యిట్లనెను. కృష్ణా! నీవు భరతవంశస్థులగు పాండవ కౌరవుల దగ్గరకు పోయి వారికి స్నేహము గలిగించితివి. పాండవ కౌరవులు కలహించుకొన దలచినపుడు వారికి సహాయముగావచ్చిన రాజులను వారి దేశములకు సుఖముగా పంపించితివి. వారి రాజ్యములను వారు సుఖముగా అనుభవించుచున్నారు. నీవు సకల జంతువులను సంతోషింప జేయువాడవు. నీవు ఒకరి పక్షమందు యెప్పటికినివుండువాడవు కావు. అని ఉదంకుడు యెరుగని వానివలె నిందారూపముగా కృష్ణుని యడిగెను. కృష్ణుడు వుదంక మహామునియొక్క తలంపును యెరుగని వానివలె అతని ముఖమును జూచి యిట్లనెను. ఉదంకమునీంద్రా! పాండవ కౌరవులకు సంధిచేయ దలచి నేను దుర్యోధనుని దగ్గిరకు పోయి సభ చేర్చి మంచి న్యాయపు మాటలను చెప్పితిని గర్వపుమాటలచే దుర్యోధనుని బెదరించితిని. భయము కలిగెడి మాటలను చెప్పితిని. మిక్కిలి బీదతనపు మాటలను చెప్పి పాండవులు అయిదుమందికిని అయిదు గ్రామములు యివ్వమని ప్రార్థించితిని. యెట్లైనను కౌరవ పాండవులకు సంధిచేయదలచి అనేకవిధములుగా మాట్లాడితిని. ఆసమయమందు భీష్మద్రోణులును నేను జెప్పిన ప్రకారము సంధిజేసుకొనుమని దుర్యోధనునితో జెప్పిరి. వ్యాసాది మునులు అనేక విధములుగా దుర్యోధనునితో నొక్కి చెప్పిరి. యెందరు చెప్పినను అధికలోభముచేత దుర్యోధనుడు వినక

వంశధర్మమును విడిచి సంధికి వొప్పుకొనలేదు. దుర్యోధనాది కౌరవు లందరును పాండవులతో యుద్ధముచేసి తన బంధుజన సహితముగా మృతినిబొంది పుణ్యలోకములకు బోయిరి. పాండవులతట్టున పాండవు లైదుగురును తప్ప తక్కిన బంధుజనులందరును యుద్ధమందుచచ్చి పుణ్యలోకములకు బోయిరి. గనుక కాలగతిని తప్పించుటకు యెవ్వరి కిని సాధ్యముగాదు. అని కృష్ణుడు చెప్పగా ఆమాటలను వుదంక మహాముని విని కోపతాపములచేత యెఱ్ఱని కండ్లుగలవాడై గ్రుడ్లు త్రిప్పుచు కృష్ణునితో యిట్లనెను. కృష్ణా ! నీవు పోకిరివై కౌరవకుల మును చంపితివి. సంధి చేయుటకు సమర్థుడవైయుండియు యిట్లు చేయించితివి గనుక యింతటి ఫలము నీవు అనుభవించునట్లు అతి ఘోరముగా నీకు శాపము ఇచ్చెదను. అని ఉదంకమహాముని కోపము చెప్పగా కృష్ణుడు యిట్లనెను.

మహాత్మా ! ఉదంకమునీంద్రా ! నేను జెప్పెడి మాటలను చక్కగా వినినపిమ్మట తగినట్లు చేయుము. నేను జెప్పెడి మాటలను వినుము. కోపించుకొనవద్దు. మునికి కోపముకూడదు. శాంతముచేత నామాటనను వినుము. స్వల్పతపస్సులచేత నాకు హానికలుగజాలదు. అధిక తపోబలముచేత నన్ను నీవు శపించినను నీతపస్సుయంతయు చెడిపోవును. అయ్యయ్యో ! నీ తపస్సును వ్యర్థముగా చెరుపుకొన కుము అని కృష్ణుడు చెప్పగా ఉదంకు డిట్లనెను.

కృష్ణా ! నా తపస్సు చెడిపోయినను పోనిమ్ము. నీవు జెప్పెడి మంచిమాటలు ఏవో చెప్పుము. నీవు చెప్పెడిమాటలు నాకు సరి యనితోచినయెడల నిన్ను శపింపదలచిన నామనస్సు మరలించెదను. అని వుదంకమహాముని చెప్పగా కృష్ణుడు చిరునవ్వు గలవాడై యిట్ల నెను. ఉదంకుడా! సత్వరజస్తమములనెడి మూడుగుణములును నావశ ములై ప్రవర్తించుచుండును, మరుద్దేవతలును, వసు రుద్రాది సకల

దేవతలును, నావలన పుట్టినవా రగుదురు. సకల చరాచర ప్రపంచ మందును నేను నిలిచి యుందును. సకల చరాచర ప్రపంచము నాయందే సుఖముగా నిలిచి యున్నది. నేనే పరమాత్మ తత్వము గను. వుదంకుడా! ఋగ్వేదాదులగు నాలుగు వేదములును బ్రాహ్మ ణ్యాదులగు నాలుగు వర్ణములును. బ్రహ్మచర్యాదులగు నాలుగాశ్ర మములును, సకలకర్మ సమూహములును వాని ఫలములగు స్వర్గ మోక్షములును యివియన్నియు నావలననే కలిగినవనియు, నామము లనియు తెలిసికొనుము. యజ్ఞకర్తలగువారు నన్నే స్తుతించి యజ్ఞ ఫలములను పొందుదురు. పాపాత్ములగువారు ప్రాయశ్చిత్తముల చేత నన్ను స్తుతించి పాపములను పోగొట్టుకొను చున్నారు. మనస్సు నా యొక్క మొదటికుమారుడని యెరుగుము. నేను ధర్మమును రక్షించి లోకములను కాపాడుటకై నాకు యిష్టమే కలిగినపుడు జన్మములను పొందుచుందును, నేను బ్రహ్మదేవ రూపముగానుండి జగత్తులను సృష్టించుచు విష్ణురూపముగానుండి జగత్తులను రక్షించుచు శివరూప ముగనుండి సర్వజగత్తులను సంహరించుచుందును. లోకములకు మేలు కలుగుటకై పాపాత్ములను సంహరించుచు, పుణ్యాత్ములను కాపా డుచు, ధర్మమార్గమును రక్షించునిమిత్తమై తగిన పనులను చేయు చుందును. సకల లోకములకును నేనే పరమేశ్వరుడ నగుదును. నేను యిట్టివాడనై యుండియు పాపాత్ములగు దుర్యోధనాదులను ధర్మాత్ము లగు ధర్మరాజాదులతో కలుపుటకు అనేకవిధములగు ప్రయత్నము లను చేసితిని. నేను చేసిన ప్రయత్నము దివ్యజ్ఞానులగు వేదవ్యా సాదులకు తెలిసియున్నది. నేను యెంత చెప్పినను దుర్యోధనాది కౌర వులు వినక మహాత్ములగు పాండవులతో ధర్మయుద్ధము చేసి చచ్చిరి. గనుక వుదంకా! నేను చెప్పినపని యిట్టిదై యున్నది. నన్ను గురించి ఏమి చెప్పెదవో చెప్పుమని కృష్ణుడు చెప్పగా ఉదంకుడు నమస్కరించి

చుచు కృష్ణునితో యిట్లనెను. మహాత్మా! కృష్ణుడా! నీమహిమను నీవు చెప్పగా తెలుసుకొంటిని. నీ యనుగ్రహమువలన నేను కృతార్థుడ నైతిని. నీ మహిమలను తెలుసుకొంటిని. నాకు గలిగిన దురాగ్రహపు గర్వమును నీవే కలిగించితివి. మరల నీవే నీయమృతవాక్యములచేత నా గర్వమును పోగొట్టితివి. కృష్ణా! సముద్రమువంటి నీ కృపకు నేను యోగ్యుడనైన యెడల నీవిశ్వరూపమును నాకు చూపుమని ప్రార్థించెను.

## కృష్ణుడు ఉదంకునకు తన విశ్వరూపమును జూపుట

కృష్ణుడు ఉదంకునియందు కృపగలవాడై అర్జునునకు చూపిన విశ్వరూపమును ఉందకునకు చూపెను. కృష్ణుని విశ్వరూపమును ఉదంకుడుచూచి సంతోషమును ఆశ్చర్యమును గలవాడై నమస్కరించి యిట్లనెను.

శ్లో॥ విశ్వకర్మనమస్తేస్తు విశ్వాత్మా విశ్వసంభవ
పద్భ్యాంతే పృథివివ్యాప్తా శిరసాచామృతం నభః॥

అని మ్రొక్కుచు కదలక మొద్దువలె నిల్చియుండెను. కొంతసేపు కదలకయుండి పిమ్మట పెద్ద ధ్వనితో యిట్లనెను. కృష్ణా! మూడులోకములును నీపాదపద్మములచేత వ్యాపింపబడియున్నవి. నీదివ్య శిరస్సులచేత ఆకాశమంతయు నిండి పూర్ణముగా వ్యాపించబడియున్నది. నీకడుపులచేత ఆకాశమంతయు కప్పబడియున్నది. నీ యొక్క దివ్యములగు చేతులగుంపులచేత సకలదిక్కులును వ్యాపించబడియున్నది. మహానుభావా! దేవా! నీవు అనేక సహస్ర పాదములచేతను, అనేక సహస్రశిరస్సులచేతను, అనేక సహస్రముల కడుపులచేతను, అనేక సహస్రముల చేతులచేతను, సకలలోకములును వ్యాపించి సర్వము నీవే యగుచున్నావు. ఈవిశ్వరూపమును నేను

చూడగా నాకండ్లు మనస్సు భయమును పొందుచున్నవి. ఓవిశ్వ రూపా! స్వామీ! యీ విశ్వరూపమును విడిచి నీయెప్పటిరూపమగు కృష్ణదేహమును పొందియుండుమని ప్రార్థింపగా పరమేశ్వరుడగు కృష్ణుడు వరమిచ్చెదను కోరుము౽ని ఉదంకునితో చెప్పెను. ఉదంకు డిట్లనెను.

పరమేశ్వరా! కృష్ణా! సకలదుఃఖములను పోగొట్టు నీదివ్య రూపమును చూచితిని. ఇంతకంటె యెక్కువగు వరములు లేవని చెప్పగా కృష్ణు డిట్లనెను. ఉదంకుడా! నన్ను నీవు చూచినందున నీకు శుభముకలుగకమానదు. గనుక నీకు కావలసినవరమును అడిగిన యెడల యిచ్చెదను. అడుగుమని చెప్పగా వుదంకు డిట్లనెను. మహాత్మా! కృష్ణమూర్తీ! నీవు అవశ్యముగా నాకు వరమిచ్చెదనని అనుగ్రహించితివేని యీభూమి చవిటిప్రదేశముగా నున్నది. ఇక్కడ జలము దొరుకుట కష్టమగుచున్నది. గనుక నావద్ద సర్వదా జల ముండునట్లు వరమిమ్ము౽అని వుదంకుడు అడుగగా విశ్వరూపి యగు కృష్ణదేవుడు తన విశ్వరూపమును విడిచి యెప్పటివలె కృష్ణదేహ మును దాల్చి వుదంకునితో యిట్లనెను. ఉదంకమునీంద్రా! నీవు నన్ను తలచినపుడు నీకు జలము లభింపగలదు. అని చెప్పి వుదంకుని యను మతినిబొంది వెళ్ళెను. ఉదంకు డొకానొకదినమందు అడవియందు తిరిగి దప్పిగలవాడై కృష్ణుని తలచుకొనెను. అప్పుడు ఒక మాలవాడు అంబులపొదిని ధరించుకొని బాణములను పట్టుకొని కుక్కలను తోలు కొనుచువచ్చి వుదంకునియెదుట నిలిచియుండెను.

అట్లు కనపడిన మాలవాడు గోచీమొలత్రాడులేక దిగం బరుడై మురికిదేహము గలిగియుండెను. వాని దేహమందు పరిశుద్ధ మైన జలము కారుచుండెను. ఆమాలవానిని వుదంకుడు చూడగా వాడు వుదంకునితో యిట్లనెను. ఉదంకుడా! నీవు దప్పిగలిగి

యున్నట్లు తోచుచున్నావు. నా దేహమున కారుజలమును త్రాగి నీదప్పి పోగొట్టుకొనుము. అని మాలవాడు చెప్పగా వుదంకు డిట్లనెను. ఓరీ! చండాలుడా! యీజలము నాకక్కర లేద నెను. మాల వాడు వుదంకునితో యిట్లనెను. ఉదంకుడా! నీవు దప్పికగలవాడవై శ్రమ జెందియున్నావు. గనుక నీమీద కరుణగలిగి వచ్చినాను. నేనిచ్చెడి జలమును వద్దనక ప్రీతితో త్రాగుటనుంచిది. అని ఆమాల వాడు చెప్పగా వుదంకుడు కోపించుకొని వెళ్ళుమని అదలించెను. మాలవాడు తన కుక్కలతో కూడ కనపడలేదు. ఉదంకుడు భయ పడి కొంతసేపు యోచించి కపటపు మాలవాడు కృష్ణుని ప్రేరేప ణముచేత వచ్చియుండునని ఊహించుచుండెను. ఆ సమయమున కృష్ణుడురాగా వుదంకు డిట్లనెను. మహాత్మా! కృష్ణా! నిన్ను తలచి నపుడు జలము కలుగునని వరమిచ్చితివి. నిన్ను తలచగా ఒక చండాలుడు వచ్చెను. అతని దేహమందు నీరు కారుచుండెను. ఆ నీటిని నేను త్రాగుదునా? నీవు యిచ్చినవరము కుత్సితవర మాయెను గదా! అని వుదంకుడు చెప్పగా కృష్ణు డిట్లనెను.

వుదంక మునీంద్రా! నేను నీవిషయమై చేసిన ప్రయత్నమంతయు వ్యర్థమాయెను. నీకు తెలియదు. చెప్పెదనువినుము. నీనిమిత్తమై నేను దేవేంద్రుని అమృతమునడిగితిని. దేవేంద్రుడు నాతో యిట్లనెను. కృష్ణా! అమృతమును త్రాగినవాడు దేవుడు. ఈ అమృతమును వుదంకున కివ్వరాదు. గనుక మరియొక మేలును కోరిన యెడల అవశ్యముగా వుదంకునకు కలిగించెదను. అని చెప్పగా నేను దేవేంద్రుని ముఖమును జూచి యిట్లంటిని. మహాత్మా! దేవేంద్రా! నిన్ను ప్రార్థించితిని. నాప్రార్థనము వ్యర్థముగా నేరదు. యేవిధముగానైనను ప్రార్థనమును చెరుపక వుదంకమునికి అమృతజలమును యివ్వవలయునని చెప్పితిని. దేవేంద్రుడు నాతో ఒక ఏర్పాటుచేసికొని యిట్లనెను.

కృష్ణా! నేను మాలవాడనై వెళ్ళి అమృతజలములను వుదంకున కిచ్చి సంతోషపెట్టితిని. ఉదంకుడు సిగ్గుచేత నేనిచ్చు అమృతజలములను తీసికొననియెడల నాకు దోషము సంభవింప నేరదు. ఇదిగో! మాలవాడనై ఉదంకునిదగ్గరకు వెళ్ళెదను. ఇందుకు నీవే సాక్షివై యుండవలయును. అని దేవేంద్రుడు నాతో చెప్పి నీదగ్గిరకు మాలవానిరూపముతో వచ్చెను. అట్లు వచ్చిన దేవేంద్రుని నీవు సన్మానింపక అతడిచ్చు జలమును నీవు తీసుకొనక అదల్చితివి. దేవేంద్రు డంతర్థాను డాయెను. అయ్యో! సర్వసిద్ధమైన యమృతము నును వద్దని చెప్పితివి. మీకొరకు నేను చేసిన ప్రయత్నమంతయు వ్యర్థమాయెను. అందుకే యిక నేమనవచ్చును? నేను నీకిచ్చిన వరము అబద్ధము గాకుండునట్లు సమృద్ధిగా జలమును కలిగించెదను, ఆవిధమును చెప్పెదను వినుము. నీవు తలచినపుడు యీ చవిటిభూమి యందు మేఘములు వర్షించుచుండును. మేఘములు నీవశమైయుండి యిచ్చట సంచరించుచు నీకు జలము కావలసినప్పుడెల్ల వర్షించుచుండును. ఇక నన్ను నిందింపకుము నేను వెళ్ళెదను. అని కృష్ణుడు చెప్పగా వుదంకుడు మిక్కిలి సంతోషము కలవాడాయెను. కృష్ణుడు అంతర్థానుడైపోయెను వైశంపాయనుడు జయమేజయునితో ఇట్లనెను.

జనమేజయమహారాజా! కృష్ణుడు వరమిచ్చినది మొదలు వుదంకాశ్రమము చుట్టునుండు చవిటిభూమియందు నియమముగాగలిగి మేఘములు సంచరించుచు ప్రతి పుణ్యతిథియందు తప్పక వర్షము కురియుచుండును. చవిటిభూముల దగ్గరనుండు మేఘములకు వుదంక మేఘములని పేరు. అని వైశంపాయనుడు చెప్పగా జనమేజయ మహారాజు యిట్లనెను. వైశంపాయనమునీంద్రా! కృష్ణుని శపింప దలచియున్న వుదంకముని ఏవిధమగు తపస్సుచేత అట్లు మహానుభావు డాయెనో చెప్పుమని ప్రార్థించగా వైశంపాయనమునీంద్రు డిట్లనెను.

జనమేజయ మహారాజా! వుదంకుడు గురుభక్తి విశేషము వలన మహానుభావు డాయెనని తెలుసుకొనుము. ఆ వుదంకుని చరిత్రమును చెప్పెదను వినుము.

## జనమేజయమహారాజునకు వైశంపాయనుడు వుదంకుని చరిత్రమును చెప్పుట

జనమేజయమహారాజా! వుదంకుడు గౌతమ మహామునికి శిష్యుడై స్నేహముతో బహుకాలము నియమముగలిగి భక్తిపూర్వకముగా శుశ్రూష చేయుచుండెను. బహుకాలము జరిగిన పిమ్మట గౌతమమహాముని తన శిష్యులనందరిని వరములిచ్చి పంపించి వుదంకుని తలపకుండెను. వుదంకుడు మిక్కిలి నిష్ఠగలిగి గౌతమమహామునికి భక్తిపూర్వకముగా శుశ్రూషలు చేయుచుండెను.

అట్లు చాలాకాలము జరిగినపిమ్మట వుదంకు డొకనాడు నడుమునకు గుడ్డబిగగట్టుగొని మిక్కిలి బరువుగల వంటకట్టెల మోపును మోసి తెచ్చెను. అట్లు తెచ్చిన కట్టెలలో తన తలవెంద్రుకలయొక్క ఒక గొప్పజడ తగులుకొని యుండెను. ఆకట్టెలమోపును తొందరగా క్రిందపడ వేయుటలో ఆ మోపుతో తనవెండ్రుకల జడయు తెగి పడెను. వుదంకుడు ముసలివాడగుటచేత అతనిజడ తెల్లగా నెరసి యుండెను. ఆ తెల్లని తలవెంద్రుకల జడ క్రిందపడగా జూచి వుదంకుడు తనకు ముసలితనము వచ్చినదని తెలుసుకొని పెద్దగొంతెత్తి ఏడ్చెను. అట్లు దుఃఖించు వుదంకునియొక్క కన్నీరు దోసిలితో పట్టుకొనుటకై గౌతముడు తన కుమార్తెను పంపించెను. గౌతమముని కూతురు వేగముగావచ్చి వుదంకుని కన్నీటిని తనదోసిలియందునిలుపుకొనెను. ఆ కన్నీటి వేడిచేత దానిచేతులు కాలగా దోసిలియందుండు జలము క్రిందవిడిచెను. జలము భూమిమీద పడినతోడనే

భూమి కదలెను. అప్పుడు గౌతమముని తనశిష్యుడగు వుదంకునిదగ్గర నిలిచి యిట్లనెను.

వుదంకుడా నీవు విచారించుటకు కారణమేమో చెప్పుము. అని ప్రశ్నించగా వుదంకు డిట్లనెను. మహాత్మా! గౌతమమునీంద్రా! తమరు అందరి శిష్యులయందును దయగలిగి వరము లిచ్చితిరి. నేను ఎంతకాల మాశ్రయించి యున్నను నాయందు దయకలుగలేదు. అందుకు నాకు విచారము కలుగదా? అని వుదంకుడు చెప్పగా గౌతమమునికి దయగలిగి వుదంకునిజూచి యిట్లనెను. వుదంకుడా! నీకు యౌవనము నిచ్చెదను. నీకు ముసలితనము పోగలదు. నా కుమార్తెను నీకిచ్చి వివాహము చేసెదను. సంతోషముతో వివాహమును చేసుకొనుము. నీ తేజస్సులు సహించుటకు నాకుమార్తెతప్ప మరియొకరు శక్తులుగారు. గురువుయొక్క కుమార్తెను వివాహము చేసికొనరాదని నీవు సందేహింపవద్దు. నాకుమార్తెకు నాతపోబలమువలన మరియొక విధమైన దేహకాంతిని కలిగించెదను. అట్లు కలిగించుటచేత మరియొకజన్మ మెత్తినట్లు కాగలదు. గనుక నీవు గురుని కుమార్తె యను అనుమానమును విడిచి నాకుమార్తెను వరియింపుము. నీవును యౌవనవంతుడవుకమ్ము. ఈ నా కుమార్తెను నీవు వివాహము చేసుకొనుటవలన ధర్మమగునేగాని అధర్మము కానేరదు. అట్లు నీకు వరమిచ్చితిని. అని యిట్లు గౌతమమహాముని అనుగ్రహించి తన కుమార్తెకు మరియొక దేహమును కలిగించెను. వుదంకుడు సంతోషించి ముసలితనముచు విడిచి మంచి యౌవనదశ కలిగియుండెను. వుదంకుడు గౌతమముని యాజ్ఞాప్రకారము గౌతముని కుమార్తెను పరమ సంతోషముగా వివాహము చేసికొనెను.

పిమ్మట వుదంకుడు గౌతమునీంద్రునకు యిట్లనెను, మహాత్మా! గౌతమమునీంద్రా! నీ దగ్గర నేను బహుకాలమునుంచి విద్య నభ్య

సించి యున్నాను. అందుకు నేను గురుదక్షిణ సమర్పింపవలయును. అందునిమిత్తమై నావలన యేదైనను ఒక పనిని. చేయించుకొనుము. మీరు ఏపదార్థమైనను తెమ్మని నన్ను పంపినయెడల ఆపదార్థమును నేను మీకృపవలన తీసికొని రాగలను. అంతటిశక్తి మీకృపవల ననే నాకు కలుగును. అని వుదంకుడు విన్నవించగా గౌతముడిట్లనెను. వుదంకుడా! నీనడవడికకు నేను సంతోషించితిని. నీనడవడికయే నాకు దక్షిణయగును. మరియొక దక్షిణను అపేక్షింపను. గనుక నీవు వెళ్ళి సుఖంపుము అని చెప్పగా గౌతముని భార్యయగు అహల్యాదేవి దగ్గరకువెళ్ళి నమస్కరించి యిట్లనెను.

తల్లీ! అహల్యాదేవీ! మీరు అనుజ్ఞ నిచ్చినయెడల మీకు కావలసిన పదార్థమేదియైనను అవశ్యముగా సాధించితెచ్చి యిచ్చె దను. గనుక మీరు కావలసిన పదార్థమును సెలవిమ్మని ప్రార్థిం పగా అహల్యాదేవి యిట్లనెను. వుదంకుడా! నీవు పరాయివాడవు కావు. నా భర్తయగు గౌతమమునీంద్రుడు చెప్పిన ప్రకారము వెళ్ళుము నాకేపదార్థమును అక్కరలేదు. నీవు వెళ్ళి సుఖముగా నుండుము. అని చెప్పగా వుదంకుడు మరల యిట్లనెను.

తల్లీ! అహల్యాదేవీ! మీరట్లు చెప్పవద్దు. యేపదార్థమై నను మీరు కోరవలయును. మీరు కోరిన పదార్థమును నేను తెచ్చి మీకు సమర్పింపవలయును. గనుక సెలవిమ్మని అనేకవిధములుగా ప్రార్థించి యడిగెను. వుదంకునితో. అహల్యాదేవి యిట్లనెను. తమ్ముడా! వుదంకుడా! నీవు ముఖ్యముగా యేదైనను నాకు తెచ్చి యివ్వదలచిన యెడల నాకుకావలసిన పదార్థమునుచెప్పెదను వినుము. సౌదాసుడనురాజు కలడు. ఆ రాజు భార్యదగ్గిర కుండలములు చెవులకు కలవు. ఆకుండలములయందు నేను ప్రేమ గలిగి యుంటిని. అని చెప్పగా వుదంకుడు సంతోషించి కుండలములను తెచ్చుటకు వెళ్ళెను. ఒక దినమందు గౌతముడు అహల్యతో యిట్లనెను.

దేవీ అహల్యా! వుదంకుడు కనబడలేదు. ఎక్కడున్నాడని యడుగగా అహల్య యిట్లనెను. ప్రాణనాథా! గౌతమమునీంద్రా! సౌదాసరాజుయొక్క భార్యవద్దగల కుండలములను తెచ్చి నాకిచ్చుట్కై వెళ్ళెను అని చెప్పెను. ఆ మాటను గౌతముడు విని కృపగలవాడై అహల్యముఖముజూచి యిట్లనెను. దేవీ! అహల్యా! సౌదాసరాజు బ్రాహ్మణశాపమువలన రాక్షస స్వభావము కలవాడై మనుష్యమాంసమును భక్షించుచుండును. ఈ వృత్తాంతమును వుదంకు డెరుగక వానిదగ్గరకు వెళ్లెను. అయ్యో! వుదంకునకు ఏమి అపాయముకలుగునో తెలియదు. అని వుదంకుని యందుగల కృపచేత గౌతముడు చెప్పగా అహల్య భయపడి యిట్లనెను. మహాత్మా! గౌతమ మునీంద్రా! సౌదాసరాజు మనుష్య మాంసమును భక్షించుననినాకు తెలియదు. నీవు నాయందుగల కృపచేత వుదంకునకు ఏవిధమైన కీడును కలుగకుండునట్లుచేసి రక్షింపుమని ప్రార్థించగా గౌతముడు యిట్లనెను. దేవీ! అహల్యా! నీవు భయపడకుము. ఉదంకునకు కీడుకలుగనివ్వనని చెప్పగా అహల్య వూరకుండెను. ఇక్కడ సమాచారమిట్లుండెను. ఇక వుదంకుని సమాచారము చెప్పెదవినుము. వుదంకుడు వెళ్ళి ఒక అడవియందు భయంకరరూపము గలిగి యుండెడి సౌదాసరాజును చూచెను. సౌదాసుడు తన దేహమందు మనుష్యుల రక్తమును పూసికొని పెద్ద మీసములు గలిగి కంటి గ్రుడ్లు త్రిప్పుచు భయమును కలిగించుచుండెను. సౌదాసుని దగ్గరకు వుదంకుడు వెళ్ళగా సౌదాసుడు యిట్లనెను

బ్రాహ్మణుడా! నేను ఆకలిచేత బాధపడుచు యేపదార్థము దొరకునో యని కాచుకొనియున్నాను. నీవు వచ్చితివి. నిన్ను భక్షించి నా ఆకలిని పోగొట్టెదను. అనిసౌదాసుడు చెప్పగా వుదంకుడిట్లనెను. సౌదాస మహారాజా! నేను నా గురువుయొక్క కార్యము

నిమిత్తమై యిక్కడికి వచ్చినాను. గురుని కార్యముకొరకు వచ్చిన వారిని చంపరాదు. యోచింపక చెప్పినమాట అధర్మము. అని వుదంకుడు చెప్పగా సౌదాసు డిట్లనెను. బ్రాహ్మణుడా! పగటియందు మూడవజాములో ఏ పదార్థము దొరికినను దానిని భక్షించునట్లు నాకు దేవతలు యేర్పరచి యున్నారు. గనుక అవశ్యముగా యిపుడునిన్ను భక్షించి నా ఆకలి పోగొట్టుకొనెదను. అని సౌదాసుడు చెప్పగా వుదంకుడిట్లనెను. సౌదాసమహారాజా! నీవు నన్ను భక్షించెడి పక్షమందు నాలుగుకార్యములనుచేసి అవశ్యముగా నీ దగ్గరకు వచ్చెదను. నామాట అబద్ధముకాదు. నీవు యాచకులు గోరిన పదార్థములను ప్రీతితో యిచ్చెదవని నీదగ్గరకు వచ్చియున్నాను. నేను దానముతీసు కొనుటకు మంచి పాత్రమగుదును. నాగురువుయొక్క కార్యమును నీవలన అనుకూలముచేసికొనదలచి నిన్ను నమ్మివచ్చినాను. అని వుదంకుడు చెప్పగా ఆమాటలకు సౌదాసుడు సంతోషించి సమ్మతించి నీవు యేపదార్థమును కోరెదవో చెప్పుమని వుదంకుని యడిగెను. అప్పుడు వుదంకుడిట్లనెను. సౌదాసమహారాజా! నీభార్య చెవులయందు ధరించియుండెడి కుండలములకొరకై వచ్చియున్నాను. గనుక కుండల ములను నాకు యిమ్మని అడుగగా సౌదాసుడు యిట్లనెను. బ్రాహ్మ ణుడా! యితరుల ధనమును యివ్వరాదు. గనుక కుండలములను అడుగక మరియేదియైనను అడుగుమని చెప్పగా వుదంకుడిట్లనెను. సౌదాసమహారాజా! నీవు నెపముచేత కుండలవులను ఇవ్వకుండవలయు నని తలచితివి. నాకు కుండలములుతప్ప మరియొక పదార్థమక్కర లేదు. గనుక కుండలములే కావలయునని చెప్పగా అట్లు కుండలములు యిచ్చుటకు సమ్మతించి సౌదాసు డిట్లనెను. వుదంకుడా! నా భార్య యగు మదయంతి ఫలాన స్థలమందున్నది. నీవు అక్కడికి వెళ్ళి నేను పంపించినట్లుచెప్పి నీకోరికను తెలుపుమని చెప్పగా వుదంకు డిట్లనెను.

సౌదాసమహారాజా ! నీ భార్య వుండెడి స్థలమును నాకు స్పష్టముగా తెలుపుమని ప్రశ్నించగా సౌదాసు డిట్లనెను. వుదంకుడా ! నాభార్య వుండెడి ప్రదేశము అల్లదిగో చూడుమని చూపించెను. వుదంకుడు సౌదాసుని భార్యయగు మదయంతి దగ్గరకు బోయి యిట్లనెను. మదయంతీ ! నీ భర్త యగు సౌదాసమహారాజు పంపించినందున యిక్కడికి వచ్చినాను. నీ చెవులయందుండెడి కుండలములు నాకు కావలయును. నీవు కుండలములను యిచ్చిన యెడల ఆ కుండలములను నాగురువునకు సమర్పించి నేను కృతార్థుడ నగుదును. గనుక కుండలములు యిమ్మని ప్రార్థించగా మదయంతి యిట్లనెను.

బ్రాహ్మణుడా ! నా భర్త యగు సౌదాస మహారాజుదగ్గిర నుంచి గురుతు తెచ్చిన యెడల నీకు కుండలములను యిచ్చెదను. గనుక గురుతును తెమ్మని చెప్పగా వుదంకుడు సౌదాసునిదగ్గరకు వచ్చి యిట్లనెను. సౌదాసమహారాజా ! నీ భార్య నీదగ్గరనుంచి గురుతు తెచ్చిన యెడల కుండలములను యిచ్చెదనని చెప్పినది. గనుక యేదైనను గురుతు యిమ్మని అడుగగా సౌదాసు డిట్లనెను. ఉదంకుడా ! యీ మార్గము క్షేమమని నిశ్చయింపరాదనియు, యీ మార్గముతప్ప మరియొకమార్గము లేదనియు నా భార్యతో చెప్పుము. ఇది నే నిచ్చినగురుతు. నేను చెప్పినట్లే చెప్పవలయును. అని సౌదాసుడు గురుతుమాట చెప్పగా వుదంకుడు సంతోషించి మదయంతిదగ్గరకు బోయి యిట్లనెను. మదయంతీ ! నీభర్త యిచ్చిన గురుతును తెలిపెద వినుము. ఈ మార్గము క్షేమమని నిశ్చయింపరాదనియు, ఈమార్గము తప్ప మరియొకమార్గము లేదనియు, నీతో చెప్పుమని గురుతును తెలిపెడి వాక్యమును చెప్పినాడు. ఈ మాటయే గురుతుయగును. గనుక కుండలములను యిమ్మనియడుగగా అపుడు మదయంతి యిట్లనెను. ఉదంకుడా ? నా భర్తయొక్క ఆజ్ఞవలన నీకు కుండలములను

యిచ్చెదను. నీవు సంతోషముగా యీకుండలములను తీసుకొని వెళ్ళి నీగురువునకు సమర్పించి కృతార్థుడవుగమ్ము. ఈ కుండలములను అపహరించుటకొరకు దేవతలును, గంధర్వులును, సర్పములును అనేక ఉపాయములచేత కాచుకొనియుండెదరు. నీవు తెలివితప్పియున్నను, యేమరియుండి నిద్రించినను, భూమిమీద పెట్టినను, యీ కుండలములను దేవతలు మొదలగువారు అపహరించుకొని వెళ్లుదురు. ఈ కుండలముల మాహాత్మ్యమును చెప్పెదవినుము. ఈ కుండలములను భక్తిచేత పూజించి చెవులయందు ధరించినయెడల ఆకలి కలుగదు. దప్పివుండదు. అగ్నివలనను, విషమువలనను, భూతభేతాళ పిశాచాదులవలనను బాధలు కలుగజాలవు. పెద్దవారైనను, బాలురైనను యీ కుండలములను ధరించినయెడల ముందుచెప్పిన సకల బాధలును కలుగజాలవు. ఈ కుండలములు బంగారును పుట్టించుచుండును. గనుక నీవు యీ కుండలములను అధికజాగ్రత్తతో తీసుకొని నీ గురువులకు సమర్పించుకొనుము. బహుజాగ్రత్తగా వెళ్ళవలయును.

## ఉదంకుడు మదయంతివలన కుండలములు పుచ్చుకొనుట

అని పతివ్రతయగు మదయంతి చెప్పి భక్తి, ప్రీతి, వినయగుణములు గలదగుచు తన చెవులయందుండెడి కుండలములను తీసి వుదంకునకు సమర్పించెను. ఉదంకుడు కుండలములను తీసికొని పరమ సంతోషముగలవాడై పతివ్రతయగు మదయంతిని దీవించి పోయి వచ్చెదనని చెప్పి సౌదాసరాజుదగ్గరకు వచ్చి నవ్వుచు దీవించి యిట్లనెను. సౌదాసమహారాజా! నీ భార్యయగు మదయంతి నాకు కుండలములను యిచ్చినది. నీవలన నేను కృతార్థుడనైతిని. నీవు నీభార్యకు చెప్పుమనుచు నాతో జెప్పిన గుర్తువాక్యము అధికరహస్య

ము:గా నున్నది. ఆవాక్యమునకు గల యభిప్రాయము నాకు తెలియ లేదు. ఆ యభిప్రాయమును నేను వినదగియుంటిని. గనుక చెప్పుమని యడుగగా సౌదాసు డిట్లనెను. మహాత్మా! ఉదంకుడా! రాజులగు వారు బ్రాహ్మణులను పూజించుచుందురు. గనుక నేను యిదివరకు బ్రాహ్మణులను పూజించుచుంటిని. ఒకనాడు కొంచెము తప్పిదమును చేసితిని. ఆ తప్పిదమునకు బ్రాహ్మణుడు కోపించుకొని నాకు రాక్షస భావము కలుగునట్లు శపించెను. రాక్షసభావమును మరియొక మార్గముచేత పోగొట్టుకొనుటకు సాధ్యముగాదు. బ్రాహ్మణపూజ లనుచేసి అట్టిపూజలవలన బ్రాహ్మణులను మెప్పించుట కష్టమగును. ఈ హేతువువలన యీ యభిప్రాయమునే నా భార్యకు ఆనవాలుగా యీమార్గము క్షేమమని నిశ్చయింపరాదనియు, యీ మార్గముతప్ప మరియొకమార్గము లేదనియు నీతో చెప్పి పంపించితిని. నాభార్యదగ్గిర యుండెడి శ్రేష్ఠరత్నమయములైన కుండలములను నీకు యిచ్చి నీ వలన నారాక్షసస్వభావమును పోగొట్టుకొనదలచితిని. అని సౌదాస మహారాజు చెప్పెను. జనమేజయమహారాజా! భృగువంశమందు బుట్టిన మహాత్ముడగు వుదంకునియొక్క పుణ్యదర్శనముచేత సౌదాస మహారాజునకు సమాధానమనస్సు కలిగినందున కుండలముల నిచ్చు టకు శ్రద్ధయు, శాంతపుమాటలును కలిగెనని తెలిసికొనుము. అని సౌదాసుడు వుదంకునితో చెప్పగా వుదంకు డిట్లనెను.

సౌదాసమహారాజా! మాటలాడిన మాత్రముచేత స్నేహము కలుగునని పెద్దలు చెప్పుదురు. నేను నీ వలన కృతార్థుడనై వెళ్ళు చున్నాను. నా దేహమును నీకు ఆహారముగా నిచ్చుటకు మరల వచ్చెదనని యిదివరకు చెప్పియుంటిని. చెప్పినమాటను తప్పను. ఈ కుండలములను నా గురునికిచ్చి మరల నీ దగ్గరకు వచ్చెదను. అని వుదంకుడు చెప్పగా సౌదాసుడు కృపగలిగిన చిత్తముగలవాడై వుదం

కుని జూచి యిట్లనెను. మహాత్మా! వుదంకమునీంద్రా! నావంటి చంపెడివాని దగ్గరకు మరల రావచ్చునా? నీయందుగల ఉదార సత్యగుణములు నాకు తెలిసినవి. నీ గుణములకు నేను సంతోషించి తిని. నాకు గల రాక్షస స్వభావమును నీ తపోమాహాత్మ్యతవలన పోగొట్టుమని ప్రార్థించగా వుదంకుడు సంతోషకరుణ గలవాడై యిట్లనెను. సౌదాసమహారాజా! పెద్దలు అనుగ్రహము యేవిధ ముగా నైనను కలిగినయెడల ఎటువంటి పాపములైనను నశింప గలవు. నీయొక్క మంచిగుణము నీయందుగల రాక్షసభావమును పోగొట్టి నీకు మంచికీర్తిని కలిగించెను. నా గురువగు గౌతమ మహామునియొక్క చల్లనిచూపు నీయందుగలిగి యుండవచ్చును. గౌతమముని కృపవలన శాంతచిత్తుడవై అభివృద్ధిని పొందుము. అని వుదంకుడు చెప్పి సౌదాసునకు గొప్ప గొప్ప దీవనలిచ్చి తన చేతులతో సౌదాసుని దేహమును తడివి అతనికి సంతోషము కలిగించెను. సౌదాసమహారాజు తన పాపమును పోగొట్టుకొనినవాడై శాంత చిత్తముతో భక్తివినయ పూర్వకముగా వుదంకమునికి సాగిలపడి నమస్కరించెను. అట్లు నమస్కరించి వుదంకుని స్తుతించి పంపించెను. మహాత్ముడగు వుదంకుడు కుండలములను కృష్ణాజినమందు భద్ర ముగా పెట్టుకొని కృష్ణాజినమునుచుట్టి చంకయందు తగిలించుకొని గౌతమముని యాశ్రమమునకు శీఘ్రముగా వెళ్ళుచుండెను. అట్లు వెళ్ళి బహుదూరమునడిచి యొకచోట ఒక మారేడు చెట్టును చూచెను. మారేడు చెట్టుయందు పరిపక్వములైన పండ్లుకనబడెను. వుదంకుడు ఆ పండ్లచేత తన ఆకలిని పోగొట్టుకొనదలచి కుండల సహితముగా నుండెడి తన కృష్ణాజినమును మారేడు చెట్టుకు తగి లించి తాను మారేడు చెట్టునెక్కి పండ్లుగోయుచుండెను. గాలిచేత మారేడుచెట్టు కదలుచుండగా చెట్టుకుతగిలించిన కృష్ణాజినము క్రింది

భూమిమీాద పడెను. ఆ పడిన కృష్ణాజినమును అక్కడొక నాగ సర్పము జూచి శీఘ్రముగా వచ్చి కృష్ణాజినమందుండెడి కుండలము లను తీసికొని నోటకరచుకొని శీఘ్రముగా పోవుచుండెను. ఆ పోయెడి సర్పమును వుదంకుడు చూచి శీఘ్రముగా చెట్టుమీాదనుంచి క్రిందికి దూకి సర్పము వెనుకనే పరుగెత్తెను. సర్పము సమీాపమం దుండెడి నొక పుట్టకన్నములోనికి శీఘ్రముగా ప్రవేశించెను వుదం కుడు యొక సన్నటి కొనగల మంచికఱ్ఱను తెచ్చి కఱ్ఱతోటి పుట్టను త్రవ్వుచుండెను త్రవ్వునపుడు భూమి గడ గడ వణకసాగెను. దేవేంద్రుడు బ్రాహ్మణరూపముతో వచ్చి వుదంకునితో యిట్లనెను. బ్రాహ్మణుడా! నీ కుండలములను యెత్తుకొని పోయిన సర్పము ఐరా వత మనెడి దేవసర్పముయొక్క కొడుకగును. సర్పము పాతాళ లోకమునకు పోయెను. ఇక్కడికి పాతాళలోకము వేయియోజనముల దూరమున నుండును. కఱ్ఱతో నీవు త్రవ్వినయెడల నీవు పాతాళ లోకమునకు వెళ్ళజాలవు. అని బ్రాహ్మణరూపివలె నుండెడి దేవేం ద్రుడు చెప్పగా ఆ మాటలను వుదంకుడు విని యిట్లనెను.

బ్రాహ్మణుడా! నా కుండలములు పాతాళలోకమందున్నను నేను శీఘ్రముగా తెచ్చెదను. అట్లు కుండలములను తీసుకొని రాజా లక పోతినేని ప్రాణములను విడిచెదను. ఇది సత్యమగును. అని వుదంకుడు చెప్పగా అతనియొక్క దృఢస్వభావమును దేవేంద్రుడు తెలుసుకొని వుదంకుని కఱ్ఱకు వజ్రాయుధముతో సమానమైన పమ నును బలశక్తిని కలిగించి. నేను దేవేంద్రుడనని చెప్పి వెళ్లెను. అపుడు భూదేవి భయపడి వుదంకునకు పాతాళలోకమార్గమునిచ్చెను. వుదంకుడు శీఘ్రముగా పాతాళలోకమునకు వెళ్ళెను. పాతాళలోకము అనేక ప్రకారములచేత రక్షింపబడుచు అనేకవిధరత్నరాసులచేత దేదీప్యమానముగా ప్రకాశించుచుండెను. పాతాళ లోకముయొక్క

ముఖద్వారము పదియోజనములు పొడుగుగలిగి, అయిదు యోజనములు వెడల్పుగలిగి యుండెను. అట్టి పాతాళలోకమును దాని ముఖద్వారమును వుదంకుడు చూచి భయపడి కుండలములు లభింపవనెడి తలంపుచేత ధైర్యమును విడిచెను. ఆ సమయమందు ఒక గుఱ్ఱము కనబడెను గుఱ్ఱమునకు మూతిమాత్రము యెఱ్ఱగాను, తోక మొదలగు దేహమంతయు తెల్లగానుండెను. అట్టిగుఱ్ఱము వుదంకునకు కనబడి యిట్లనెను. మహాత్మా! ఉదంకమునీంద్రా! కుండలముల విషయమై నీవు భయపడవద్దు నీ కుండలములు నీకు చేరగలవు. మహాత్ముడగు గౌతమమునియొక్క ఆశ్రమమందు నీవుమంచిభక్తితో నన్ను సేవించియున్నావు. నా యందు నీకు గల భక్తికి సంతోషించి వచ్చినాను. ఐరావతమనెడి దేవసర్పము కొడుకు నీకుండలములను అపహరించెను. నాచెవి రంధ్రమును నీవు మూసినయెడల నీ కుండలములు నీకు మరల లభింపగలవు. గనుక ఈ ప్రకారము చేయుము. అని గుఱ్ఱము చెప్పగా వుదంకుడిట్లనెను. గుఱ్ఱమా! నిన్ను నేనెరుగను. నిన్ను నేనెట్లు ఉపాసించియున్నానో తెలియదు. ఆ వృత్తాంతమును తెలుపుమని యడుగగా గుఱ్ఱము యిట్లనెను. మహాత్మా! ఉదంక మునీంద్రా! నేను అగ్నిహోత్రుడను. నీ గురువగు గౌతమునికి నేను గురుడనగుదును. నీవు పరిశుద్ధుడవై భక్తిపూర్వకముగా ప్రతినిత్యము నన్ను పూజించితివి. పూజించిన విధమును నీవు యెరుగుదువుగదా! అని గుఱ్ఱము చెప్పగా ఆ మాటలను వుదంకుడు విని సంతోషించి గుఱ్ఱముచెప్పిన ప్రకారము గుఱ్ఱముయొక్క వెంట్రుకల యందు మిక్కిలి గొప్ప పొగ లేచి అంతటను వ్యాపించు పాతాళలోకములను దట్టముగా కప్పెను. ఆ పొగచేత వాసుకి మొదలగు దేవసర్పముల యొక్క నివాస భూములన్నియు నిండింపబడెను. ఐరావత సర్పము యొక్క నివాసభూమియందు హాహా యనెడి ధ్వనిపుట్టెను, గొప్ప

పొగచేత పాతాళలోకమంతయు నిండి సర్పములకు ప్రాణాదివాయు సంచారము తప్పెను. అపుడు ఐరావత వాసుకి మొదలగు సర్పరాజు లందరును భయపడి శీఘ్రముగా ఉదంకుని దగ్గరకువచ్చి పూజించిరి. అంతట సర్పరాజు లందరును ఉదంకుడు వచ్చిన కార్యమును అడిగి తెలిసికొని నమస్కరించి భక్తిపూర్వకముగా కుండలములను వుదంకు నకు యిచ్చిరి.

## ఉదంకుడు కుండలములిచ్చి యహల్యను సంతోషపరచుట

జనమేజయమహారాజా ! వుదంకుడు వాసుకి, ఐరావతుడు మొదలగు సర్పరాజులను పంపించి కుండలములను తీసికొని అగ్ని దేవుని చుట్టుతిరిగి భక్తిపూర్వకముగా నమస్కరించెను. ఉదంకు డతి శీఘ్రముగా గౌతమమహాముని ఆశ్రమమునకు వచ్చి కుండలములను అహల్యాదేవికియిచ్చి సాగిలపడి నమస్కరించెను. అపుడు గౌతముడు అహల్యయు అధిక ప్రేమతో ఉదంకుని ఆదరించి కౌగలించుకొని దీవించిరి. అపుడు వుదంకుడు అనేకపర్యాయములు దంపతులకు నమ స్కరించి నిలిచి యిట్లనెను. మహాత్మా! మీాయిద్దరి కృపవలన నేను సౌదాసుని దగ్గర కుండలములను తీసికొని వచ్చుచుండగా మార్గ మందు ఒక సర్పము కుండలములను అపహరించెను. కుండలములు మరల నాకు లభింపవని తలచితిని. ఆకుండలములు మీా కృపవలన మరలనాకు లభించినవేగాని నావలన లభించలేదు. అని వుదంకుడు చెప్పగా గౌతమ అహల్యలిద్దరును పరమ సంతోషమును పొందిరి. అపుడు గౌతమమహాముని వుదంకునితో యిట్లనెను. వుదంకుడా ! నీ నడవడిక అధికమగు ఆశ్చర్యమును కలిగించుచున్నది. సౌదాసుని రాక్షసస్వభావమును పోగొట్టి వానివలన రెండుకుండలములను తెచ్చి తివి. నీయందుగల సామర్థ్య బలదృఢ నిశ్చయములు మరిరొకళ్ళ నీ

యందు కనబడలేదు. ఈ చెప్పినమాట నిశ్చయమేగాని; నిన్ను పొగ డుటకాదు. అని గౌతముడు చెప్పెను. జనమేజయమహారాజా! యీ ప్రకారము వుదంకుడు తనమహాతపశ్శక్తివలన పరాక్రమించి యితరు లకు సాధ్యముగాని కుండలములనుదెచ్చి గురుజనులకు సంతోషమును కలిగించెను, భృగువంశమందు బుట్టిన వుదంకునియొక్క మహాను భావత్వము యీప్రకారముగా నున్నది. ఇటువంటి పుణ్యాత్ముడగుట వలననే పరమేశ్వరుడగు కృష్ణదేవుని విశ్వరూపము జూచుటకు యోగ్యుడయ్యెనని తెలుసుకోనుము. అని వైశంపాయనుడు జనమే జయునితో చెప్పగా జనమేజయుడు యిట్లనెను. మహాత్మా! వైశం పాయన మునీంద్రా! వుదంకునకు కృష్ణుడు వరమిచ్చి వెళ్ళినపిమ్మట కృష్ణుడు యెట్లుప్రవర్తించెనో, చెప్పుమని ప్రశ్నించగా వైశంపాయ నుడు యిట్లనెను. జనమేజయ మహారాజా! ముందుచెప్పిన ప్రకారము కృష్ణుడు ఉదంకమహామునికి వరమిచ్చి జలసమృద్ధి గలుగునట్లుచేసి తన పట్టణమగు ద్వారకకు వెళ్లెను. కృష్ణుడు వచ్చునని తెలిసిముం దుగానే పట్టణము అలంకరింపబడి యుండెను. ద్వారకయందుండెడి యాదవు లందరును రైవతకపర్వతయాత్రా విషయమహోత్సవమును కొనియాడుకొనుచుందురు. ఆసమయమందు కృష్ణుడు వెళ్ళగా యాదవులందరును పరమానందమును బొందిరి. కృష్ణుడు వెళ్లినందున మహోత్సవము రెట్టింపుగా జరిగెను. అట్లు కృష్ణుడు ద్వారకకువెళ్ళి వసుదేవుని, దేవకీదేవిని బలరాముడు మొదలగు యాదవవృద్ధులను చూచి నమస్కారము ఆలింగనము మొదలగు మర్యాదలను జరిపి అందరి మనస్సులను సంతోషపెట్టెను. అపుడు కృష్ణుడు వసుదేవాదు లందరికిని ధర్మరాజు చెప్పిన నమస్కార ఆలింగనాది ఉపచారవిష యపు మాటలన్నియు చెప్పెను. కృష్ణుడు తనతమ్ములు కొడుకులు మంత్రులు, భృత్యులు మొదలగువారు తనను చూడవచ్చినపుడు

ప్రీతిచేతను, కృపచేతను, గౌరవ బహుమానముల చేతను వారికితగి నట్లు ఆదరణము చేసెను. సాత్యకి సుభద్రములను తగినప్రకారముతగిన వారలను చూచిరి. కృష్ణుడు యాదవులందరికిని పరమానందము కలుగజేసెను. వసుదేవుడు కృష్ణుని తనసమీపమందు కూర్చుండ బెట్టుకొని యిట్లనెను. పుత్రుడా! కృష్ణా! వచ్చిపోవుచుండు జనుల వలన భారతయుద్ధ విధానమును వినియున్నాను. నీవు వివరముగా మరల చెప్పుమని ప్రశ్నించగా వసుదేవునితో కృష్ణుడు యిట్లనెను.

తండ్రీ! వసుదేవా! భారతయుద్ధ విధానము వివరించి చెప్పుట కనేక దినములు పట్టును. సులభముగా తెలియునట్లు ముఖ్యమగు అభిప్రాయమును చెప్పెదను వినుము. వసుదేవా! కౌరవుల సైన్యము పదునొకం డక్షౌహిణులు కలదు. మొట్టమొదట ఆ సైన్యమునకు భీష్ముడు అభిషేకమునంది సేనాధిపతిగానుండెను. పాండవుల వైపు ఏడక్షౌహిణుల సైన్యముండెను. ఆ సైన్యమును పాండవులు నడిపించుకొని భీష్మునితో యుద్ధముచేసిరి. ఆ యిరువైపుల సైన్యములును యుద్ధముచేసిన ప్రజ్ఞావిశేషమును దేవతలు ఆకాశమునుండి చూచుచు ఆశ్చర్యమును పొందిరి. భీష్ముడు పదిదినము లతిభయంకరముగా యుద్ధము చేసెను. అర్జును డంతట శిఖండిని సహాయముగా నుంచుకొని పదియవదినమందు భీష్ముని పడగొట్టెను, భీష్ముడు ఉత్తరాయణము వచ్చువరకు ప్రాణములను విడువక బాణముల పాన్పుమీద పండుకొని యుండెను. భీష్ముడట్లు పడినపిమ్మట కౌరవసైన్యములకు ద్రోణాచార్యుడు సైన్యాధిపతియై ఐదుదినములు అత్యంత భయంకరముగా యుద్ధముచేసెను. ధృష్టద్యుమ్నుడు అర్జునుని సహాయముతో ద్రోణాచార్యుని చంపెను. కౌరవసైన్యమునకు కర్ణుడు సేనాధిపతియై ఘోరాకారముగా రెండుదినములు యుద్ధము చేసి అర్జునుని బాణాగ్ని

చేత చచ్చిపోయెను. మరునాడు శల్యుడు సేనాధిపత్యము వహించి మధ్యాహ్నమువరకు యుద్ధముచేసెను. ధర్మరాజుచేత శల్యుడు చచ్చెను. అంతట శకుని సైన్యములను తీసికొని యుద్ధమునకువచ్చి సహదేవునిచేత చచ్చి క్రిందపడెను. దుర్యోధనుడు అభిమానములేనివాడై మిగిలిన సైన్యమును విడిచి గదతీసుకొని పాదములతో నడచివచ్చి ఒక తటాకమున దాగియుండెను. ఆతటాకమందుండెడి నీటిని మంత్రముచేత రాతిమయముచేసి అందు దుర్యోధనుడు దాగియుండగా పాండవులు తెలుసుకొని పోయి దుర్యోధనునకు రోషముగలుగునట్లు దూషించిరి. దుర్యోధనుడు బయటకువచ్చి భీమునితో గదాయుద్ధము చేసెను. భీముడు గదచేత దుర్యోధనుని తొడవిరుగగొట్టి చంపెను. దుర్యోధనుని తమ్ములందరును అదివరకే భీమునిచేత చచ్చిరి. ఇట్లు పాండవులు జయమును పొందిరి. దుర్యోధనుడు భీమునిచేత పడినదినమందు అశ్వత్థామ రాత్రికాలమందు పాండవులు సైన్యములు నిద్రించునపుడు సకలజనులను, గుఱ్ఱములను, ఏనుగులను నరికివేసెను. అశ్వత్థామ చేసిన యీపాపకార్యము ఏమనిచెప్పవచ్చును ? రాత్రికాలమందు పాండవులును నేనును అక్కడలేనందున యింత చేటుకలిగినది. ఇట్లు పదునెనిమిది దినములు యుద్ధము జరిగెను. మాతట్టు పాండవులైదుగురును, నేనును సాత్యకియుతప్ప తక్కిన ఏడక్షౌహిణుల సైన్యము చచ్చెను. కౌరవుల సైన్యమందు అశ్వత్థామ. కృపాచార్యుడు, కృతవర్మ వీరుముగ్గురుతప్ప తక్కిన పదునొకండక్షౌహిణుల సైన్యము చచ్చెను. యుయుత్సుమాత్రము మొదటనే పాండవులను ఆశ్రయించినందున ప్రాణములను కాపాడుకొనెను.

తండ్రీ! వసుదేవా! భారతయుద్ధపుపద్ధతి యీ ప్రకారము జరిగెను. అని చెప్పెను. జనమేజయమహారాజా! కృష్ణుడు వసుదేవు

నకు యీరీతిగా భారత యుద్ధక్రమమును చెప్పెనుగాని తన మేనల్లుడైన అభిమన్యుని మరణమును చెప్పలేదు. అభిమన్యుడు చచ్చెనని చెప్పినయెడల వసుదేవునకు విచారము కలుగుననియు, చెప్పుటకు తనకు నోరురాక చెప్పలేదనియు ఎరుగవలెను. కృష్ణుడు భారతయుద్ధమందు చచ్చినవారినందరిని చెప్పి తనకొడుకగు అభిమన్యుని వృత్తాంతము చెప్పలేదని తలచి సుభద్రాదేవి యిట్లనెను. అన్నా! కృష్ణా! నీమేనల్లుడగు అభిమన్యుడు చచ్చెనని చెవులార నీతండ్రికి వినిపింపుము. అని సుభద్రాదేవి గద్గదస్వరముతో వసుదేవుడు వినునట్లుగా కృష్ణునితో చెప్పి మిక్కిలి దుఃఖావేశముగలదై బొటబొట కన్నీరు కార్చుచు భూమిమీద పడెను. వసుదేవాది సకలయాదవులును అభిమన్యుని విషయమై మరల మిక్కిలి దుఃఖమునుపొందిరి. కృష్ణుడు వసుదేవాదులందరిని ఊరార్చి యిట్లనెను. యాదవులారా! అభిమన్యుడు చచ్చినపుడు హస్తినాపురమున సుభద్రయు, ఉత్తరయు మిక్కిలి ఎక్కువగా విచారించిరి. వారికి అనేకవిధములగు మాటలను చెప్పి కుంతీదేవి దుఃఖమును పోగొట్టెనది. అభిమన్యునకు పరలోకసౌఖ్యము కలుగుటకొరకు పాండవులైదుగురును వేరువేరుగా మణులను, బంగారములను, గోవులు మొదలగు అనేకపదార్థములను దానములిచ్చిరి. అభిమన్యుని పేరుపెట్టి అనేకములగు చెరువులు, బావులు మొదలగు ధర్మకార్యములు చేసిరి. అభిమన్యుడు యుద్ధమందు వెనుకాడక రౌద్రాకారముదాల్చి దుర్యోధన, ద్రోణ, కృపాచార్య, కృతవర్మ కర్ణాదిమహాబలవంతులను చిక్కుపరచి అనేకరాజులను చంపి దేవతలు పొగడునట్లుగా పుణ్యలోకమునకుపోయి సుఖవంతుడై యున్నాడు. అభిమన్యునికొరకు మనము దుఃఖింపరాదు. అని కృష్ణుడు వసుదేవాది యాదవులందరును అభిమన్యుని నిమిత్తమై కలిగిన దుఃఖమును పోగొట్టి సకలజనులకును ప్రీతిని కలిగించుచు ప్రవర్తిం

చెను. అని కృష్ణుడు చెప్పిన వృత్తాంతమంతయు వైశంపాయనుడు జనమేజయునకు చెప్పెను.

## వ్యాసుడు పాండవులను అశ్వమేధ యాగోన్ముఖులను జేయుట

జనమేజయ మహారాజా! యిట్లు ద్వారకకు వెళ్ళిన కృష్ణుని వృత్తాంతమును వింటివిగదా! ఇక హస్తినాపురమందలి విశేషములను చెప్పెదను వినుమని వైశంపాయనుడు యిట్లనెను. జనమేజయ మహారాజా! హస్తినాపురమందు ఒకనాడు అభిమన్యుని గుణములను ప్రసంగవశమున బంధుజనులు చెప్పుకొనిరి. ఆ మాటలను ఉత్తర విని అభిమన్యుని తలచుకొని విచారించుచుండెను. అట్టి ఉత్తరను చూచి పాండవులైదురును అభిమన్యుని తలచుకొని మిగుల దుఃఖముతో ఏడ్చుచుండిరి. కరుణాసముద్రుడగు వేదవ్యాసమునీంద్రుడు ఆసమయమున హస్తినాపురమునకువచ్చి పాండవులకు తగిన మాటలు చెప్పి వారి దుఃఖములను పోగొట్టి యిట్లనెను. పాండవులారా! మీరు చచ్చినవారిని గురించి విచారించుటవల్ల ప్రయోజనము లేదు. గాన అశ్వమేధయజ్ఞప్రయత్నము జేయుడు. హిమవత్పర్వతమందుండు బంగారమును తెచ్చుటకు ప్రయత్నింపుడు. కావలసిన పదార్థములను పూర్ణముగా సంపాదింపుడు. అని వ్యాసుడు చెప్పగా మీరు చెప్పినట్లు చేసెదమని పాండవు లతనితో చెప్పిరి. అంతట వ్యాసుడు అంతర్ధానుడాయెను. వైశంపాయనుడు యీరీతి చెప్పగా జనమేజయు డిట్లనెను. మహాత్మా! వైశంపాయనమునీంద్రా! వ్యాసుడు అట్లు వెళ్ళిన పిమ్మట ధర్మరాజు అశ్వమేధయజ్ఞము చేయుటకు యెట్లు ప్రయత్నము చేసెనో చెప్పుమని యడుగగా వైశంపాయనుడు యిట్లనెను.

జనమేజయమహారాజా! వేదవ్యాసమునీంద్రుడు చెప్పి వెళ్ళిన పిమ్మట ధర్మరాజు తమ్ములతో యిట్లనెను. భీమాదులారా! మన

యందుగల కృపచేత వేదవ్యాసమునీంద్రుడు చెప్పిన వాక్యములను వింటిరిగదా! మనరాజ్యమందు తగిన ధనములేదు గనుక మనము అశ్వమేధ యజ్ఞము చేయుటకై హిమవత్పర్వతమందు బ్రాహ్మణులు దాచియుంచిన నిధియందు బంగారమును తెచ్చుకొనవలయును. దానితోడనే అశ్వమేధయజ్ఞము చేయవలయును. బంగారము మనకు సాధ్యమగు యోచనయు, హిమవత్పర్వతమునకు వెళ్ళుటకు ప్రయత్నమును చేయవలయునుగదా! ఇందుకు మీరేమి యోచించియో చెప్పుడని ధర్మరాజు అడుగగా ఆమాటలు విని భీముడు ధర్మరాజున కిట్లనెను. అన్నా! ధర్మరాజా! మరున్మహారాజువలన బ్రాహ్మణులు గ్రహించిన బంగారమును హిమవత్పర్వతప్రదేశమందు నిధిగా యుంచి నట్లు వ్యాసుడు నీకు తెలిపి ఆ బంగారమును తెచ్చి యజ్ఞము చేయుమని చెప్పెనుగదా! గనుక మనము హిమవత్పర్వతమునకు వెళ్ళి శివుని నియమయతో ప్రార్థించి శివుని కృపను బొంది ప్రమథగణములను పూజించి భూతములకు బలులిచ్చి ఆనిధిని త్రవ్వి బంగారమును తెచ్చుకొందము. మనరాజ్యమందు ధనమున్నదనియు లేదనియు మనము యోచింపవద్దు. ఆ బంగారు నిధిని త్రవ్వి తెచ్చుటకొరకు సైన్యముతో గూడ దేవరవారు విజయము చేయవలయును. అని ధర్మరాజుతో భీముడు చెప్పెను. భీముడు చెప్పిన ప్రకారమే అర్జున, నకులసహదేవులును జెప్పిరి. అట్లు తమ్ములు చెప్పిన మాటలకు ధర్మరాజు సంతోషించి ధృతరాష్ట్రునిదగ్గరకుబోయి గాంధారి వినుచుండగా యిట్లనెను.

తండ్రీ! ధృతరాష్ట్రమహారాజా! నీకు నమస్కరింపుచున్నాను నా ప్రార్థనను వినుము. వ్యాసమహాముని అశ్వమేధయజ్ఞము చేయుమని నాతో సెలవిచ్చినాడు. అందుకు కావలసిన ధనము హిమవత్పర్వత ప్రదేశమందుగల నిధిలోవున్నదనియు, ఆ ధనము తెచ్చి యజ్ఞము

చేయుమనియు చెప్పినాడు. గనుక ధనము తెచ్చుకొని అశ్వమేధము చేయుటకు మీరు అనుజ్ఞ యివ్వవలయును. అని ధర్మరాజు ధృతరాష్ట్ర గాంధారీదేవులతో చెప్పి వారి అనుమతిని పొంది వారికి నమస్కరించి కుంతీదేవి దగ్గరకు వెళ్ళి సంతోషముఖముగల కుంతితో యిట్లనెను. తల్లీ! కుంతీదేవీ! అశ్వమేధ యాగము చేయుటకు ప్రయత్నించి యున్నాను. అందుకు కావలసిన ధనము కొరకు హిమవత్పర్వతమునకు వెళ్ళవలయును. అని చెప్పి కుంతీదేవియొక్క అనుమతిని తీసికొని కుంతికి నమస్కరించి పిమ్మట ధర్మరాజు సభామంటపమునకు వచ్చి యుయుత్సుని రప్పించి యిట్లనెను.

యుయుత్సుడా! నేను అశ్వమేధ యజ్ఞమును చేయదలచి అందుకు కావలసిన ధనముకొరకు వేదవ్యాసుని యాజ్ఞాప్రకారము హిమవత్పర్వతమునకు వెళ్ళవలయును. నీవును, విదురుడును పట్టణమును కాపాడు చుండవలయును. అని యుయుత్సునితో జెప్పి యుయుత్సవిదురులను హస్తినాపురమందు నిలుచునట్లుచేసి పిమ్మట ధర్మరాజు పరిచారకులను పిలిచి సైన్యములను సిద్ధముచేయుడని చెప్పెను. ధర్మరాజు తగిన ఏర్పాట్లుచేసి పిమ్మట దేవతలను, పితృదేవతలును పూజించి దేవేంద్రపూజలుచేసి బ్రాహ్మణులను పూజ, దానములచేత సంతోషపరచి, అగ్నిపూజలుచేసి తనపురోహితుడగు ధౌమ్యుడును, తానును అగ్నిచుట్టును ప్రదక్షిణముగా తిరిగిరి. అంతట ధర్మరాజు తెల్లని గంధము పూసుకొని, తెల్లని ఆభరణములు ధరించి, తెల్లని పుష్పమాలలచేతను, తెల్లని వస్త్రముల చేతను, తెల్లని గొడుగుల చేతను అలంకరింపబడి పరిపూర్ణ చంద్రునివలె ప్రకాశించెను.

ధర్మరాజు తెల్లని పదియారు గుఱ్ఱములను కట్టియుండెడి రథముమీద కూర్చుండెను. ధర్మరాజు హిమవత్పర్వత మందుగల నిధియందుండు బంగారమును తెచ్చుటకు ప్రయాణమయ్యెను. ధర్మరాజు

ప్రయాణమైన సమయమున బ్రాహ్మణులు ఆశీర్వాదములు చేయుచుండిరి. మంచిశుభమును కలిగించెడి సంగీతశబ్దములు వినబడుచుండెను. మంగళవాద్యములు మ్రోగుచుండెను. పండితజనులు స్తుతింపుచుండిరి. అట్లు ధర్మరాజు ప్రయాణమైన సమయమున భీమార్జున నకుల సహదేవులును మంచి అలంకారము చేసికొని ముఖ్యులగు భటులను. గుఱ్ఱపుదండులను, ఏనుగులను, ఒంటెలను వెంటనడిపించుకొనుచు ప్రయాణమైరి. బంగారు నిధిని త్రవ్వుటకు తగిన పనిముట్లను మోసికొని వచ్చుటకు జనులను తీసికొని వచ్చిరి. అట్లు సకల ప్రయత్నములతోవచ్చిన తమ్ములనుజూచి ధర్మరాజు సంతోషించి తమ్ములతోగూడ వెళ్ళుచుండెను. అట్లు కొంతదూరము నెళ్ళిన పిమ్మట సైన్యములను తీసికొని కొందరు రాజులు ధర్మరాజుతో కలిసిరి. ఈ ప్రకారముగాధర్మరాజుప్రయాణమైవెళ్ళి అక్కడక్కడమార్గపు బసల యందు నిల్చుచు నదీపర్వత అరణ్యములనుదాటి హిమవత్పర్వతమునకుచేరి ధౌమ్యుడు మొదలగు తన పురోహితులను చుట్టుబెట్టుకొని ఒకచోట కూర్చుండెను. ధర్మరాజుయొక్క సైన్యములన్నియు హిమవత్పర్వతమందు యోగ్యప్రదేశమున నిలిచియుండెను.

## వ్యాసుడు హిమవత్పర్వతమున నున్న పాండవుల కడకు వచ్చుట

ఆసమయమందు కృపాసముద్రుడగు వేదవ్యాసుడు హిమవత్పర్వతమునకు వెళ్ళియుండెడి పాండవుల దగ్గరకు వచ్చెను. వ్యాసుని దేహము ఆశ్వయుజ కార్తీకమాసముల యందుండెడి నల్లమేఘ కాంతిగలిగి యుండెను. వ్యాసుని శిరస్సునందు బాలసూర్యుని కాంతి వంటి యెఱ్ఱని కాంతులుగల జడలుండెను. వేదవ్యాసుని చేతియందు ప్రకాశించుచుండెడి ఒకకఱ్ఱ యుండెను. వ్యాసుడు జింకచర్మమును వస్త్రముగా ధరించి యుండెను. వేదవ్యాస మహాముని [illegible]

నిచ్చుటకు సమర్థుడు. అట్లు వచ్చిన వేదవ్యాస మహామునిని పాండవులుచూచి పరమ భక్తిపూర్వకముగా నమస్కరించి పూజించి యిట్లనిరి. మహాత్మా! వేదవ్యాసమునీంద్రా? యిక్కడ మేము చేయదగిన కార్యమెద్దియో సెలవిమ్ము. అని పాండవు లడుగగా వేదవ్యాస మునీంద్రు డిట్లనెను.

పాండవులారా! రేపటిదినమంతయు మీరు శివుని పూజించవలయును. ఈదినము రాత్రియందు నియమముగలిగి దర్భాసనముల మీాద పండుకొనవలయును. అని వేదవ్యాసుడు చెప్పగా పాండవులు దర్భలను తెచ్చి అక్కడున్న దివ్యప్రదేశమందు ధర్భలు పరచి నియమములతోడు బ్రాహ్మణాశీర్వాదములతోడ ఆరాత్రి దర్భల మీాద పండుకొనిరి. మరునాడు సూర్యోదయమునకు మునుపే లేచి స్నాన సంధ్యావందనాది కార్యములను చేసుకొనిరి. అంతట వ్యాసుని యాజ్ఞాప్రకారము పాండవులు, ధౌమ్యుడు మొదలగు తమ పురోహితులను తీసుకొని వెళ్ళి ఒక మంచి సమభూమియందు పరిశుద్ధి చేసి ఆస్థలమందు వేదమంత్రములతో శివుని ఆవాహించిరి. అట్లు ఆవాహించిన శివుని మంచి అనేకవిధ పుష్పములచేతను, ధూపదీపాది ఉపచారములచేతను పూజించిరి. అట్లు పూజించిన పిమ్మట పాయసాన్న భక్ష్యాదులతో గూడిన నైవేద్యము సమర్పించిరి. అటు పిమ్మట వేరువేరుగా ముఖ్యులగు ప్రమథగణములను పూజించిరి. కుబేర మాణిభద్రాది యక్షులను, మంత్రములచేత ఆవహానముచేసి పూజించిరి. ఇట్లు పాండవులు అధిక భక్తిపూర్వకముగా వేదవ్యాసుడు చెప్పినప్రకారము పూజించిరి. అంతట ధర్మరాజు ధౌమ్యాది పురోహితులచేత రక్షకవిషయములైన వేదమంత్రములను చదివించుచు తనతమ్ములను వెంటబెట్టుకొని వ్యాసుని ముందరుంచుకొనిబంగారు నిధియున్న స్థలమునకు వెళ్లెను. అపుడు యెట్టిని పుష్పములచేతను,

యెఱ్ఱని గంధములచేతను, మాంసములచేతను, పిండివంటలచేతను, పేలాలచేతను భూతములను తృప్తిపరచెను. అంతట వేదవ్యాసమునీంద్రుడు చెప్పిన స్థలమందు మహాబలవంతులగు జనులచేత ధర్మరాజు త్రవ్వించెను. అట్లు త్రవ్వగా ఆ నిధియందుండెడి బంగారముయొక్క కాంతులచేత దిక్కులన్నియు ప్రకాశించుచుండెను. నిధియందుండెడి బంగారములను దాని కాంతులను జూచి భీమార్జున నకుల సహదేవులు ఆశ్చర్యపడిరి. అపుడు ధర్మరాజు ఆనిధికి మరల పూజలు చేసెను. ఇట్లు సకలవిద్యలును తెలిసిన వేదవ్యాసమహామునిని దగ్గరపెట్టుకొని ధర్మరాజు బంగారు నిధిని సాధించెను. అంతట ధర్మరాజు వ్యాసుని పాదములకు నమస్కరించి చేతులుజోడించి శిరస్సునందు నిలిచియుండెను. అట్టి ధర్మరాజును వేదవ్యాసుడు జూచి కౌగిలించుకొని దీవించి నేను వెళ్ళెదనని చెప్పి అంతర్థానుడాయెను.

అంతట ధర్మరాజు బంగారు నిధిని త్రవ్వించెను. అట్లు త్రవ్వించగా ఆనిధియందు బంగారు కుండలును, బంగారు చెంబులును, బంగారు బిందెలును, బంగారు గోకర్ణములును, బంగారు పాత్రలను, యజ్ఞమునకు కావలసిన పనిముట్లును అన్నియు బంగారుమయములుగా నుండెను. ఆనిధియందు బంగారుకడ్డీలు, కట్టెల పేళ్ళవలెనుండెను. అట్టి బంగారములను పాండవులు త్రవ్వించి అనేకవేల బండ్లమీద, యెద్దులగంతలమీదను, ఏనుగుల, గుఱ్ఱముల, ఒంటెలమీదను, ఆనేకలక్షల పర్యంతముగల జనులమీదను, పెట్టించి మోయించుకొనుచు హస్తినాపుర మార్గమును పట్టిరి. అపుడు జనులందరును ఆశ్చర్యపడిరి. దేవతలు చూచి వెక్కసపుగుణములు గలిగి సహింపలేక యుండిరి. ధర్మరాజుయొక్క శత్రువులకు భయముకలిగెను. ఇట్లు లోకమంతయు ఆశ్చర్యపడుచుండగా పాండవులు బంగారపు నిధిని

త్రవ్వి ఒక్కపెట్టున మోయించుకొనుచు వచ్చిరి. అపుడు బంగారును మోసెడి జంతువులకు నీటిసౌఖ్యము కలుగుటకై నదుల సమీపముల యందుగల అక్కడక్కడ మార్గమందు నిలుచునట్లుగా ధర్మరాజు ఆజ్ఞాపించెను. ఆప్రకారము నదులసమీపమందు నిలుచుచు సైన్యములతో గూడుకొని వచ్చుచుండిరి. జనమేజయమహారాజా! ఇకను హస్తినాపురమందుగల సంగతులను చెప్పెదను వినుమని వైశంపాయనుడు జనమేజయునితో యిట్లనెను. జనమేజయ మహారాజా! ధర్మరాజు కృష్ణుని ద్వారకకు పంపినపుడు తన అశ్వమేధయజ్ఞమునకు బంధుసహితముగా రమ్మని చెప్పివుండెనుగదా!

## కృష్ణుడు సకలబంధుసహితుడై హస్తినాపురమునకు వచ్చుట

అట్లు కృష్ణుడు ద్వారకకు వెళ్ళి సుఖముగా కొంతకాలముండిన పిమ్మట హస్తినాపురమునుంచి వచ్చెడి చారులవలన ధర్మరాజు అశ్వమేధయజ్ఞ ప్రయత్నమును చేయుచున్నాడని తెలిసికొనెను. అట్లు తెలిసికొనిన కృష్ణుడు బలరామ సాత్యకి కృతవర్మ ప్రద్యుమ్న చారుదేష్ణసాంబాది యాదవులను తీసికొని దేవకీవసుదేవుల యాజ్ఞను పొంది సుభద్రాదేవిని వెంటబెట్టుకొని సకల బంధు సమేతముగా హస్తినాపురమునకు వచ్చెను. అపుడు కృష్ణుడు వచ్చుచున్నాడని ధృతరాష్ట్రగాంధారీ కుంతీదేవులు, యుయుత్సువిదురులను కృష్ణునకు ఎదురుగా పంపించిరి. అపుడు యుయుత్సుడు విదురుని ముందు పెట్టుకొని కృష్ణునకు ఎదురుగావెళ్ళి పరమభక్తితో సకలబంధు సహితుడై వచ్చెడి కృష్ణుని వెంటబెట్టుకొని హస్తినాపురమునకు ప్రవేశపెట్టిరి. అట్లు వచ్చిన వాసుదేవుడు మొదట ధృతరాష్ట్ర గాంధారీ దేవులను చూచి నమస్కరించి వారికి ప్రీతికలిగించెడి మాటలుచెప్పి పిమ్మట కుంతీదేవి దగ్గరకువెళ్ళి నమస్కరించెను. అపుడు కుంతీదేవి అనేక

విధములుగా వాసుదేవుని దీవించెను. బలరాముడు మొదలగు యాదవులు తగిన ప్రకారము కుంతీదేవిని జూచిరి. అంతట కుంతీదేవి సంతోషముచే పులకాంకురింపబడిన దేహముగలదై వాసుదేవుడు మొదలగు యాదవులనందరిని పూజలుచేత గౌరవించుటకు విదురుని పంపించెను. అంతట విదురుడు బలరామ వాసుదేవులను పూజించి తక్కినయాదవులనుకూడపూజించెను. అపుడుసుభద్రాదేవి కుంతీదేవిని జూచి నమస్కరించెను. సుభద్రను కుంతి దీవించి లోపలనుండెడి తగిన గృహమునకు పంపించెను. అంతట వాసుదేవుడు మొదలగు యాదవులందరును నగరమునకు వెంబడి యుండెడి మంచిమంచి గృహముల యందు నివసించునట్లు చేయుమని కుంతీదేవి యుయుత్సునితో జెప్పెను. అపుడు యుయుత్సుడు వెళ్ళి కుంతీదేవి చెప్పిన గృహములయందు వాసుదేవాదియాదవులనందరిని ప్రవేశపెట్టెను. ఆ గృహములయందు వాసుదేవాది యాదవులందరును నివసించి సంతోషించియుండిరి. అని వైశంపాయనుడు జనమేజయునితో యిట్లనెను.

జనమేజయ మహారాజా! ఆ ప్రకారము కృష్ణాది యాదవులందరును హస్తినాపురమందుండగా ఉత్తర ప్రసవించెను. ఆ యుత్తర గర్భమందు నీతండ్రియగు పరీక్షిత్తు పుట్టెను. అపురిటింటియందుండెడి వారందరును మొగపిల్లవాడు పుట్టెనని చెప్పిరి. ఆ మాటను కౌరవ వృద్ధ స్త్రీలందరును. విని సంతోషముచేత ఉప్పొంగిరి. ఈ లోపలనే ఆ పుట్టిన పిల్లవాడు ప్రాణములు లేక పుట్టెనని యేడ్వకలిగెను. అట్టు ఏడ్చుచుండెడి వృద్ధస్త్రీలను, అక్కడుండు పరిజన స్త్రీలు పూరార్చిరి. అంతట పెద్దగా అందరును ఏడ్చుచుండగా ఆ దుఃఖధ్వనిని కృష్ణుడు విని అదరిపడిన సాత్యకిని తీసికొని అతి శీఘ్రముగా కుంతీదేవియున్న గృహమునకు వచ్చెను. అంతకు మునుపే కుంతీ ద్రౌపదీ సుభద్రా దేవులు ముగ్గురును మిక్కిలి దుఃఖించుచు కృష్ణుని దగ్గరకు

చ్చుచు కృష్ణునకు ఎదురుపడిరి. ఇట్లు దుఃఖించుచు వచ్చెడి వారి ముగ్గురిని కృష్ణుడు చూచి దుఃఖమనస్సు గలవాడయ్యెను. అపుడు కుంతీదేవి దుఃఖించుచు గద్గదస్వరములు గలుగుచుండగా కృష్ణుని జూచి యిట్లనెను.

## పరీక్షిత్ప్రాణమునకై కుంతి సుభద్రలు కృష్ణుని ప్రార్థించుట

కృష్ణా! నాకొడుకులగు పాండవులకును, నాకును నీవేదిక్కు అగుదువు నీకంటె మరియొకదిక్కు మాకు కనబడలేదు. నీకు మను మడుపుట్టినాడు. ఆ పుట్టినవాడు, క్రూరబుద్ధిగల అశ్వత్థామయొక్క బాణాగ్నిచేత మృతుడై పుట్టియున్నాడు. ఆ మృతుడై పుట్టిన పిల్ల వానిని బ్రతికింపుము. అశ్వత్థామ బ్రహ్మశిరస్సు అనెడి దివ్యాస్త్ర మును ప్రయోగించునపుడు ఉత్తర గర్భమందుండెడి పిల్లవానిని నే నవశ్యముగా రక్షించెదనని నీవు ప్రతిజ్ఞ చేసి యున్నావు. ఈ బాలుడు బ్రతికిన యెడల నేనును పాండవులును బ్రతికియుందుము. లేని యెడల అందరము ప్రాణములను విడువగలము. ఈ బాలుడు బ్రతు కని యెడల వంశమునకు ఉదక పిండప్రదానములను చేసెడి వాడు లేడు. అభిమన్యునికొరకు ఉత్తర దుఃఖించుచుండగా నీవు కరుణచేత నీ గర్భమందుగల శిశువును నేను రక్షించెదనని ఉత్తరను ఓదార్చి యున్నావు.

కృష్ణా! యీకులమును కలిగించినవాడవు నీవేయగుదువు. ఈ బాలుని నీవే బ్రతికింపుమని కుంతిదేవి కృష్ణుని ప్రార్థించి దుఃఖా వేశముచేత క్రిందబడెను. అపుడు కృష్ణుడు కుంతీదేవిని లేవనెత్తి ఓదార్చెను. అట్టిసమయమున సుభద్రాదేవి కృష్ణునితో యిట్ల నెను. అన్నా! కృష్ణా! మొట్టమొదట అశ్వత్థామ బ్రహ్మశిరమనెడి దివ్యాస్త్రమును భీమునిమీద ప్రయోగింప దలచెను. ఆ ప్రయో

గించినదివ్యాస్త్ర ఫలమును అర్జునుని సంబంధమైనవా రందరును అను భవించిరి. తుదకిపుడు యిట్లు సంభవించినది. నీ మరదియగు అర్జునుడు తన కొడుకగు అభిమన్యునియందు అధిక ప్రేమగలిగియుండును. ఆ యభిమన్యుని కొడుకు యిట్లు మృతుడైన యెడల అర్జునుడు యేమై పోవునో నాకు తెలియదు. నీవే తెలుసుకొనుము. ఇట్లు ఉత్తర గర్భ మందు బుట్టిన శిశువు మృతుడయ్యెనని పాండవులు వినినయెడల ఆ దుఃఖమును సహింపజాలరు. అశ్వత్థామ బ్రహ్మశిరో నామ కాస్త్రమును అపాండవమగుగాక యని ప్రయోగించినపుడు అశ్వత్థా మను నీవు అదలించి నీవు కుతిత్సుడవనియు, నిన్ను పాపాత్ముని చేసెదననియు నీ అస్త్రమును వ్యర్థము చేసెదననియు అశ్వత్థామతో చెప్పియుంటివి. నీమాటలు మేము నమ్మికొనియున్నాము. నీ మహానుభావత్వమును మే మెరుగుదుము. గనుక అశ్వత్థామయొక్క బ్రహ్మశిర దివ్యాస్త్రమునకు మేము భయపడకుంటిమి. నీవు సత్య వంతుడవు. ఆశ్రితులను రక్షించెడి విషయమై కృపగలిగియుందువు. ఈ గుణములు నీకు స్వభావములుగా నుండును. నాశిరస్సును నీ పాదములయందు నిలిపి యిదిగో యిప్పుడు నమస్కరించుచున్నాను. కరుణచేత నన్ను రక్షించుకొనుము. నీవు పాండవులకు ఏవిధమైన కీడును కలుగకుండునట్లు రక్షించితివి. నీవు దగ్గరయుండగనే పాపాత్ముడైన అశ్వత్థామ పాండవులకు కీడు కలిగించెను. అట్టి దుర్మార్గుడైన అశ్వత్థామను యేమిగా చెప్పవచ్చును. అని సుభద్రా దేవి కృష్ణుని ప్రార్థించి యిట్లనెను. అన్నా! కృష్ణా! నీవు తలచిన యెడల యీ మూడులోకములయందు గల జంతువులు చచ్చినను మరల సకలజంతువులకును ఎప్పటివలె ప్రాణములు కలిగింపగలవు. అట్టి సమర్థత్వము నీయందున్నప్పుడు నీబావమరదియగు అర్జునుని మనుమడు చచ్చినయెడల నీవు ఉపేక్షించి యూరకుండవు. మేము

వెళ్ళివారమై యింతదూరము దుఃఖించితిమేగాని దుఃఖించవలసిన పని లేదు. అని సుభద్రాదేవి దుఃఖించి ఉత్తరయొక్క గర్భమునుండి మృతుడై పుట్టిన శిశువును రక్షించి ప్రాణము లివ్వమని ప్రార్థించగా కృష్ణుడు కృపానుఃఖములు రెండును గలవాడై ఉరుమువంటి కంఠ ధ్వనిచేత అందరును వినుచుండగా యిట్లనెను.

కుంతీసుభద్రలారా! నేను ఉత్తరగర్భమందు మృతుడై పుట్టిన పిల్లవానిని అవశ్యముగా బ్రతికించెదను. మీరు దుఃఖింపవద్దు అని కృష్ణుడు చెప్పగా అందరును సంతోషించి దుఃఖములను విడిచిరి. అంతట కృష్ణుడు ఉత్తర ప్రసవించిన పురుటింటికి వెళ్లుచుండగా కృష్ణునితోగూడ కుంతిమొదలగువారు వెళ్ళుచుండిరి. అట్లు కృష్ణుడు పురుటింటికి వెళ్ళునపుడు మిక్కిలి తెల్లనిపుష్పములును, నీటిచేత నిండి యుండెడి కుండలను ప్రజ్వలించి మండుచుండెడి అగ్ని మొదలగు భూతభయములను పోగొట్టెడి పదార్థములును యెదురుపడెను. ఇవి శుభశకునము లగును. అట్టి శకునము లగుచుండునపుడు కృష్ణుడు పురుటింటికి వెళ్ళెను. పురుటింటియందు ముసలి ఆడవాండ్రును, వైద్యు లలో సమర్థులగు స్త్రీలును, పరిచారకస్త్రీలును, మేలుకోరినవారును మంత్రసానులు మొదలగువారుండిరి. ఆ పురుటింటికి కృష్ణుడు రాక మునుపే ద్రౌపదివచ్చి ఉత్తరతో యిట్లనెను. కోడలా! ఉత్తరా! ఇదిగో కృష్ణుడు వచ్చుచున్నాడు. నీవు భక్తివినయములతో కృష్ణుని ప్రార్థింపుము. అని చెప్పగా దుఃఖముచేత పడియుండెడి ఉత్తర లేచి నిలిచియుండెను. అంతట ఆపురుటింటికి వచ్చిన కృష్ణునితో ఉత్తర ఊడిన జడభారముగలదగుచు వినయపూర్వకముగా యిట్లనెను. కృష్ణా! నీకు నమస్కరించుచున్నాను. నీభక్తులయొక్క దుఃఖములను పోగొట్టుటకు నీవు దృఢమైన వ్రతమును పట్టియుంటివిగదా! నాయందు గల కృపచేత యీశిశువును బ్రతికింపుము, నీమేనల్లుడైనట్టియు, నా

భర్తయైనట్టియు అభిమన్యునియందు కరుణగలిగియుండవు. అట్టి అభిమన్యుని పుత్రుడైన యీశిశువును అశ్వత్థామ చంపుటకు సమర్థుడగునా ? భర్త లేనినాడు పుత్రహీనత్వముగూడ కలిగినయెడల నెట్లు బ్రతుకుదును ! ఈ శిశువు బ్రతుకనియెడల నేను ప్రాణములను విడిచి వెళ్ళెదను. ఈ శిశువును రక్షించెదనని నీవు యిదివరకు ప్రతిజ్ఞ చేసియున్నావు. గనుక యీ శిశువునకు ప్రాణములిచ్చి నా ప్రాణములను కాపాడుము.

కృష్ణా ! యీపుట్టెడి బాలుని చంకబెట్టుకొని కృష్ణుడు వచ్చినపుడు నమస్కరింపజేసెదనని తలచియుంటిని. నా కోరికను అశ్వత్థామ పాడుచేసెను. అని వుత్తర కృష్ణునితో చెప్పి దుఃఖించి అంతట నిలువక దుఃఖబాహుళ్యముచేత చచ్చిపడియుండెడి శిశువును యెత్తుకొని తనతొడమీద పెట్టుకొని ఆ శిశువు ముఖము జూచుచు యిట్లనెను. ఓతండ్రీ ! కొడుకా ! కండ్లు తెరచి నవ్వుచు కుంతిని చూడుము. నన్ను చూడుము. ద్రౌపదినైనను, నీతండ్రితల్లియగు సుభద్రనైనను జూడుము అని వుత్తర ఆ చచ్చి పడియుండెడి బాలుని శవముతో చెప్పుకొని దుఃఖించుచు మూర్ఛిల్లి క్రిందపడెను. అపుడు అక్కడనుండెడి కౌరవ పాండవస్త్రీలందరికిని అధికదుఃఖములు కలిగెను. అంతట కొంతసేపటికి వుత్తర మూర్ఛ తెలిసికొని భూమిమీద పడియుండుటచే తన రెండు చేతులను జోడించి శిరస్సు యందుపెట్టుకొని కృష్ణదేవునకు నమస్కరించుచు, వెక్కివెక్కి ఏడ్చుచు శరణు శరణు యని చెప్పెను. అపుడు పరమ కృపాసముద్రుడగు కృష్ణదేవుడు భయపడకుము, భయపడకుమని వుత్తరకు చెప్పెను. అట్లు చెప్పి కృష్ణదేవుడు కాళ్ళుకడిగికొనివచ్చి చెంబుయందుండెడి నీళ్ళు తాకి అశ్వత్థామపూర్వము ప్రయోగించియున్న బ్రహ్మశిరమనెడి దివ్యమహాస్త్రమును ఉపసంహరించి అక్కడుండెడి కుంతిమొదలగు స్త్రీలతో యిట్లనెను. కుంతీ సుభద్రా

నులారా! యీబాలశవమును పరుపుమీద పండుకొనబెట్టుడు అని చెప్పి సంతోషముచేత వికసింపబడిన ముఖములుగల స్త్రీలందరిని కలియ జూచి యిట్లనెను.

## కృష్ణుడు మృతజాతుడైన పరీక్షితుని లబ్ధ జీవితునిగా జేయుట

కుంతీ సుభద్రాదులారా! యీబాలుని నేను బ్రతికించెదనని నే నిదివరకే చెప్పియున్నాను. అపుడు నేను చెప్పినమాట యిప్పుడు అబద్ధము కానేరదు. ఈ పిల్లవానిని మీరందరును జూచుచుండగా బ్రతికించెదను. చూడుడు. ఈపిల్లవాడు బ్రతుకుటచేత మీరందరును, పాండవులును సంతోషింపగలరు. అని ప్రతిజ్ఞచేసి కృష్ణుడు యిట్లనెను. కుంతీసుభద్రాదులారా! నేను శత్రువులతోనైనను అసత్యములు చెప్పనివాడనైతినేని యిప్పుడే యీబాలుని దేహమందుప్రాణములుండవలయును. నేను యెప్పుడైనను యుద్ధమందు వెనుక తీయక భయపడకుండెడివాడనైతినేని యీబాలుని దేహమందు యిప్పుడే ప్రాణములువచ్చి నిలిచి యుండవలయును. నేను బ్రాహ్మణకులమందు అధిక ప్రియము కలిగి యుంటినేని యీపుత్తరయొక్క కొడుకు బ్రదుకవలయును. నేను ధర్మమందు ఆసక్తిగలిగి యుండుట నిజమైనయెడల యీవుత్తరకొడుకు బ్రదుకవలయును. అర్జునునియందు యెప్పుడైనను నాకు విరోధ మనస్సు గలుగకుండుట నిజమైనయెడల యీవుత్తర కొడుకు యిప్పుడే బ్రదుకవలయును. నేను న్యాయమార్గముచేత కంసుడు మొదలగు వారిని చంపితినని పెద్దలచేత నిశ్చయముగా తలచబడిన యెడల యీవుత్తరకొడుకు బ్రదుకవలయును. శాశ్వతమైన సత్యము, పరమధర్మము నిర్మలమగు మంచి బ్రహ్మచర్య వ్రతము యీమూడును నాయందు సర్వకాలసర్వావస్థలయందును నిలిచి ప్రకాశించుచున్న యెడల యీ వుత్తరకొడుకు యిపుడే బ్రదుకవలయును,

అని కృష్ణుడు అక్కడుండు స్త్రీలు వినుచుండగా చెప్పెను. అప్పుడే వుత్తరయొక్క శిశువునకు ప్రాణములు వచ్చెను. శిశువు వెంటనే చేతులు కాళ్ళు కదలించుచుండెను. పిమ్మట కండ్లు తెరచెను. శిశువు బ్రతికెనని కుంతీదేవి మొదలగు కౌరవస్త్రీలందరును బరమసంతోష ముగలవారై ఆనందించుచు పిల్లవానిని చూచుచుండిరి. అప్పుడు ఆకాశ వాణి కృష్ణుని స్తుతించెను.

అంతట వుత్తర కృష్ణుని యనుగ్రహము వలన బ్రదికిన తన బిడ్డను యెత్తుకొనివచ్చి కృష్ణుని పాదములమీద తన ముఖము జేర్చి నమస్కరించెను. అపుడు కృష్ణుడు ప్రేమగల మాటలచేత వుత్తరను ఆదరించి అనేక రత్నములతో చెక్కబడిన అనేక భూషణములను శిశువునకిచ్చెను. కృష్ణుడిచ్చినతోడనే బలరాముడు సాత్యకి మొదలగు యాదవులందరును అనేక భూషణములను శిశువున కిచ్చిరి. ఆసమయమున కృష్ణుడక్కడుండు వారందరును వినుచుండగా యిట్లనెను. కురువంశము క్షీణించినపుడు యీశిశువు పుట్టినందున యీబాలుడు పరీక్షిత్తు యనెడి పేరుచేత పిలువబడును. జనమేజయమహా రాజా! నీతండ్రియగు పరీక్షిత్తు యీ ప్రకారముగా కృష్ణునిచేత రక్షింపబడెనని తెలుసుకొనుము. అట్లు కృష్ణుడు పాండవ సంతానముము రక్షించి హస్తినాపురమందే నిలిచి యుండెను.

అంతట నీతండ్రియగు పరీక్షిత్తునకు ఒక నెల వయస్సు కలిగి నపుడు ఒక శుభదినమందు పాండవులందరును హిమవత్పర్వతము నుంచి బంగారు రాసులను ఎత్తించుకొని వచ్చిరి. పాండవులు వచ్చెడి సమాచారమును తెలిసికొని కృష్ణ విదుర యుయుత్సులు ముగ్గురును హస్తినాపురమును అలంకరింప జేసిరి. జనులందరును కస్తూరినీటి చేతను, కర్పూరపు ముగ్గుచేతను, అనేకరత్న తోరణములచేతను, [illegible] ముత్యముల దండలచేతను, బంగారుకుండల్లచేతను,

మరకతముల దండలచేతను. అరటి స్తంభములచేతను, శృగారపు చిత్రరేఖలచేతను, హస్తినాపట్టణమును అలంకరించిరి. హస్తినా పట్టణమందుండెడి జనులందరును చక్కగా అలంకారములు చేసుకొని పాండవుల రాకకు ఎదురు చూచుచుండిరి. చంద్రోదయ కాలమందు సముద్రము మ్రోగినట్లుగా హస్తినాపురమందు ధ్వనికలిగెను.

అంతట కృష్ణబలరామ సాత్యకు లందరును పరమానందము చేత మంచి అలంకారములు చేసికొని వచ్చుచున్న పాండవులకు ఎదురుగావెళ్ళి చూచిరి. అపుడు పాండవ యాదవులందరును అన్యోన్య క్షేమ వర్తమానములు విచారించుకొని ప్రేమస్నేహములచేత ఒకరి కొకరు నమస్కరించుకొనుచు అనేక విధములగు తగిన మర్యాదలను జరిపికొనిరి. జనమేజయమహారాజా! యిట్లు మీ తాతలగు పాండవులు కృష్ణునితో గూడుకొని ఉల్లాస సంతోషములు గలవారలై ఆ బంగారునంతయు ముందర నడిపించుకొనుచు హస్తినా పురమునకు చేరిరి. అట్లు చేరిన పాండవులు మొట్టమొదట ధృతరాష్ట్రి గాంధారు లను చూచి నమస్కరించిరి. అటుపిమ్మట కుంతీదేవిని జూచి నమస్కరించిరి. పిమ్మట మిక్కిలి సంతోషించుచుండెడి విదుర యుయుత్సులను మిగుల ప్రీతితో చూచిరి,

## వ్యాసుడు కృష్ణసహితులైయున్న పాండవుల యొద్దకు వచ్చుట

వైశంపాయనుడు జనమేజయునితో చెప్పి యిట్లనెను, జనమేజయమహారాజా! అట్లు మీతాతలగు పాండవులు హస్తినాపట్టణము నకు చేరి అందరిని తగినప్రకారము చూచి సంతోష చిత్తములతో యొక మనోహరమైన మంటపముమీద కృష్ణబలరామాది యాదవు లను చేర్చుకొని కూర్చుండిరి. అపుడు తగిన జనులు కొందరు షర్తీ

క్షిత్తి మృతుడై పుట్టుటయు ఆ మృత బాలుని కృష్ణుడు బ్రదికించుటయు యీ వృత్తాంతమంతయు పాండవులకు జెప్పిరి. అపుడు పాండవులు ఆశ్చర్యసంతోషములు గలవారై కృష్ణునిస్తుతించి యిట్లనిరి. కృష్ణా! నీవు అభిమన్యుని కొడుకును బ్రతికించుట ఆశ్చర్యముగాదు. నీవు యిదివరకు సర్వదా మమ్ములను యీప్రకారమే బ్రతికించియుంటివి. గనుక మాయందు నీకుగలకృపను చెప్పుటకు సాధ్యముగాదని అనేక విధములుగా కృష్ణుని స్తుతించిరి. అంతట పాండవ కృష్ణులు సంతోషముగలిగి హస్తినాపురమందు సుఖించుచుండిరి. అట్లు కొన్ని దినములు జరిగిన పిమ్మట దివ్యజ్ఞానియగు వేదవ్యాస మునీంద్రుడు హస్తినాపురమందు పాండవుల దగ్గరకు వచ్చెను. అట్లు వచ్చెడి వ్యాసునకు ఎదురుగా కృష్ణసమేతులగు పాండవులువెళ్ళి పూజించి నమస్కరించి తగిన పీఠమందు వ్యాసుని నిలిపి ఆయనను సేవించుచుండిరి. అపుడు వ్యాసపాండవులకు మంచిగోష్ఠి జరిగెను. అపుడు ధర్మరాజు వ్యాసునితో యిట్లనెను.

మహాత్మా! వ్యాసమునీంద్రా! మీయనుగ్రహమువలన త్రవ్వి తెచ్చిన ధనమును అశ్వమేధ యజ్ఞమందు ఉపయోగింపజేయవలెనని కోరియున్నాను. అట్లు ఖర్చుచేయుటకు సెలవియ్యమని ప్రార్థించగా అపుడు వ్యాసమునీంద్రుడు సంతోషించి ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! అశ్వమేధ యజ్ఞమువలన సకల పాపములు నశించుచున్నవి. గనుక నీవు అధిక దక్షిణతో అశ్వమేధ యజ్ఞముజేసి పుణ్యాత్ముడవై ప్రకాశింపుమని వేదవ్యాస మహాముని చెప్పగా ధర్మరాజు సంతోషించి తనదగ్గర నుండెడి కృష్ణునిజూచి కృష్ణునితో యిట్లనెను. మహాత్మా! కృష్ణా! యీ అశ్వమేధ యజ్ఞమును చేయుటకు ఆజ్ఞనిమ్ము. నీవే మాకు తల్లివిగాను తండ్రివిగాను, గురుడవుగాను, బాంధవుడవుగాను మంత్రివిగా నుండి మమ్మును సర్వవిధముల చేతను

రక్షించితివి. విశేషముగా నిన్ను స్తుతించుటకు నాకు శక్యముగాదు. సర్వలోకములను రక్షించుటకు నీవే గతియగుదువు. అని ధర్మరాజు కృష్ణునితో చెప్పగా కృష్ణుడు ధర్మరాజుతో యిట్లనెను.

ధర్మరాజా! వ్యాసులు చెప్పినట్లు అశ్వమేధ యజ్ఞమును చేయుము. అశ్వమేధ యజ్ఞమును జేసి కృతార్థుడవై మనస్సునందుగల సకల దుఃఖములను పోగొట్టుకొనుము. మరియు అశ్వమేధ యజ్ఞమును జేసి కృతార్థుడవు గమ్మని మొట్టమొదట నీకు నేనే చెప్పితిని గదా! అట్లు పూర్వమే నేను చెప్పి యున్నప్పుడు యిపుడు మరల నా అనుమతిని కోరవలసిన పనిలేదు. నీవు చేయదలచిన అశ్వమేధమునకు నన్నేమిపనిచేయుమని చెప్పెదవో ఆపనిని అవశ్యకముగా జేసెదను. నీ తమ్ములు నలుగురును, నేనును అశ్వమేధమునకు తగిన కార్యములను చేసి నీకు సంతోషమును కలిగించెదము. గనుక సంతోషముగాఅశ్వమేధమును ప్రారంభింపుము. అని కృష్ణుడు చెప్పగా ధర్మరాజు విని పరమానందమును బొంది వేదవ్యాసుని తట్టు తిరిగి చూచి యిట్లనెను.

మహాత్మా! వేదవ్యాసమునీంద్రా! అశ్వమేధయజ్ఞ దీక్షను పట్టుటకు తగిన శుభదినము చూచి ఆ సంస్కారమును మీరు కృప చేత చేయవలయును. అని ధర్మరాజు చెప్పగా వేదవ్యాసు డిట్లనెను. ధర్మరాజా! యాజ్ఞవల్క్యుడును, పైలుడును, నేనును జరుపవలసిన పనులను జరిపెదము. రాబోయెడి చైత్రశుక్ల పూర్ణమియందు అశ్వమేధము చేయవలయును. గనుక యిపు డశ్వపరీక్ష తెలిసినవారిని పంపించి యజ్ఞమునకు దగిన అశ్వమును తెప్పించుము. అట్టి శుభమైన అశ్వమును దెప్పించి వేదోక్తవిధిని జరిపి ఆ అశ్వమును భూమిమీద విడువవలయును. ఇట్లు విడువబడిన అశ్వము సకలభూమియందును సంచరింపవలయును. అట్లు తిరుగుటచేత నీ కీర్తి లోకమంతటను వ్యాపించగలదు. యజ్ఞమునకు కావలసిన సకల పదార్థములను

చేర్పుము, యజ్ఞహోమాదుల నిమిత్తమై కావలసిన స్రుక్స్రువాది సాధనములను, బంగారుచేత క్రొత్తవిగా చేయించుము. అని వేద వ్యాసమునీంద్రుడు చెప్పగా ధర్మరాజు అశ్వపరీక్షులను తెలిసిన మను ష్యులను రప్పించి యిట్లనెను.

అశ్వపరీక్షకులారా! మీరు శీఘ్రముగా వెళ్ళి మన గుఱ్ఱపు పిల్లలలో మంచి శుభలక్షణములు గల గుఱ్ఱమున్న యెడల పరీక్షించి తీసుకొనిరండని చెప్పి పంపెను. పిమ్మట పనివాండ్రను పిలిచి యిట్ల నెను. పనివారలారా! యజ్ఞమునకు కావలసిన కుండలు మొదలగు సాధనములును, హోమాదిసాధనములగు స్రుక్స్రువాదులును బంగారు చేత శీఘ్రముగా చేయింపవలెనని చెప్పెను. అందుకు పనివాండ్రు అట్లు చేసెదమని చెప్పి వెళ్ళిరి. పిమ్మట పనివాండ్రు మంచిగుఱ్ఱమును, యజ్ఞమునకు కావలసిన సామానులు సిద్ధపరచి ధర్మరాజునకు జూపిరి. అపుడు ధర్మరాజు తెచ్చిన గుఱ్ఱము మొదలగు వస్తువులను వ్యాసు నకు సమర్పించెను. అపుడు వ్యాసుడు తెచ్చిన గుఱ్ఱమును జూచి మిక్కిలి సంతోషముగలవాడై ధర్మరాజుతో యిట్లనెను ధర్మరాజా! యీగుఱ్ఱము మంచి శుభలక్షణములు గలిగియున్నది. యజ్ఞమునకు యిది తగినదగును. గనుక వేదవిధిప్రకారము జరిపి యీఅశ్వమును భూమిమీద విడుచుదము. అని వ్యాసుడు చెప్పగా ధర్మరాజు యిట్ల నెను. మహాత్మా! వ్యాసమునీంద్రా! యీఅశ్వమును భూమిమీద సంచరించుటకు విడిచినయెడల యీఅశ్వమును రక్షించుటకు తగినవా డెవడో తాము నిశ్చయించి నాకు చెప్పవలయునని యడుగగా వ్యాస మునీంద్రుడు యిట్లనెను. ధర్మరాజా! అర్జునుడు సకలదివ్యాస్త్ర సంపన్నుడై మహాబలపరాక్రమ శౌర్యతేజస్సు గలిగియున్నాడు. ఈ అశ్వము వెంబడి తిరిగి రక్షించుటకు అర్జునుడే తగును. భీమసేన నకులు లిద్దరును మనదేశమును రక్షించుచుండవలయును. అని వ్యాసుడు నిశ్చయించిచెప్పగా ధర్మరాజు అర్జునుని బిలిచి యిట్లనెను.

## ధర్మరాజు అర్జునుని యాజ్ఞాశ్వరక్షణమునకు నియోగించుట

తమ్ముడా! అర్జునా! యజ్ఞసంబంధమగు యీఅశ్వమును నీవు రక్షించుచు దీని వెంబడితిరిగి రావలయును. దీనిని రక్షించుటకు నీవు తప్ప మరియొకడు సమర్థుడుగాజాలడు. సర్వవిధములచేతను యీ కార్యమునకు నీవు వెళ్ళవలయును. ఈ అశ్వము సంచరించెడి దేశములయందు గల రాజులకు ధర్మరాజు యజ్ఞదీక్షను పొందియున్నాడని చెప్పుము. తగినట్లు ఆయా రాజులకు జెప్పి విరోధము లేకుండునట్లు కార్యానుకూలమును చేసుకొనుము. అని అర్జునునితో జెప్పి భీమ నకులులను పిలిచి యిట్లనెను. భీమనకులులారా! మీరిద్దరును మన దేశమును కాపాడుచుండవలయును. అని చెప్పి సహదేవునిజూచి యిట్లనెను. సహదేవా! నీవు మన పెద్దవారిని కుటుంబజనులను రక్షించుచుండుము. అని ధర్మరాజు వ్యాసులు చెప్పిన ప్రకారము ఏర్పాటుజేసి తక్కినపనులకు ఆయా జనులను పంపించెను. అంతట ధర్మరాజు ధృతరాష్ట్రి గాంధారులయొక్కయు, కుంతీదేవియొక్కయు అనుమతులనుబొంది ద్రౌపదిసమ్మతిని తీసుకొని అశ్వమేధయజ్ఞమును చేయుటకు ప్రారంభింపదలచెను. అని వైశంపాయన మునీంద్రుడు ధర్మరాజుయొక్క పుణ్యచరిత్రమును జనమేజయునితో చెప్పగా జనమేజయుడు యిట్లనెను. మహాత్మా! వైశంపాయనమునీంద్రా! పరమధార్మికుడగు ధర్మరాజు సర్వలోకపూజ్యమైన అశ్వమేధమును యేప్రకారముగా జేసెనో అదివినుటకు అపేక్షించుచున్నాను. గనుక చెప్పుమని యడిగెను.

ఇది శ్రీ మహాభారతమునందలి అశ్వమేధపర్వమునందు

తృతీయాశ్వాసము

---

# చతుర్థాశ్వాసము



దేవా! హరిహరనాథా! వైశంపాయనమునీంద్రుడు జనమేజయునిజూచి యిట్లనెను. జనమేజయమహారాజా! అశ్వమేధయజ్ఞమును ప్రారంభింపదలచిన ధర్మరాజునకు యోగ్యమైన దినమందు జ్యోతిష్కులు నిశ్చయించిన శుభముహూర్తమునందు వేదవ్యాసాది ఋత్విజులు వేదోక్త ప్రకారము దీక్షావిధిని జరిపి దీక్షితుని జేసిరి. ధర్మరాజు పట్టువస్త్రములను కట్టుకొని కృష్ణాజినమును ధరించి చేతియందు కర్రను దాల్చి ఋత్విగ్జనుల చేతను, మహామునులచేతను, ప్రజాపతులు మొదలగు మహాత్ములచేతను చుట్టుకొనబడి యుండెను. ధర్మరాజు దేదీప్యమానముగా ప్రకాశించుచుండు నవరత్నఖచిత భూషణములను ధరించి, ఆ భూషణముల కాంతులు దిక్కులయందు వ్యాపింపగా ప్రజ్వలించుచున్న అగ్నిహోత్రమువలె ప్రకాశించుచుండెను. ధర్మరాజువలెనే అక్కడుండు అతనిఋత్విగ్జనులుకూడ ప్రకాశించుచుండిరి. యజ్ఞముచేయించు బ్రాహ్మణులుఋత్విక్కులనబడుదురు. వేదవ్యాసమహాముని శాస్త్రోక్త ప్రకారము విధిని జరిపి అశ్వమును భూమిమీద సంచరించుటకు విడిచెను. అశ్వము వెళ్ళుచుండెను. అర్జునుడు ధర్మరాజుతో అశ్వమును కాపాడుటకు వెళ్ళెదనని చెప్పి అనుజ్ఞను తీసికొని గాండీవమను తన ధనస్సును అమ్ములపొది లోనగు యుద్ధసాధనములను గ్రహించి చొక్కాయి తొడిగికొనెను. అర్జునుడు యజ్ఞాశ్వము వెంబడి వెళ్ళుచుండెను. సకలజనులును, బాలురును, వృద్ధులు, స్త్రీలు మొదలగువారందరును గుర్రమువెనుక పోవుచున్న అర్జునుని చూచి తమలో తాము సంభాషించుకొనుచు, అర్జునుని పొగడుచుండిరి. సకల జనులును అర్జునుని దీవించిరి. ఆ జనులసందడి సముద్రఘోషతో సమానముగా నుండెను. సమస్త ప్రయాణముల

యందు నేర్పరియగు యాజ్ఞవల్క్యుని శిష్యుడు తగిన బ్రాహ్మణులను తీసికొని శాస్త్రవిధికార్యములను జరుపుటకు అర్జునునితో గూడ వెళ్ళెను. యజ్ఞాశ్వము భూమికి ప్రదక్షిణముగా చుట్టుకొని తిరిగి వచ్చుచు ఉత్తరపుదిక్కునకు పోవుచు తిన్నగా నడచుచుండెను. అశ్వమును రక్షించుటకై అర్జునుడు దానివెంబడినే వెళ్ళుచుండెను. త్రిగర్తదేశమందు నడచుచుండగా ఆ త్రిగర్తదేశపు రాజుయొక్క కుమారులు మనుమలు రోషముచేత లేచివచ్చిరి.

## అర్జునునితో త్రిగర్తదేశాధిపతులు యుద్ధముచేయుట

త్రిగర్తదేశపు రాజులు రథములెక్కి మిక్కిలి వేగముగావచ్చి అర్జునుని యజ్ఞాశ్వమునకు అడ్డముగా వచ్చిరి. అపు డర్జునుడు కోపించుకొని ధర్మరాజు తనతో చెప్పిన మాటలను తలచి వారితో యిట్లనెను. రాజులారా! ధర్మరాజు అశ్వమేధయజ్ఞమును చేయుటకు దీక్షవహించియున్నాడు. అతని యజ్ఞమునకు అపకారము చేసినయెడల మీకు పాపము కలుగును. ఈ అశ్వము అతని యజ్ఞసంబంధమైనదని తెలిసికొనుము. మేమును మీరును బంధుభావము కలిగియుండవలెను. మనకు విరోధముతో కార్యములేదు. అని అర్జునుడు శాంతముగా చెప్పెను. ఆమాటలను వారు లక్ష్యపెట్టలేదు. శూరతముని కుమారుడగు సూర్యవర్మ అను రాజును ముందుపెట్టుకొని త్రిగర్తదేశపు రాజులు అర్జునుని మీదకు వచ్చిరి. వారితో అర్జును డిట్లనెను.

రాజులారా! కృపాసముద్రుడగు ధర్మరాజు యీ అశ్వమును రక్షించుటకై నన్ను పంపునపుడు నాతో చెప్పినమాటలను వినుడు. అర్జునా! భారతయుద్ధమందు రాజులందరును చచ్చిపోయిరి. ఇపుడున్న రాజులందరు బాలురైయుందురు. అట్టివారిని కోపముతో

చంపరాదు. కృపగలిగి శాంతగుణముతో ప్రవర్తించుము. నీవు చెప్పిన మాటలను వినక అశ్వమునకు అడ్డము వచ్చినయెడల నీవు బంధు భావమునుచూపి ఎట్లయినను యుద్ధము చేయకుండ నుండుము. అని ధర్మరాజు నాతో చెప్పియున్నాడు. రాజులారా! ధర్మరాజుమాటలు నామనస్సునందున్నందున నేను మీతో యుద్ధము చేయుటలేదు. మీకు మీ ప్రాణములు ప్రియములుగదా! గాన యజ్ఞాశ్వమునకు అడ్డుపడవద్దు. వెళ్ళుడు అని అర్జునుడు చెప్పినను ఆ మాటలను వారు వినక వారిలో సూర్యవర్మ అనువాడు క్రూరముగా అనేక బాణములను, అర్జుననిమీద వేసెను. ఆ బాణములను అర్జునుడు నరికివేసి, గుండ్రముగనుండు కొన్ని బాణములను ఆ సూర్యవర్మపై ఉపయోగించి సూర్యవర్మను నొప్పించెను. సూర్యవర్మని తమ్ముడగు కేతువర్మయను నాతడు తన యన్నకు ముందుగానుండి వాడియైన బాణముల వర్షమును అర్జుననిమీద ప్రయోగించెను. అపుడర్జునుడు కొన్ని శాంతపు బాణములచేత ఆ కేతువర్మను నొప్పించి వెనుకకు పోవునట్లు చేసెను. ఆ కేతువర్మ తమ్ముడగు కృతవర్మ అర్జునుని మీదకువచ్చి మిక్కిలి తీక్ష్ణమైన బాణములను, అర్జుననిమీద వేసెను. అర్జునుడు కృతవర్మమీద బాణములు వేయుటకు యిష్టము లేక వాడు తనమీద వేసిన బాణములను నరికెను. కృతవర్మ వాడి గల గొప్ప బాణములచేత అర్జునుని కొట్టెను.

అర్జునునకు కొంచెము కోపము కలిగి కృతవర్మని రొమ్మునందు పదిబాణములను గుచ్చెను. ఆ బాణములను సహించుకొని కృతవర్ముడు జంకక మరికొన్ని వాడిబాణములను అర్జునుని దేహమందు గ్రుచ్చెను. అర్జునుని గాండీవము పిడికిటనుండి జారి మిక్కిలి విచిత్రముగా క్రిందపడెను. ఆశబ్దమునకు త్రిగర్త రాజులయొక్క సైన్యములు భయపడి పరుగెత్తెను. ఆ రాజులందరును కృతవర్మని

వెనుకకు పంపించి తమలో తామిట్లను కొనిరి. అన్న దమ్ములారా! ఇంద్రుని ధనుస్సువంటి అర్జునుని గాండీవమును క్రిందపడుటచేత కలిగిన ధ్వనిని వింటిరిగదా! గాండీవమెంత పెద్దదియో చూచితిరిగదా! అర్జునుడు ప్రళయకాల రుద్రునివంటి బలపరాక్రమములు గలవాడని మనము వినియున్నాము. అర్జునుడు తన శౌర్యమును చూపక శాంత మూర్తియై యున్నాడు. అర్జునునకు నిశ్చయముగ కోపము కలిగిన యెడల మూడు కన్నులుగల రుద్రమూర్తియే యగును.

గనుక మనలో ఒక్కొక్కడు అర్జునుని మీదకు పోయిన యెడల అర్జునుడు మనల నందరిని ఒక్కొక్కనిగానే చంపగలడు. ఈ సమయమందున మన మందరము ఒక్కపెట్టున అర్జునుని మీదకు వెళ్ళి యుద్ధము చేయవలయును. అట్లు చేసితిమేని అర్జునుడు మనచేత చచ్చును. ఇది అధర్మమని యిప్పుడు తల చరాదు. అని ఆ త్రిగర్తదేశపు రాజులందరును యోచించి వారందరు ఒక్కపెట్టున అర్జునుని చుట్టు ముట్టడించిరి. అర్జును డంతకుముందుగానే క్రిందబడిన గాండీవమును తీసుకొని కోపాగ్ని భయంకర రూపమును దాల్చి వచ్చెనోయనునట్లు అర్జునుడు కోపముతో కండ్లు యెర్రజేసి మంచి వాడియైన బలమైన బాణములను తనమీదకు వచ్చిన రాజుల మీదను, సైన్యములమీదను ప్రయోగించెను.

ఆ బాణములు పిడుగుల గుంపులవలె ఒక్కపెట్టున పడినట్లు ఆ సైన్యమందలి యోధులమీద పడి రథికులనందరిని చంపి పీనుగు పెంటలు జేసెను. ప్రళయకాల రుద్రుని వలె కోపముగలిగి ప్రకా శించు అర్జునునిచూచి త్రిగర్తదేశపురాజు సైన్యములన్నియు భయ పడి నాలుగు దిక్కులకు పరుగెత్తెను. రాజులకు యిష్టులగువారు కొందరు అర్జునునకు భక్తితో నమస్కరించి యిట్లనిరి.

మహాత్మా! అర్జునా నీవు చెప్పిన పనిని మేము చేసెదము. మమ్ములను రక్షింపుము. నీవు కృపావంతుడవు. అని ప్రార్థించగా

అర్జునుడు వారిమీద కృపగలిగి రక్షించి యిట్లనెను. జనులారా! మీరు వెళ్ళి ప్రాణములను రక్షించుకొనుడు. బుద్ధిగలిగి సౌఖ్యవంతులుగ నుండుడని చెప్పి యజ్ఞాశ్వమును వెంబడించుకొని పోవుచుండెను.

## భగదత్తసుతుడగు వజ్రదంతు డర్జునునితో పోరుట

ఆ యజ్ఞాశ్వము చక్కగా వెళ్ళుచు ప్రాగ్జ్యోతిషపట్టణము వెంబడిపోవుచుండెను. భగదత్తుని కుమారుడగు వజ్రదంతుడను ఆ దేశపురాజు బలగర్వమువలనను, బాల్యమువలనను, పట్టణములోనుంచి వచ్చి అర్జునుని యజ్ఞాశ్వమును తోలుకొని వెళ్ళుచుండెను. అర్జునుడదిచూచి గాండీవమునకు అల్లెత్రాడు సరిచేసికొని వజ్రదంతుని మీద అనేక బాణములను వేసెను ఆ బాణములు తగులుటచేత వజ్రదంతుడు నొచ్చి యజ్ఞాశ్వము నక్కడవిడిచి శీఘ్రముగా పట్టణమునకు వెళ్ళెను. అంతట ఆ వజ్రదంతుడు సైన్యములను తీసికొని ఒక ఏనుగమీద ఎక్కి అతిశీఘ్రము గావచ్చెను. వజ్రదంతుడు తన బలగర్వము వలన మిక్కిలి వాడిగల గొప్పబాణము లనేకములను అర్జునునిమీద వేసెను. ఆ బాణములను అర్జునుడు నడుమనే పొడిపొడిగా నరికెను. వజ్రదంతుడు కోపించుకొని తోమరములను అర్జునునిమీద వేయగా అర్జునుడు అగ్నిమంటలవంటి బాణములచేత ఆతోమరములను నరికివేసెను. అర్జునుడు తీక్ష్ణమైనవి కానట్టి అయిదు బాణముచేత వజ్రదంతుని ఏనుగమీదనుండి క్రిందకు పడవైచెను. ఆ వజ్రదంతుడు ఏనుగమీద కూర్చుండి మిక్కిలి వాడిగల అనేక బాణములను అర్జునునిమీద ప్రయోగించెను. దేవతలు వజ్రదంతుని పొగడిరి. అర్జునుడు గొప్ప వాడిబాణములను వజ్రదంతుని దేహమందు గ్రుచ్చెను. ఇట్లు వజ్రదంతుడు అర్జునునితో మూడుదినములవరకు

యుద్ధముచేసెను. వజ్రదంతుడు బాలుడైనందున వానిని అర్జునుడు చంపుటకు యిష్టపడక వానితో మూడుదినములపర్యంతము యుద్ధము చేయుచుండెను. మూడవనాడు వజ్రదంతుడను బాలుడు అర్జునుని మీద కోపించి యిట్లనెను. అర్జునా! నేనుండగా నీవు యెక్కడికి వెళ్ళెదవు. నిన్ను పోనివ్వను. నాతండ్రియగు భగదత్తుడు ముసలివాడైనందున భారతయుద్ధమందు నీవు చంపితివి. నన్ను చంపగలవా? నీవు ప్రయోజకుడవేగాని సమర్థుడవుగావు. అని అర్జునుని బెదరించి సెలయేరులవలె నీటిని కార్చుచున్న పర్వతమువంటి తన గొప్ప యేనుగును అర్జునునిమీదకు నడిపించెను. ఆ ఏనుగు పెద్ద ఘీంకార ధ్వని చేయుచు మేఘములవలన వర్షజలము కురియునట్లు తొండము చేత తుంపురునీటిని కార్చుచు అర్జునుని దగ్గరకు వచ్చెను. వజ్రదంతుడు గొప్ప ఏనుగును అర్జునునిమీదకు పంపి గొప్పవగు వాడిబాణములను అర్జునునిమీద వేసెను. అర్జునుడు కోపించుకొని వజ్రాయుధమువంటి ఒక వాడిబాణముచేత ఆ యేనుగును చంపెను. ఆ బాణము తగిలి ఆ యేనుగు పర్వతము పడినట్లు భూమిమీదపడెను. తనయేనుగు పడినందున వజ్రదంతుడు భూమిమీద నిలచియుండగా అర్జునుడు చూచి వానియందు కృపగలిగి యిట్లనెను. వజ్రదంతుడా! ధర్మరాజు యజ్ఞదీక్షను వహించి గుర్రమువెంబడి నన్ను పంపినపుడు రాజులను చంపవద్దనియు, కృపగలిగి విడిపింపుమనియు, చెప్పియున్నాడు. అందువలన నీమీద నాకు కోపములేదు. నీవు కోపమును విడువుము. రాబోవు చైత్రశుక్ల పూర్ణిమనాటికి నీ బంధుజనసహితముగా ధర్మరాజు చేయు అశ్వమేధయజ్ఞమునకు అవశ్యముగా రావలెను. అని అర్జునుడు చెప్పగా ఆమాటలకు వజ్రదంతుడు సంతోషించి అర్జునునకు నమస్కరించి అవశ్యముగా వచ్చెదనని చెప్పెను. అర్జునుడు సంతోషించి వానికి ప్రతినమస్కారముచేసి యజ్ఞాశ్వమును వెంబడించుకొని పోయెను.

## అర్జునుడు సింధుదేశాధీశులతో యుద్ధముచేయుట

జనమేజయ మహారాజా! ఆయజ్ఞాశ్వము సింధుదేశమందు సంచరించుటకు ప్రవేశించెను. భారతయుద్ధమందు చచ్చిన సైంధవుని యోధులయొక్క కుమారులును, మునులును, పూర్వవిరోధమును తలచి అనేకసహస్ర పరిమితిగల రథములను చేర్చికొని అర్జుననిమీదకు యుద్ధమునకు వచ్చిరి. ఆరాజులు మొదలగు మహారథికు లందరను ఒక్క పెట్టున యజ్ఞాశ్వమును అర్జునుని చుట్టుకొని అర్జునుని మీద అనేక సహస్ర పరిమితిగల శస్త్రాస్త్రములను వేసిరి. వానిచేత అర్జునుడు మిక్కిలి శ్రమజెంది రథముమీద వ్రాలెను.

జనమేజయ మహారాజా! మహాదివ్యబల పరాక్రమశాలి యని ప్రసిద్ధిజెందిన అర్జునునకు బాణముల దెబ్బలచేత శక్తిలేక రెండుచేతులును బెండులవలె వ్రేలాడుచుండెను. గాండీవము భూమిమీదపడెను. జనమేజయమహారాజా! నీకు నే నేమని చెప్పుదును? ఆ సమయమున యెర్రని మేఘములు ఆకాశమందు నిలిచి మిక్కిలి మాంసరక్త మయముౖలైన వర్షములు కురిసెను. సూర్యబింబము నలుపుతో గలిసిన యెరుపువర్ణము గలదిగా నుండెను. అన్నిదిక్కుల యందును పెద్దపెద్ద తోకచుక్కలు అనేకములు క్రిందపడు చుండెను. ఆకాశమందు నిలచియుండు దేవతలు మునులు దుఃఖసముద్రమందు మునిగినట్లు దుఃఖించి అర్జునునకు జయము కోరుచు నియమ పరిశుద్ధిగలిగి శక్తివంతములగు మంత్రములను చదువుచుండిరి. కొంత సేపటికి అర్జునుడు లేచి తెప్పరిల్లి, గాండీవమును తీసికొని దేహకాంతి గలవాడై జాగ్రతగల మనస్సుకూ కలిగియుండెను.

అర్జునుడతివేగముగా అనేకవిధములగు బాణవర్షములు కురియునట్లు బాణాస్త్రశస్త్రములను వేయుగా యుద్ధభూమి యంతయు బాణమయమయ్యెను. ఆ బాణముచేత అనేక శత్రువులు చచ్చిరి.

ఆకాశమందుండు దేవతలు మునులు సిద్ధులు ఆనందించి అర్జునుని పొగడిరి. సింధురాజ కుమారుల సైన్యములలో చావగా మిగిలిన వారు నాలుగు దిక్కులయందును చెదరిపోయిరి. మాత్సర్యముచేత వారందరును మరలకూడి అర్జునుని మీదకు యుద్ధమునకు వచ్చిరి. అర్జునుడు శత్రుసైన్యములయందుండు ముఖ్యరథికులతో యిట్లనెను. రాజపుత్రులారా! నేను యీ అశ్వము వెంబడి వచ్చుసమయమున రాజులను చంపవద్దని ధర్మరాజు నాతో చెప్పియున్నాడు. అందుచేత మిమ్ములను చంపుటకు నేను యిష్టపడను. మీరు వ్యర్థముగా ప్రాణములను పోగొట్టుకొన గూడదు. మీ ప్రాణములు మీకింతచేదా! అని అర్జునుడు చెప్పినను ఆ మాటలకు వారు సమ్మతించక అర్జునుని మీద మరల బాణములువేసిరి. అర్జునుడు నవ్వుచు, అనేకవిధములగు బాణములచేత వారందరిని నిమిషమాత్రములో చంపెను. ఈ వృత్తాంతమంతయు సింధుదేశపు పట్టణమందుండు దుస్సలవిని యుద్ధభూమికివచ్చి తనమనుమని తీసికొని అర్జునుని చూడవచ్చెను. దుస్సల దుర్యోధనుని చెల్లెలు. దుస్సల అర్జునుని చూచి ఘోరన పెద్దగొంతెత్తి యేడ్చుచు కన్నీరు విశేషముగా కార్చుచుండెను. అర్జునుడు దుస్సల యందుగల దయచేత రథముమీదనుంచి క్రిందకుదూకి తన గాండీవమును క్రిందపెట్టెను. దుస్సల అర్జునునితో యిట్లనెను.

తమ్ముడా! అర్జునా! యీ పిల్లవాడు నీకు అల్లుడైననాకుమారునకు కొడుకు, వీనిని రక్షింపుము అని దుస్సలచెప్పగా దానితో అర్జును డిట్లనెను. అక్కా దుస్సలా! నీకుమారుడగు నాఅల్లుడుయిప్పుడెక్కడున్నాడని ప్రశ్నించగా వెక్కివెక్కి యేడ్చుచు దుస్సలయిట్లనెను. తమ్ముడా! అర్జునా! నా భర్తయగు సైంధవుని అతిభయంకరమగు భారతయుద్ధమందు నీవు చంపినవృత్తాంతము నాకుమారుడువిని దుఃఖమందు మునిగి యిప్పుడు నీవు వచ్చుచున్నావని విని ప్రాణములను

విడిచెను. అని యిట్లు దుస్సల చెప్పుచు పెద్దగా గొంతెత్తి యేడ్చెను. ఆ మాటను అర్జునుడువిని దుఃఖముగలవాడై తలవంచుకొని దుఃఖింపుచుండగా దుస్సల అర్జునుని చూచి యిట్లనెను. తమ్ముడా! అర్జునా! మీకు మాఅన్నలగు దుర్యోధనాదులు చేసిన అపకారములను నీవిపుడు తలచవద్దు. నాభర్తయగు సైంధవుడు మీకు చేసిన అపకారములను నీవిపుడుమరచి తండ్రిలేని యీ బిడ్డయందు నీ కృపాదృష్టి నుంచుము. నీవు శరణాగతులను రక్షించువాడ వగుదువు. అని చెప్పుచు తన మనుమడగు ఆ పిల్లవానిని అర్జునుని పాదములమీదనుంచి శరణు శరణు నన్ను రక్షింపుము. కీర్తిధర్మములను పొందుమని ఆ పిల్లవాని చేత అనిపించెను. అప్పు డర్జును డధిక దుఃఖము గలవాడై యీ రాచ కులమును కాల్పనా? ఇది క్రూరభావమునకు మూలమగునని తలచుచు దుస్సలతో యిట్లనెను.

అక్కా! దుస్సలా! దుర్యోధనుడు నీచుడగును. ఆ దుర్యోధనునికంటె మేము అధిక నీచుల మగుదుము. మావలననే యింత చేటు కలిగినది. అని అర్జునుడు దుస్సలతో చెప్పి మంచిమాటలచేత దుస్సలను ఊరార్చి దాని శిరస్సును తన రొమ్ముయందు చేర్చుకొని దుఃఖింపవద్దు. వెళ్ళుమని చెప్పెను. అంతట దుస్సల సంతోషచిత్తము గలదై తనమనుమని సైన్యములను తీసుకొని వెళ్ళెను. అంతట అర్జునుడు యజ్ఞవిషయములైన అనుష్ఠానములను శాస్త్రప్రకారము జరుపుచు యజ్ఞాశ్వము వెనుక వెళ్ళుచుండెను. ఆ యజ్ఞాశ్వము సకల దేశములయందును సుఖముగా సంచరించుచు క్రమముగా మణిపూరు పట్టణాపురాజగు బభ్రువాహనుడు తన తండ్రియగు అర్జునుడు వచ్చుచున్నాడని విని పండితజనులను తీసుకొనివచ్చి అర్జునుని పాదములకు నమస్కరించెను. ఈ బభ్రువాహనుడు చిత్రవాహనుని కుమార్తె చిత్రాంగదయందు అర్జునునకు పుట్టినవాడని తెలియవలెను.

జనమేజయమహారాజా! తన కుమారుడగు బభ్రువాహనుడు వచ్చి నమస్కరించగా అర్జునుడు బభ్రువాహనుని ప్రీతిచేత ఆదరించ లేదు. అపుడు బభ్రువాహను డర్జునునిచేత ఆదరింపబడనివాడై అందుకు కారణము తెలియక విచారపడుచుండగా అంతట వానితో అర్జును డిట్లనెను. పుత్రుడా! బభ్రువాహనా! యజ్ఞముకొరకు విడువబడిన యీ అశ్వమునకు రాజగువా డడ్డమువచ్చి పట్టుకొన వలయును. నీవు అడ్డపడక శాంతమనస్సుతో రాజధర్మము లేనివాడవై యీ ప్రకారముగా వచ్చితివి. యుద్ధమునకు భయపడినవాడు రాజు కానేరడు. నీవు గుణహీనుడవు. గనుక వెళ్ళుము. అని అర్జునుడు చెప్పగా బభ్రువాహనుడు శీఘ్రముగా తన పట్టణమునకు వెళ్ళి రాజ వీధియందు తిన్నగా బోవుచుండెను.

జనమేజయమహారాజా! యీ ప్రకారము అర్జునుడు బభ్రువాహనునితో చెప్పిన మాటలన్నియు పాతాళలోక మందుండెడి ఉలూచి యనెడి నాగకన్యక తన దివ్యదృష్టివలన తెలుసుకొని మనో వేగముచేత బభ్రువాహనునిదగ్గరకు వచ్చెను ఉలూచి అర్జునుని వరించిన భార్య. ఐరావతమను దేవసర్పముయొక్క వంశమందు పుట్టిన కౌరవ్యునియొక్క కుమార్తెయగు నాగకన్యక. జనమేజయ మహారాజా! ఉలూచి కృపగలదై బభ్రువాహనునితో యిట్లనెను. బభ్రువాహనమహారాజా! నేను కౌరవ్యుడను నాగేంద్రుని కుమా ర్తెను, నాగకన్యను. నాపేరు ఉలూచి. నీకుమేలుచేయగోరి యిక్క డికి వచ్చినాను. నేను చెప్పుమాటలను వినుము. నీతల్లియగు చిత్రాం గద అర్జునునకు ఎట్లు భార్యయో, అట్లే నేనును అర్జునునకు భార్యను. గనుక నేను నీకు తల్లిని. నీతండ్రియగు అర్జునుని యాజ్ఞాప్రకారము నడుచుకొనుము. నీకు అతనితో యుద్ధముచేసినయెడల అతని మన సుకు సంతోషము గలుగును. గనుక రాజధర్మమైన యుద్ధమును

అర్జునునితో చేయుము. అని ఉలూచి చెప్పగా ఆ మాటలను బభ్రు వాహనుడు విని ఉలూచికి భక్తిపూర్వకముగా నమస్కరించి యిట్లనెను. తల్లీ! ఉలూచీ! తండ్రితో యుద్ధము చేయరాదని నేను అర్జునునితో యుద్ధముచేయక మరలివచ్చితిని. నా తండ్రియగు అర్జునుడు యుద్ధము చేయమని నాకు ఆజ్ఞనిచ్చియున్నాడు. గనుక యిప్పుడు నేను వెళ్ళి యుద్ధముచేసి నా తల్లియగు చిత్రాంగదకును, నీకును అఖండమైన ప్రీతి కలిగించెదను. అని బభ్రువాహనుడు ఉలూచితో చెప్పి ఉలూచిని తనగృహమునకు పంపించి మంచిరథముమీద నెక్కి తగిన భూషణాదులచేతను, సుగంధాదులచేతను అలంకరింపబడినవాడై యుద్ధోచితమైన చిహ్నములతో యుద్ధమునకు పోయెను.

## బభ్రువాహనుడు అర్జునునితో యుద్ధముచేయుట

బభ్రువాహనునకు హంసచిహ్నముగల టెక్కెముండెను. బభ్రువాహనుడు వచ్చి అర్జునుని యజ్ఞాశ్వమునకు అడ్డుపడెను. అర్జునుడు బభ్రువాహనుని మెచ్చుకొని వానిమీదకుపోయెను. బభ్రువాహనుడు మిక్కిలి వాడిగల అనేకబాణములను అర్జునుని మీద వేసెను. ఆ బాణములను అర్జునుడు అతి సులభముగా నరికి ఒక్కమారుగా పదునారుబాణములను బభ్రువాహనుని దేహమందు నాటించెను. ఆ బాణముల నతడు లక్ష్యపెట్టక వెంటనే వాడిగల తొమ్మిదిబాణములను అర్జునుని దేహమందు గ్రుచ్చెను. అందుకు అర్జునుడు తన కొడుకగు బభ్రువాహనుని మెచ్చుకొని వాని హంస టెక్కెమును నరికి ఐదుబాణములను బభ్రువాహనునిమీద నాటెను. బభ్రువాహనుడు క్రూరమగు నొకబాణమును అర్జునుని దేహమందు నాటెను. ఆ బాణము తగులుటచేత అర్జునుడు రథముమీద వ్రాలి

గాండీవమును పట్టుకొమ్మగా చేసికొని పిమ్మట మూర్ఛ తెలిసి ఔరా! నీవు మొనగాడవురా యని ప్రీతితో తనకొడుకునుపొగడి యిట్లనెను. పుత్రా! బభ్రువాహనా! నే వేయు బాణములకు నీ వోర్చి నిలువ వలయునుసుమీ! యని యర్జునుడు చెప్పి అతివేగముగా ప్రకాశ మానమైన బాణమును బభ్రువాహనునిమీద ప్రయోగించెను. ఆ బాణమును బభ్రువాహనుడు మూడుతునకలుగా నరికెను. అందుకు అర్జునుడు మాత్సర్యముగలవాడై వేగముగా అనేకమైన తీక్ష్ణమైన బాణములను బభ్రువాహనుని దేహమందు నాటెను. ఆబాణముల దెబ్బల కతడు సహించుకొని వజ్రాయుధముతో సమానమైన గొప్ప బాణములను అర్జునుని రొమ్మునందు గ్రుచ్చెను. ఆబాణములు అర్జునుని రొమ్మునందు గ్రుచ్చుకొని వీపుగుండా వెలుపలకువచ్చెను. ఆదెబ్బకు అర్జునుడు ప్రాణములువిడిచి భూమిమీదబడెను. అర్జునుడు పడినపిమ్మట ముందు అర్జునుడుకొట్టిన బాణపుదెబ్బలచేత బభ్రువాహ నుడును క్రిందబడెను.

## అర్జునుడు బభ్రువాహనునిచే మృతుండగుట

అర్జున బభ్రువాహనులిద్దరు భూమిమీద పడిరని చిత్రాంగద విని దుఖించుచు పెద్దగొంతెత్తి ఏడ్చుచు యుద్ధభూమికి వచ్చెను. చిత్రాంగదతో ఉలూచికూడ వచ్చి విచారింపకుండెను. చిత్రాంగద అర్జున బభ్రువాహనుల నిద్దరినిచూచి దుఃఖావేశముచేత మూర్ఛిల్లి కొంతసేపటికి మేల్కొని తన సవతియగు ఉలూచితో యిట్లనెను. ఉలూచీ! నీవు పంపించినందున నాకొడుకగు బభ్రువాహనుడు వెళ్ళి నా భర్తను చంపినాడు. చూచితివిగదా! నీవు పతివ్రతవుగావా! నీకు ధర్మమార్గము తెలియదా? ఏకారణముచేత బభ్రువాహనుని పంపించి నీన భర్తను చంపించితివో తెల్పియుండేదు. నాకొడుకగు

బభ్రువాహనుడు చచ్చినందుకు నాకు దుఃఖము కలుగలేదు. మన భర్తయగు అర్జునుడు చచ్చినందుకు దుఃఖము కలుగుచున్నది. అర్జునుడు నీకు కీడుచేసియున్నను ఆ కీడు తలచక కృపచేత మరల బ్రతికింపుము, అయ్యో! భర్తనుచంపుటకు పంపించి చచ్చిపడియున్న భర్తను నీవు చూచియు, దుఃఖింపకున్నావు. నీవంటిసాహసముగల ఆడుది లోకమందెక్కడను కనబడలేదు. అని ఉలూచిని దూషించి చిత్రాంగద చచ్చిపడియుండు అర్జునునిదగ్గరకు పోయి శవరూపముగ నుండు అర్జునునితో యిట్లనెను.

ప్రాణనాథా! అర్జునా! నీవు అధికకీర్తివంతుడవగుచు ప్రకాశించుచుంటివి. ఇతరులను రక్షించుటకు సమర్థుడవై యుండియు, ప్రాణములను విడిచి పడితివిగదా! నన్ను సర్వదా లాలించుచుందువు నన్ను కన్నుదెరచి చూడకుండుటతగదు. యజ్ఞాశ్వమునకు యెవ్వరును అడ్డము రాకుండునట్లుచేసితివి. ధర్మరాజుయొక్క యజ్ఞమునకు భంగము రాకుండునట్లు గుర్రము వెంబడి వెళ్ళకుండుటతగునా! అని యిట్లు చిత్రాంగద అర్జునుని దగ్గరనుండి దుఃఖించి ఉలూచిని చూచి యిట్లనెను. సవతీ! ఉలూచీ! నా కొడుకు బభ్రువాహనుడు పడియున్నను, మనభర్తకు ప్రాణములను కలిగించుము. పురుషులగు వారు అనేక స్త్రీలను పెండ్లిచేసికొనుట తప్పుకాదు. ఒక పురుషునకు అనేకమంది భార్యలున్నను వారందరును స్నేహము గలిగి యుండవచ్చును. నీకు విశేషముగా చెప్పుటవలన ప్రయోజనము లేదు. ముఖ్యముగా చెప్పుచున్నాను వినుము. మన భర్తయగు అర్జునుని బ్రతికింపుము. అని యిట్లు చిత్రాంగద చెప్పి అంతట నిలువక మరల యిట్లనెను. సవతీ! ఉలూచీ! నాకొడుకుచేత చచ్చిన అర్జునునిమీద నీవు కృపగలిగి బ్రతికించనియెడల నేను ప్రాయోపవేశముచేత ప్రాణములను విడిచెదను. అని యిట్లు ఆ చిత్రాంగద

చెప్పి అర్జునుని పాదములమీద తన శిరస్సునుంచి ప్రారకుండెను. బభ్రువాహనుడు మూర్ఛ తెలిసికొని లేచి వచ్చి అర్జునుని పాద ములమీద పడి దుఃఖించుచుండు తన జనక తల్లియగు చిత్రాంగదను జూచి యిట్లనెను. తల్లీ! చిత్రాంగదా! నీవు యిదివరకు యెప్పు డైనను కొంచెము సేపైనను దుఃఖించినదానవుకావు. ఇపుడు దుర్మా ర్గపుతనముచేత నేను నా తండ్రిని చంపినందుకు దుఃఖించితివి. నా తండ్రియగు యీ అర్జునుడు సూర్యుడు మంచును నశింపచేసినట్లు సకల శత్రువులను నశింప జేయువాడగును. అట్టివాడు నా చేత చచ్చుట దైవాధీనమై యున్నది. అర్జునుని కొరకు నీవు యిట్లు దుఃఖించుచుండగా చూచితిని. నావంటిపాపాత్మునకు యిట్టి నిన్నుచూ చుట ఆశ్చర్యముకాదు. నావంటిదుర్మార్గుడు కొడుకగునా? ఇట్టిమహా పుణ్యాత్మునకు తండ్రిని చంపితిని. ఇతని కిరీటము భూమిమీదవడెను. అని ఆ బభ్రువాహనుడు దుఃఖించుచుండగా యజ్ఞాశ్వముతో వచ్చిన యాజ్ఞవల్క్యశిష్యులు మొదలగు బ్రాహ్మణులు అక్కడికి వచ్చిరి. ఆ బ్రాహ్మణులను వుద్దేశించి బభ్రువాహనుడు యిట్లనెను.

ఆర్యులారా! అయ్యయ్యో! అర్జునుడు యీ ప్రకారముగా నాచేత చచ్చిపోయెను. ఈ బ్రాహ్మణులు యజ్ఞవిషయమైన కార్య ములను యిక నేమిచేయుదురు? తండ్రిని చంపిన పాపమునకు ప్రాయ శ్చిత్తమేదియు కనపడలేదు. అర్జునుని తలపుర్రెను పట్టుకొనిభిక్షమెత్తు కొనుచు పండ్రెండు సంవత్సరములు భూసంచారము చేయవలయును. ఇట్లు చేసినయెడల నా పాపము నశించునేగాని మరియొక మార్గము కనబడలేదు. అని బభ్రువాహనుడు దుఃఖించి ఉలూచిని జూచి యిట్లనెను.

ఉలూచీ! నీవు నన్ను అర్జుననిమీదకు యుద్ధముచేయుటకు పంపినందున నేను యుద్ధమందు నాతండ్రిని చంపుకొంటిని. అర్జునుడు

చచ్చుటకు ముఖ్యకారణము నీవే యగుదువు. చంపితివిగదా! ఇక నీ నివాసమునకు వెళ్ళవచ్చును. తల్లీ! వులూచీ! నేను నా తండ్రిని చంపితిని. ఈ పాపము నాకు యేవిధముచేతను పోజాలదు. గనుక నేనును ప్రాణములను విడిచి నా తండ్రిపోయిన చోటికి పోయెదను. అని యిట్లు సకల భూతములును ఉలూచియు వినునట్లుగా చెప్పెను. నాతండ్రి నిశ్చయముగా బ్రతుకనియెడల నేను యిది మొదలుకొని వ్రతముబట్టి ప్రాయోపవేశముచేత ప్రాణములను విడిచెదను. వీరుని చంపుట పాపమగును. అంతకంటె రాజును చంపుట మిక్కిలి పాపము. అంతకంటె ధర్మాత్ముని చంపుట మిక్కిలి పాపము. తండ్రిని చంపుటవలన కలుగు పాపమునకు మితములేదు. అట్టి విషయమున అర్జునుడు, వీరుడుగాను, రాజుగాను, ధర్మాత్ముడుగాను, తండ్రిగాను అయియున్నాడు. ఈ మహానుభావుని చంపిన పాపము ప్రాయోపవేశముచేత ప్రాణములను విడచుట తప్ప మరియొక ప్రాయశ్చిత్తమువలన పోజాలదు. గనుక ప్రాయోపవేశమును చేయుటకు వ్రతమును ధరించెదనని బభ్రువాహనుడు జలములు తాకి మాటలాడక కూర్చుండెను.

## ఉలూచి సంజీవనీ మణిచేత నర్జునుని బ్రతికించుట

జనమేజయ మహారాజా! అట్లు బభ్రువాహనుడు వ్రతమును బూని మాటలాడక వూరకుండెను. ప్రాయోపవేశముచేత ప్రాణములను విడుచుటకు నిశ్చయించిన చిత్రాంగద బభ్రువాహనులను పడియుండు అర్జునుని యీముగ్గురను ఆ నాగకన్యక యగు ఉలూచి చూచి సంజీవనీ మణిని తలచెను. అంతట సంజీవనీ మణివచ్చి వులూచియొక్క చేతిలో నిలచియుండెను. వులూచి బభ్రువాహనుని ముఖముచూచి యిట్లనెను, పుత్రుడా! బభ్రువాహనా! దేవేం

ద్రుని చేత నైన నర్జునుడు చావడు. ఈ యర్జునునకు నేనొకమేలు చేయదలచి నీచేత యుద్ధముచేయించి చంపించితిని. అర్జునుడు నీతో యుద్ధముచేయుటకు యిష్టముకలిగి యుండెను. అందువలన నిన్ను నర్జునుని మీదకు యుద్ధమునకుపంపి నేను యింతపని చేయ వలసి వచ్చినది. ఈ రెండు కారణములవలనను నామాయవలన నీకు బలశక్తులు కలిగించి యర్జునుని పడవేసితిని. ఇది నా మోహశక్తియే గాని వేరొకటికాదు. అర్జునుడు నరనారాయణ రూపియగు మహా ముని. ఇతని తేజస్సును యెవ్వరును పోగొట్ట జాలరు. కనుక నర్జు నుడు యిపుడే మరల బ్రతికి లేవగలడు. మీరు దుఃఖమును విడు వుడు. నా మాయాశక్తివలన నీ తండ్రితో నీవు యుద్ధముచేయుటకు బుద్ధిపుట్టించితిని. ఇంతమాత్రమేగాని మరియొకటికాదు. అని వులూచి చెప్పగా అక్కడగలజనులందరును, సంతోషముగలిగి యుండిరి. అం తట ఆ వులూచి తనచేతిలోనున్న సంజీవనీమణిని బభ్రువాహనుని చేతిలోపెట్టి నర్జునుని రొమ్మునందు మణిని వుంచుమని బభ్రువాహ నునితో చెప్పెను. బభ్రువాహను డామణిని తీసికొనిపోయి యర్జునుని రొమ్మునందుంచగా నర్జునుడు బ్రతికిలేచి కూర్చుండి అక్కడున్న అందరిని కలియజూచెను. అర్జునుడు యెర్రని పెదవుల యొక్కయు, తెల్లని పండ్లయొక్కయు, కాంతులచేత ప్రకాశించుచు బభ్రువాహ నునితో యిట్లనెను.

బభ్రువాహనరాజా! కుశలముగా అందరును సుఖము గలిగి యుంటిరిగదా! అని యర్జునుడు ప్రశ్నించగా బభ్రువాహనుడు భక్తి వినయ పూర్వకముగా నర్జునుని పాదములకు నమస్కరించి యిట్ల నెను. తండ్రీ! మహాత్మా! అర్జునా! మీయొక్క పుణ్యప్రభావు వలన సర్వము కుశలమైయున్నది. అందరము కుశలముగా యున్నాము అని చెప్పగా నర్జునుడిట్లనెను. బభ్రువాహనరాజా! జనులముఖముల

యందు దుఃఖ ఆశ్చర్య సంతోష స్వభావములు మూడును కనబడు చున్నవి. ఇందుకు కారణము నీకు తెలిసినయెడల చెప్పుము. నేను చెప్పినట్లు నీవువచ్చి నాతో యుద్ధము చేసితివి. అందుకు సంతోషించి తిని. నాభార్యలగు చిత్రాంగదయు, వులూచియు యిక్కడకు యెందు నిమిత్తమైవచ్చిరో చెప్పుమని ప్రశ్నించగా బభ్రువాహనుడు భక్తితో నర్జునునకు సాగిలపడి నమస్కరించి చేతులుజోడించుకొని నిలిచి యిట్లనెను. తండ్రీ! మహాత్మా! సర్వమహాత్మ్యరాలగు వులూచికి తెలుసును. ఆమెను ప్రశించమని వులూచిని చూపెను. అర్జునుడు వులూచి ముఖముచూచి యిట్లనెను.

ప్రాణనాయికీ! ఉలూచీ! నీవు పాతాళలోకమునుంచి యిక్కడికి వచ్చుటకు కారణమేమి! ఈమణిపూర పట్టణపురాజగు బభ్రు వాహనుని యందును, నా యందును నీకు ప్రేమకలిగి యున్నదిగదా! ఈ బభ్రువాహన రాజును, నేనును, యీ చిత్రాంగదయు, మేము ముగ్గురము నీకేమియు అపకారము చేసియుండ లేదుగదా! అని యర్జును డడుగగా వులూచి చిరునవ్వు గలదై యర్జునునిజూచి యిట్లనెను.

## ఉలూచియర్జునునితో వసువుల కోపప్రసాదముల నెరింగించుట

హృదయేశ్వరా! అర్జునా! నీవలన యెప్పుడైనను, నాకు అపకారము కలుగలేదు. నా కుమారుడగు బభ్రువాహనుని వలనను, నాకెపుడును చెరుపు కలుగదు. నా సవతియగు చిత్రాంగదయే, నాకపకారము చేయలేదు. నీకు నమస్కరించి జరిగిన వృత్తాంతమును చెప్పెదను వినుము. నీకుమారుడగు బభ్రువాహనునిచేత నీవు యుద్ధమందు మృతిబొందితివి. ప్రాణేశ్వరా! అర్జునా! నీవు భారతయుద్ధమందు శిఖండిని నెపముచేసికొని భీష్ముని పడగొట్టితివి. అదిపాపము

# అ శ్వ మే ధ ప ర్వ ము

మునులారా! వైరాగ్యముగల ముని రజస్తమోగుణములను బొత్తిగా, విడిచి సత్వమనెడి అవ్యక్తతత్వమందు రమించుచు నిర్గుణతత్వమగు ఆత్మనుచూచి తనతో కలసియుండెడి ప్రకృతి విడుచును. అట్లు ప్రకృతిని విడిచి స్వస్వరూపమగు పరబ్రహ్మముగా నుండుటయే ముక్తియనబడును. మునులారా! వేదాంత రహస్యములచేత చెప్పబడెడి ఆనిర్గుణ పరబ్రహ్మతత్వము ఈదేహమందుండెడి క్షేత్రజ్ఞుడైన ఆత్మయేనని తెలిసినవాడు సర్వజ్ఞుడనబడును. మునులారా! వృత్తి విశేషములను చింతించెడి చిత్తము వెంబడి మనస్సును చేర్చి అట్టి వృత్తులుగ చిత్తమును యోగమందు నిలిపి మనస్సును నిశ్చలముగా నుంచవలయును. ఇది ఉత్తమరహస్యమని పెద్దలు చెప్పుదురు. మునులారా! అవ్యక్తమనెడి ప్రకృతితత్వము మొదలుకొని శోచెడి తత్వములన్నియు అవిద్యవలన కలిగినవని తెలిసికొనుడు. అవిద్యయనగా అజ్ఞానము. అదియేబంధము, అట్లు అవిద్యవలన కల్పితమైన దేహేంద్రియాది ప్రపంచమందైనను భార్యాపుత్ర ధనాది పదార్థములయందైనను నాది యనెడి యభిమానము కలిగినయెడల బంధము మృత్యువగును. దేహేంద్రియాది ప్రపంచమందు నాది యనెడి అభిమానము కలుగని యెడల మోక్షరూపమగు అమృత కర్మలయందు ఆసక్తిగలవారు కర్మమార్గము శ్రేష్ఠమని చెప్పుదురు. జ్ఞానులగు వారు జ్ఞానమార్గము శ్రేష్ఠమని చెప్పుదురు. ఆత్మవలననే పదియారు అవయవములు గల లింగదేహము పుట్టెను. జ్ఞానేంద్రియములైదును కర్మేంద్రియములైదును, పంచవాయువులును, మనస్సొకటియు యివి యన్నియుచేరి పదియారగును. ఈపదియారును లింగదేహమని చెప్పబడును. లింగదేహము ఆత్మ నిత్యుడనియు, దేనిచేతను గ్రహింపదగినవాడు కాడనియు తెలుపుచున్నది. గనుక ఆత్మకు కర్మరూపము లేదనియు, జ్ఞానరూపముచేత ప్రకాశింబుగలిగియున్నదనియు శ్రుతులు

నునకు, అర్జునునియందు భీష్మునకు ప్రేమగలదు. భీష్ముడు శిఖండిని ముందుపెట్టుకొని అర్జునుడు నామీాద బాణములు వేసినయెడల నన్ను మీరు జయింపగలరని పాండవులతో చెప్పి అట్లు చేయుడని చెప్పి యున్నాడు. ఆభీష్ము డట్లు చెప్పినందున అతని యిష్టప్రకారము అర్జునుడు భీష్ముని పడగొట్టెను. ఇది న్యాయము కానేరదు. గనుక మీరు అర్జునునియందు కృపనుంచి రక్షింపవలయునని అనేకవిధములుగా చెప్పి వసువులను ప్రార్థించెను. నాతండ్రియగు కౌరవ్య నాగేంద్రుడు చెప్పగా ఆవసువులు కోపమువిడిచి నాతండ్రితో యిట్లనిరి.

కౌరవ్యనాగేంద్రా! మేము ఒక యేర్పాటు చేసెదము. అట్లు జరిగినయెడల భీష్ముని పడగొట్టిన పాపము అర్జునునకు పోగలదు. అని ఆ వసువులు మెనమంత్రముగురును. నాతండ్రియగు కౌరవ్యనాగేంద్రునితో చెప్పితిరి. అంతట నాతండ్రి తిరిగి పాతాళలోకమునకు వచ్చి యీావృత్తాంతమును నాకు తెలిపెను. అంతటనుంచి నేను సమయము చూచుచుంటిని. ఇపుడు నీవు యజ్ఞాశ్వముతో వచ్చితివి. బభ్రువాహనుడు నీతో యుద్ధము చేయుటకు యిపుడు తగినసమయమై యున్నది. గనుక యిపుడు నేను పాతాళలోకమునుంచి వచ్చి బభ్రువాహను మీాదకు పంపించి నిన్ను చంపించితిని. నిన్ను గెల్చుటకు తగిన బలమును నామాహాత్మ్యతవలన బభ్రువాహనునికి కలిగించి వసువులు చెప్పినప్రకారము జరుగుటకై బభ్రువాహనుని పురికొల్పి నీమీాదకు పంపించి నిన్ను చంపించితిని. పిదప సంజీవమణిచేత మరల నిన్ను బ్రతికించితిని. అని వులూచి అను నాగకన్యక చెప్పగా అర్జునుడు పరమసంతోషముకలవాడై ఉలూచితో యిట్లనెను.

భార్యామణీ! ఉలూచీ! నీ పుణ్యచరిత్రమువలన సర్వదా మాకులము అభివృద్ధిని పొందుచున్నదే యగును. అని చెప్పి బభ్రువాహనుని జూచి అర్జును డిట్లనెను. పుత్రుడా! బభ్రువాహనరాజా!

రాబోవు చైత్రశుక్ల పూర్ణిమనా డశ్వమేధ యజ్ఞకాలమగును. అప్పటికి నీవును నీ తల్లులగు చిత్రాంగద ఉలూచులును సకల బంధుజన సమేతముగా హస్తినాపురమునకు అవశ్యముగా రావలయును. అట్లు వచ్చి ధర్మరాజుచేత గౌరవసన్మాన సౌఖ్యములను పొందవలయును. అని అర్జునుడు చెప్పగా బభ్రువాహను డిట్లనెను. తండ్రీ! అర్జునా! అవశ్యము తమ ఆజ్ఞాప్రకారము వచ్చెదను. నీవు నా పట్టణమునకు వచ్చి, నా తల్లులును, నీవును నాయందుగల పుత్రభావమును పొగడుచు యీ దినమంతయునుండి వెనుక యజ్ఞాశ్వరక్షణకు వెళ్ళ వలయును. అని బభ్రువాహను డర్జునుని ప్రార్థించి నమస్కరించెను. అర్జునుడు బభ్రువాహనరాజును జూచి యిట్లనెను. పుత్రుడా! బభ్రువాహనుడా! నేను దీక్షవహించి యున్నాను. నీవు యెరుగవు కాబోలు నేను పట్టణములోపలికి రాగూడదు. గనుక వెళ్ళెదను. మీరు సుఖవంతులై యుండు డని అర్జునుడు చెప్పగా బభ్రువాహను డట్లగుగాక! యని చెప్పి అనేకవిధములుగా అర్జునుని పూజించి పంపించెను. అర్జునుడు తన భార్యలగు చిత్రాంగద ఉలూచుల అనుమతిని బొంది యజ్ఞాశ్వము వెంబడి వెళ్లుచుండెను. ఆగుర్రము సకలదేశములందును సంచరించుచు వెళ్ళుచుండెను. అట్లు వెళ్ళి రాజగృహమను జరాసంధుని పట్టణమునకు సమీపముగా పోయెను. జరాసంధుని మనుమడగు మేఘసంధి అర్జునునిమీదకు వచ్చి యుద్ధమునకు పిలిచెను.

## అర్జునుడు జరాసంధపౌత్రునితో యుద్ధముచేసి ఓడించుట

జనమేజయమహారాజా! జరాసంధుని మనుమడు మేఘసంధి యనువాడు బాల్యదశయం దున్నందున తన యొక్కయు, పరుల యొక్కయు, తారతమ్యము తెలియక అర్జునుని యుద్ధమునకు పిలిచి తొంట నే రథముమీద యెక్కి అర్జునుని యజ్ఞాశ్వమునకు అడ్డుపడి

అర్జునునితో యిట్లనెను. అర్జునా! స్త్రీలలోపల సంచరించువానివలె యీ గుర్రమును నీవు కొంచెమైనను భయములేక తీసికొని పోవుచున్నావు. ఈ గుర్రమును నేను పోనివ్వను, నాతో యుద్ధము చేసితివేని చేయుము అని మేఘసంధి చెప్పగా అర్జునుడు నవ్వుచు మగధదేశపు రాజగు మేఘసంధితో యిట్లనెను. మేఘసంధీ! నా అశ్వమునకు అడ్డమువచ్చువారలను నేను కృపగలిగి రక్షించుచున్నాను. నా మనస్సునందు కోపములేదు. ఎందుచేతననగా చెప్పెదను వినుము. మా యన్నయగు ధర్మరాజు క్రూరముగా రాజులను చంపవద్దనియు, మంచిచేత యుద్ధమును చక్కచేసికొని రమ్మనియు, నాతో చెప్పియున్నాడు. గనుక మాయన్న చెప్పిన ప్రకారము నేను ప్రవర్తించెదను. నీ యిష్టమేదియో అట్లే చేయుము. అని అర్జునుడు చెప్పగా ఆ మాటలను మేఘసంధి విని బదులుమాట చెప్పక తేజోరూపములైన అనేక బాణములను అర్జునునిమీద వేసెను. అర్జునుడు వాడి బాణముల చేత ఆ బాణములనన్నిటిని నరికి మేఘసంధియును రాకుమారునిమీద బాణము వేయుటకు యిష్టములేక వూరకుండెను. జనమేజయమహారాజా! అర్జునుని మనస్సునందు గల కృపాస్వభావము యేమని చెప్పవచ్చును? ఆ మేఘసంధి మరల కొన్ని బాణములను అర్జునుని మీద వేసెను. అందుకు అర్జునుడు కోపములేనివాడై వాడు వేసిన బాణములను చూచుచు, వాని సారథినైనను గుర్రములనైనను నొప్పించక వూరకుండెను. అట్లు వూరకున్న అర్జునుని బలహీనునిగా తలచి ఆ మేఘసంధి మదగర్వముచేత అర్జునునిదగ్గరకువచ్చి గొప్పవగు అనేక బాణములను అర్జునుని దేహమందు నాటించెను. అర్జునుడు కోపవంతుడైనను, మేఘసంధికి తగులకుండునట్లుగా కొన్ని బాణములచేత వాని సారథినిజంపి గుర్రముల ప్రాణములను పోగొట్టి రథమును తునకలుగాచీల్చి టెక్కెమును నరికి, ధనస్సును చూర్ణము చేసెను.

మేఘసంధి ఒక గదను తీసికొని త్రిప్పుచు మిక్కిలి ధైర్యసాహసముల చేత పరాక్రమము మూర్తివంతమై వచ్చెనో యనునట్లు అర్జునుని మీదకు వచ్చుచుండెను. అపుడు అర్జునుడు వానిమీద కోపము లేనివాడై ఒక విచిత్రమైన విల్లు, బాణమువలెనుండు బాణముచేత వానిగదను నరికివేసెను. మేఘసంధి యను మగధదేశము రాజకుమారుడు ఆశ్చర్యపడి నిలిచియుండెను. అప్పుడా అతిరథిక వర్యుడగు అర్జునుడు వానితో యిట్లనెను.

మేఘసంధీ! ఒకని ప్రాణములను తీసికొన వద్దని మాయన్న నాకు చెప్పియున్నందున నీమీద నేను బాణములు వేయలేదు. అందుచేత నీవిట్లు నాతో యుద్ధముచేయుటకు సమర్థుడవైతివి. అది యటుండనిమ్ము. రాజుల ధర్మప్రకారము నా అశ్వమునకు అడ్డమువచ్చి నాతో యుద్ధముచేసితివి. యింత మాత్రముచేత చాలదు. ఇక శాంతముగలిగి వెళ్ళుటమంచిది. అని అర్జునుడు చెప్పగా ఆ మాటలను మేఘసంధి విని నిశ్చయమని వూహించి భక్తిపూర్వకముగా అర్జునుని పాదసమీపమందు సాగిలపడి నమస్కరించెను. అర్జునుడు వానిని లేవనెత్తి కౌగిలియందు చేర్చుకొని యిట్లనెను. మేఘసంధీ! రాబోవు చైత్ర శుక్ల పూర్ణిమయందు ధర్మరాజు అశ్వమేధయజ్ఞము చేయును. అట్టి యజ్ఞమునకు నీవు సకల బంధువులను తీసికొని రావలయును. అని చెప్పగా ఆ మేఘసంధి అట్లు చేసెదనని చెప్పి ప్రీతి పూర్వకముగా అర్జునుని పూజించి పంపించెను. అర్జునుడును సంతోషించి మేఘసంధిని అతని పట్టణమునకు పంపించి యజ్ఞాశ్వము వెనుక వెళ్ళుచుండెను. ఆ గుర్రము క్రమముగా కళింగపాండ్రమ్లేచ్ఛ దేశములయందు సంచరించుచు వెళ్ళుచుండెను. ఆ దేశపురాజులును గుర్రమునకు అడ్డువచ్చిరి. అర్జునుడు వారిని ఓడించి వెళ్ళుచుండెను. గుర్రము చేదిదేశమందు సంచరించుచుండగా చేదిదేశపురాజగు శిశు

పాలుని పుత్రుడైన శరభుడనువాడు యుద్ధపూర్వకముగా వచ్చి అర్జునుని పూజించి అర్జునునిచేత యజ్ఞమునకు రమ్మని ఆదరింపబడి వెళ్ళెను. అర్జునుడు యజ్ఞాశ్వము వెంబడించి వెళ్ళుచుండెను. ఆ గుర్రము క్రమముగా కొంకణ కిరాతము మొదలగు దేశములయందు సంచరించుచు వెళ్ళుచుండగా ఆయా దేశపురాజులు అర్జునునిమీదకు యుద్ధమునకు వచ్చిరి. వారందరుని అర్జునుడు గెలుచుచు వెళ్ళుచుండెను. క్రమముగా కోసలదేశపురాజులను కాశీదేశపు రాజులను అర్జునుడు గెలుచుచు గుర్రమును వెంబడించి వెళ్ళుచుండెను. ఆ గుర్రము దశార్ణదేశపు దిక్కునకు వెళ్ళెను. ఆ దేశపు రాజగు చిత్రాంగదుడు అర్జునునితో యుద్ధముచేసి ఓడి అర్జునుని పూజించెను. చిత్రాంగదుని అర్జునుడు యజ్ఞమునకు రమ్మని చెప్పెను. గుర్రము నిషాదదేశమందు సంచరించుచుండగా ఆ దేశపు రాజగు యేకలవ్యుని కొడుకు సైన్యములతోటి అర్జునునిమీదకు యుద్ధమునకు వచ్చెను. అర్జునుడు క్రూరములగు బాణాగ్నులచేత రాజసైన్యములను చంపి చిక్కుపరచెను. ఆ నిషాదదేశపురాజు గర్వమదములచేత అర్జునునితో యుద్ధముచేసెను. అర్జునుడు ప్రకాశముగల బాణములచేత వాని గర్వమును పోగొట్టెను. అంతట ఆ రాజు మిక్కిలి వినయపూర్వకముగా అర్జునుని పూజించెను. అర్జునుడు ఏకలవ్యుని కొడుకును తనవశము చేసికొని యజ్ఞాశ్వము వెంబడి వెళ్ళుచుండెను. ఆ గుర్రము మరలి దక్షిణముఖముగా పోవుచు పౌండ్ర, ద్రవిళ, కేరళ కర్ణాట దేశములయందు తిరిగెను. ఆయారాజులు అర్జునుని మీదకు యుద్ధమునకు వచ్చిరి. వారిని అర్జునుడు సులభముగా వశపరచికొని వెళ్ళుచుండెను. ఆ గుర్రము అంతట సౌరాష్ట్ర దేశమునకు వెళ్లెను.

అర్జునుడు గుర్రము వెంబడి పోవుచు గోకర్ణ సమీపముగా వెళ్ళుచుండెను. పిమ్మట గుర్రము ద్వారకాపట్టణ సమీపమునకు

వచ్చెను. యాదవులందఱును సంతోషముగావచ్చి యర్జునకు నమస్కరించి పూజించిరి. అర్జునుడును వచ్చిన యాదవులకు ప్రతి నమస్కారముచేసి పంపించెను. అర్జునుడా గుఱ్ఱమును వెంబడించి పశ్చిమ సముద్ర తీరమునకుపోయి పంచనదముదాటి గాంధార దేశమునకు వెళ్లెను. గాంధారదేశపు రాజగు శకునికొడుకు దుర్మార్గ పగుట చేతను, బాల్యదశయం దుండుటచేతను సైన్యములను చేర్చుకొని యర్జునుని మీదకు వచ్చెను. అర్జునుడు కలహింపవద్దనిచెప్పి తనకు ధర్మరాజు చెప్పినమాటలను వానికి తెలిపెను. ఆ మాటను శకుని కొడుకు లక్ష్యపెట్టక యర్జునుని మీదకు వచ్చెను. అర్జును డతికోపముతో యెఱ్ఱనినేత్రములు కలవాడై బాణముల గుంపులను వేసి వాని యేనుగుల గుంపులను, గుఱ్ఱములగుంపులను, కాల్బలములను రథికులను చిక్కుపరచెను. శకుని కొడుకుయొక్క సైన్యములన్ని, క్రింద పడినవై కొన్ని చెదరిపోయెను. శకునికొడుకు మాత్సర్యముగలవాడై యర్జునునిమీద తీక్ష్ణములైన అనేక బాణములను వేసెను. వాని బాహుశక్తిని నర్జునుడు మనస్సునందు మెచ్చుకొని వానియందుగల కృపచేత యిట్లనెను.

## అర్జునుడు గాంధారదేశాధిశునితో యుద్ధముచేసి జయించుట

తమ్ముడా! మారాజగు ధర్మరాజు రాజులను చంపవద్దనినాకు ఆజ్ఞాపించి యున్నాడు. నీతో యుద్ధముచేయుటకు నాకుయిష్టము లేదు. నీవునామీదకు వచ్చినపుడు నేనునీతో యుద్ధముచేయక వెళ్ళిన యెడల నేను అపజయము పొందితినని ధర్మరాజు తలంచును గనుక నీమీద నేను కోపించుకొనకున్నపుడు నీవు యుద్ధముచేయరాదు. అని యర్జునుడు చెప్పినను వాడు వినక అనేక బాణములను నర్జునునిదేహమందు గ్రుచ్చెను. అర్జునుడు నవ్వుచు మంచి ఒక తీక్ష్ణబాణముచేత

వానికిరీటము క్రిందపడునట్లు చేసెను. ఆపవిత్రకార్యమును వానిసైని కులుచూచి తమలోతాము యిట్లని చెప్పుకొనిరి.

ఈ అర్జునుడు యీ శకునికొడుకును చంపుటకు యిష్టపడడు. చంపదలచినయెడల వీనిశిరస్సును క్షణమాత్రములో నరికివేయ గలడు, ఆహా! అర్జునునకు యింత కృపకలిగియున్నదిగదా ! అని ఆ సైనికులు చెప్పుకొనుచు శకుని కొడుకుదగ్గరకుపోయి వానిరథమును వెనుకకు తీసికొని కొంతదూరముబోయిరి. శకునికొడుకు మరహం కారముగలవాడై అర్జునునిమీదకు యుద్ధముకొరకై వచ్చెను. వాడు వచ్చినవెంటనే అదివరకు చెదిరిపోయిన వాని సైన్యములన్నియు మరలవచ్చి యర్జునుని చుట్టుకొని అనేక శస్త్రాస్త్రములను వేసిరి. అర్జునుడు తీక్ష్ణములైన బాణములచేత వారువేసిన శస్త్రాస్త్రములను నరికివేసి యనేకబాణములచేత వానిసైన్యములను గుఱ్ఱములను చంపుచు విజృంభించెను.

అర్జునుని కోపబాణములకు సహింపలేక వానిసైన్యములు పరుగెత్తెను. ఆ వృత్తాంతమంతయు తెలిసికొని ఆ శకునికొడుకును రక్షించుటకై వానితల్లియు, మంత్రులును, అర్జునునిదగ్గరకు వచ్చిరి. వారు శీఘ్రముగా శరణు శరణని చెప్పుచు యర్జునునకు నమస్కరించి నీటిచేత యర్జునుని పాదములు కడిగిరి. అర్జునుడు శకుని భార్యను పూరడించి మంత్రులకు సంతోషపుమాటలుచెప్పి శాంతముగా శకుని కొడుకుతో యిట్లనెను. రాజకుమారా! నీవు యీ ప్రకారము నా మీదకు వచ్చినపుడు నామనస్సునకు విచారముకలిగినది. ధర్మరాజు రాజులను చంపవద్దని నాతో చెప్పినపుడు అందరు వినుచుండగా సాధ్యమైనంతవరకు రాజులను చంపనని చెప్పివచ్చినాను. ఈ కార ణముచేత నీసైన్యములను చంపితినేగాని నిన్ను చంపలేదు. ముఖ్య ముగా గాంధారీధృతరాష్ట్రులను తలచి నిన్ను కాపాడితిని. అందు

వలన నింత కాలము నీతో యుద్ధముచేసితిని. ఇకనైనను శాంతుడ వైనయెడల మంచిది. ధర్మరాజుతో నీవు స్నేహముగలిగియుండ కూడదా! అని అర్జునుడు శకునికొడుకుతో చెప్పెను.

రాజకుమారా! రాబోవు చైత్రశుక్ల పూర్ణిమనాడు ధర్మ రాజు అశ్వమేధయజ్ఞము చేయగలడు. ఆ యజ్ఞమునకు నీవు సంతో షముతో రమ్మని. అని చెప్పి యజ్ఞాశ్వము వెంబడి వెళ్ళెను. అంతట ఆ గుర్రము హస్తినాపట్టణముతట్టు ముఖముంచి వెళ్ళుచుండెను. ధర్మరాజు చారులవలన అర్జునుడు సకలదేశములయందును సంచరిం చిన పద్ధతియంతయు విని సంతోషించెను. ధర్మము తప్పక అర్జునుడు యజ్ఞాశ్వమును రక్షించుకొని వచ్చుటకు ధర్మరాజు మిక్కిలి ప్రీతిని బొందెను. అర్జునుని వృత్తాంతమును ధర్మరాజు వినిన దినము మాఘ శుక్లపూర్ణిమయైయుండెను. ధర్మరాజు పెద్ద సభయందు కూర్చుండి తన తమ్ములైన భీమ నకుల సహదేవులను పిలిపించి భీముని ముఖము చూచి యిట్లనెను.

భీముడా! నీ తమ్ముడగు అర్జునుడు యజ్ఞాశ్వమును తీసికొని వచ్చుచున్నాడని యిప్పుడే వింటిని. మన యజ్ఞకాలమగు చైత్ర మాసము సమీపమునకు వచ్చియున్నది. గనుక నీవిప్పుడే లోకమందు గల మునులను రాజులను పిలిపించవలయును. శిల్పిజనులచేత యజ్ఞ శాలను కట్టింపుము. మన యజ్ఞమునకు వచ్చువారిలో తగినవారికి నానావిధములైన అనేక గృహములను కట్టింపుము. అని ధర్మరాజు భీమునితో చెప్పి పంపించెను. భీముడు వెళ్ళి బంగారు రత్నమయ ముగా యజ్ఞశాలను కట్టించెను. యజ్ఞముచూచుటకు వచ్చు మునుల కును రాజులకును నవరత్నములతోకూడిన బంగారు మయములగు నానావిధములైన గృహములు అనేకములు కట్టించెను. ఆ కట్టిన గృహములు చూచి అందరును భీముని మెచ్చుకొనిరి. భీముడు దేశ

ములయందుండెడి మునులను రాజులను యజ్ఞమునకు పిలువుడని అనేకమంది బ్రాహ్మణులను పంపించెను. ఆ బ్రాహ్మణులు మిక్కిలి భక్తిపూర్వకముగా వెళ్ళి సకలదేశపు రాజులను మునులను యజ్ఞమునకు రమ్మని పిలిచిరి. సకలదేశపు రాజులును, తమ తమ సైన్యముతోడను, సకల బంధుమిత్రులతోడను, ధర్మరాజు యొక్క యజ్ఞము జూచుటకు వచ్చిరి. అనేకమునుల గుంపులును తమ తమ శిష్యులను తీసుకొని వచ్చిరి. భూమండలమందు గల సకలరాజులును అనేకసంఘములును, తమ తమ సైన్య శిష్యులతో రాగా ధర్మరాజు పరమసంతోషముగలవాడై యెదురుగా వెళ్ళి అందరిని గౌరవించి పట్టణములోనికి పిలుచుకొని వచ్చెను. ధర్మరాజు ఆ వచ్చిన మునులకును, రాజులకును, వారి వారికి తగిన గృహములను చూపి ఆయా విడిది గృహములందు ప్రవేశపెట్టెను. అట్లు వచ్చినవారికి మంచి మంచి భోజనపదార్థములను పీటలు మొదలగు సాధనములను యిప్పించుచు అందరికిని సౌఖ్యములు కలుగజేయుచుండెను.

జనమేజయమహారాజా! ధర్మరాజు ఆ వచ్చిన మునులకు భక్తిపూర్వకముగా తానే వెళ్ళి కందమూలములను మంచి మంచి పండ్లను యిచ్చుచు, కమ్మని మాటలచేత వారికి ప్రీతి కలిగించుచుండెను. ఇట్లు ధర్మరాజు దేవేంద్రునితో సమానమైన ఐశ్వర్య విభవములు గలిగి అహంకార గర్వములులేక పెద్దలచేత స్తుతింపబడుచుండెను. ఆ యజ్ఞశాలను, నానావిధములైన గృహములను లక్షణసహితముగా కట్టిన శిల్పులకు ధర్మరాజు అనేకములగు బహుమతులు చేసెను. ఆ శిల్పుల పని నేర్పరితనములకు అందరును పొగడుకొనిరి. ధర్మరాజు భీముని పంపించి సకల కార్యములను చేయించిన పద్ధతిని జూచి కృష్ణుడు మిక్కిలి సంతోషము కలిగియుండెను. ఆ యజ్ఞమును చూచుటకు వచ్చిన రాజులందరును ధర్మరాజుచేయు యజ్ఞపద్ధతికి తగిన కార్యములను చూచి మిక్కిలి ఆశ్చర్యపడిరి.

చంద్రవంశమందు పుట్టిన ధర్మరాజు తన దేశముల మీదకు జనులను పంపించి, అనేక లక్షల గోవులను, బర్రెలను, తెప్పించి పశువులను చక్కగా మేపించుచు పాలు పిండుచుండెను. నానా దేశములనుండి వచ్చిన రాజులకును బ్రాహ్మణులకును సకల భోజనసౌఖ్యములను ధర్మరాజు కలుగజేయుచుండెను. జనులకు భోజననిమిత్తమై వండిన అన్నపురాసులు పర్వతములవలె నుండెను. నేతులు కాలువలు యేరులవలె నుండెను. సకలవిధ పదార్థములచేతను మనోహరమైన భోజన సౌఖ్యము కలిగి యుండెను. సకల జనులా రీతిని సౌఖ్యముగా నుండగా యజ్ఞకాలము సమీపించినది. జనమేజయ మహారాజా! ధర్మరాజుచేయు యజ్ఞకాలమందు ఒక లక్ష బ్రాహ్మణులు భోజనము చేసినయెడల ఒకసారి తనంతట తానే భేరీ మ్రోగును. ఇట్టి నియమముగల భేరీవాద్యము ధర్మరాజు యజ్ఞము చేయు దినములందు ప్రతినిమిషమందును మ్రోగుచుండెను. ఒక్కొ భేరీదెబ్బకు ఒక లక్ష బ్రాహ్మణులు భోజనముచేసిరని గురుతుకలదు. అట్టిది విరామములేక మ్రోగుచుండినప్పుడు ఎన్నిలక్షల బ్రాహ్మణులు భోజనము చేసియుందురో, ఆధర్మరాజు యజ్ఞమాహాత్మ్యమును చెప్పుటకు సాధ్యముకాదు.

జనమేజయ మహారాజా! ధర్మరాజుయొక్క అశ్వమేధ యజ్ఞమునకు, నాలుగు సముద్రముల మధ్యనుండు సకల భూమండలమందు గల జనులందరును వచ్చియుండిరి. సకల రాజులును, కిరీటములను సకల భూషణములను ధరించుకొని యజ్ఞమును చూచుటకు వచ్చియుండిరి. ఆరాజులనందరిని ధర్మరాజు కలియజూచి భీముని పిలిచి యిట్లనెను. భీమా! యీవచ్చిన రాజులనందరిని నీవే స్వయముగా పూజించుచుండుము. అని చెప్పగా భీముడు తన తమ్ములగు నకుల సహదేవులను చేర్చుకొని, వచ్చిన రాజులనందరిని గౌరవబహుమాన

పూర్వకముగా పూజించెను. కృష్ణుడు బలరామ సాత్యకి మొదలగు యాదవులతో గూడుకొని ధర్మరాజు దగ్గరకు వచ్చుచుండెను. ఆ యాదవులను ధర్మరాజుజూచి సంతోషించెను. కృష్ణుడును ధర్మరాజ భీములును, యీముగ్గురును యాదవు లందరిని పూజించిరి. కృష్ణు డర్జునుని ప్రసంగమును స్మరించి ధర్మరాజు ముఖము చూచి యిట్లనెను.

ధర్మరాజా! ద్వారకా పట్టణమునుంచి మనకు స్నేహితుడగు వాడొకడు వచ్చియున్నాడు. అర్జునుడు ద్వారకాపట్టణ సమీప మందు వెళ్ళుచుండగా తానుచూచితిననియు, నానా దేశము రాజులతో యుద్ధము చేయుట చేత అర్జునుని దేహము శుష్కించి యున్నదని చెప్పినాడు. కనుక అర్జునుడు సమీపమునకు వచ్చియుండును. తగిన కార్యములను జరుపుటకు ప్రయత్నింపుడు అని కృష్ణుడు చెప్పగా ధర్మ రాజు యిట్లనెను. మహాత్మా! కృష్ణా! నీయుత్తరువు ప్రకారము వెళ్ళిన అర్జునుడు శౌర్యధైర్య సాహసాది గుణములు గలవాడై సుఖియై వచ్చును గనుక యేయే కార్యములు చేయునలెనో ఆయాకార్యము లనునడిపింపుమని ధర్మరాజు చెప్పగా కృష్ణు డిట్లనెను.

## కృష్ణుడు ధర్మరాజుతో అర్జునుని సందేశమును చెప్పుట

ధర్మరాజా! ద్వారకనుంచి వచ్చిన మనుష్యునితో అర్జునుడు చెప్పిన మాటలను చెప్పెదను వినుము. స్నేహితుడా! నేను ధర్మరా జుతో విన్నపము చేసినట్లు యీచెప్పబోవు మాటలను చెప్పుము. సకల రాజులును యజ్ఞమును చూచుటకు వచ్చుచున్నారు. కొందరు పూర్వము మనకు విరోధులైనను, అందరిని పూజింపవలయునని చెప్పుము. మణిపూరపట్టణపు రాజగు బభ్రువాహనుడు నా కుమా రుడు. అతడు మంచిగుణవంతుడై నాయందు భక్తిగలిగి నాకు మేలు

చేసియున్నాడు. వానియందు కొంచెమైనను కీడు గలిగి యుండదు. వాడు మీపాదములను సేవించుటకు కాచుకొని యున్నాడు. బభ్రువాహనుడు మీకృపబడయ వలయునని చెప్పుము. అని అర్జునుడు ద్వారకనుండి వచ్చిన మనుష్యునితో నీతో చెప్పుమని చెప్పినట్లు నాకు చెప్పియున్నాడు అని కృష్ణుడు ధర్మరాజుతో చెప్పగా ఆమాటలకు ధర్మరాజు సంతోషించి కృష్ణునితో యిట్లనెను.

కృష్ణా! అర్జునుడిపుడు యజ్ఞాశ్వము వెంబడి వెళ్ళి అనేక దేశపు రాజులతో యుద్ధముచేసి బాధనొందియున్నట్లు నేను వినియున్నాను. భారతయుద్ధమందును అర్జునుడు భీష్మ ద్రోణ కర్ణాదులతో యుద్ధము చేసి అనేకకష్టములు పొందెను. ఆ పరమసౌఖ్య దేహముగల అర్జునుడు నానిమిత్తమై యిన్నికష్టములు పడెను. ఒక విషయమును యిప్పుడు నిన్ను అడిగెదను. అతని దేహము లక్షణ యుక్తముగా నున్న విషయమును నాకు దెలుపుము. అర్జును డెంత దుఃఖములన్ను పొందుటకు కారణమైన దేహావయవదోషము లున్నయెడల వాటిని నాకు దెలుపుము. ఈ విషయము నాకు తెలుపదగినయెడల తెలుపుమని ప్రశ్నింపగా కృష్ణు డిట్లనెను.

ధర్మరాజా! నీకుచెప్పతగని విషయము ఒకటైనను లేదు. గనుక అర్జునుడు యుద్ధవిషయక దుఃఖములను పొందుటకు అవయవ దోషమును చెప్పెదను వినుము. ధర్మరాజా! అర్జునుని దేహమందు అన్ని అవయవములు శుభలక్షణములే కలిగియున్నవి. అయినను ఒక లోపము కలదు అర్జునుని దేహప్రమాణమునకు కొంచెమధికముగా అతని పిక్కలుండును. ఇదియే లోపము. ఈ లోపమువలన అర్జును డనేక యుద్ధములం దమితమగు కష్టములను పొందెను. అంతియే కాని యితర శుభలక్షణముల వలన అర్జును డే విషయములోను ఎప్పుడును కూడ అశుభమును పొందనేరడని శ్రీకృష్ణుడు చెప్పగా

ధర్మరాజువిని ముఖముచూచి కృష్ణునితో అట్లగునని చెప్పెను. అప్పుడు ద్రౌపది మిక్కిలి ప్రీతితో కృష్ణునిచూచెను. ద్రౌపదిచూపు అర్జునుని దేహవిషయమైన వంపుయొక్క పద్ధతియని కృష్ణుడు తెలిసికొనెను. భీమ నకుల సహదేవులును సాత్యకి కృష్ణుడు మొదలగు యాదవులు అర్జునుని గుణములు పొగడుచు ఆదినమంతయు అతని గుణగణములు చెప్పుకొనుచు అదే గోష్ఠిలో గడపిరి. మరునాడు అర్జునుని దగ్గరనుంచి ఒక మనుష్యుడు కాలినడకనే వచ్చి ధర్మరాజునకు నమస్కరించి యిట్లనెను. ధర్మరాజా దేవా! రేపటిదినము అర్జునుడు యిక్కడకు వచ్చును. అర్జునుడు నన్ను పంపించంగా వచ్చినాను. రేపటిదినము హస్తినాపురమునకు వచ్చి ధర్మరాజుయొక్క పాద కమలములను సేవించుకొనెదనని చెప్పి నన్ను పంపినాడు. అని ఆమనుష్యుడు చెప్పగా ధర్మరాజు పరమసంతోషముకలవాడై సంతోషముచేత ఆనందబాష్పములు కలవాడాయెను. ధర్మరాజు దేహాము పులకాంకురమై యుండెను. ధర్మరాజు ఆ వచ్చిన మనుష్యునకు మిక్కిలి వెలగల వస్త్రములను అనేక భూషణములను వానికి కావలసినంత బంగారమును యిచ్చెను. సకల జనులును ఆనందసముద్రమందు మునిగినంత సంతోషము గలిగియుండిరి. హస్తినాపుర మందుండు జనులందరును యెప్పుడు తెల్లవారునో యెప్పుడు అర్జునుని చూడగలమోఅనితలచుచుండిరి. అంతటమరునాడుసూర్యోదయమైనతోడనే అర్జునుడు స్నానసంధ్యావందన అగ్నిహోత్రాది కార్యములను తీర్చుకొని యజ్ఞాశ్వమును ముందుంచుకొని హస్తినాపురమునకు వచ్చెను.

## అర్జునుడు యజ్ఞాశ్వముతో హస్తినాపురమునకు వచ్చుట

జనమేజయమహారాజా! యజ్ఞాశ్వము దేవేంద్రుని గుర్రమువలె నడచుచు రాగా ఆ గుర్రమును జనులందరు కన్నులపండువుగా

చూచుచుండిరి. అట్లు చూచుచున్న జనులు తమలో తాము చెప్పు కొనుచుండు మాటలను చెప్పెదను వినుము. ఈ గుఱ్ఱము తమ యిష్ట ప్రకారము సకలదేశములయందును సంచరించుచు వెళ్ళగా దీనివెం బడి వెళ్ళుటకు అర్జునునకు తప్ప మరియొకనికి సాధ్యముగాదు. ఆయా దేశములందు ఆయాదేశపురాజులు సైన్యములతో అడ్డుపడగా వారిని అర్జునుడు గడ్డిపరకలవలె అతిసులభముగా గెలుచుచు పోయెను. ధర్మరాజు ఆజ్ఞాప్రకారము రాజులను చంపక యేవిధముగానైనను గెలుచుచు వెళ్ళివచ్చెను. అర్జునుడు తాను ఒంటరిగా నుండెనని భయపడక రాజులను చంపక ధర్మరాజు ఆజ్ఞప్రకారముసకలదేశము లందును గుఱ్ఱమువెంబడి తిరిగి రక్షించుకొని వచ్చెను. ఇది మిక్కిలి ఆశ్చర్యముగా నున్నది. జనులారా! పూర్వము సగరుడు మొదలగు వారిని యిప్పుడు చెప్పుకొనగా మనము వినియుంటిమిగదా! అర్జును నితో సగరుడు మొదలగు మహారాజులను బలపరాక్రమములయందు సమానులు కాజాలరు. అర్జుననితో సమానమైన రథికుడు సర్వలోక ములయందును యిదివరకైనను, యికమీదనైనను పుట్టియుండడు. అర్జునుని సహాయమువలన ధర్మరాజు మనుష్యులకు సాధ్యముగాని మహిమను పొందియున్నాడు. ఆహా! ధర్మరాజుయొక్క భాగ్యమే భాగ్యముగాని మరియొకని భాగ్యముగాదు.

జనమేజయమహారాజా! అర్జునుడు వచ్చినపుడు హస్తినాపట్ట ణమందుగల జనులశబ్దము చంద్రోదయకాలమందు సముద్రధ్వనివలె నుండెను. అంతట హస్తినాపట్టణమందుగల జనులయొక్క సంతోష రూపముగా చెప్పుకొనెడి కలకలధ్వని యిదివరకెప్పుడైనను చూచిన వాడును, వినినవాడును లేడు. జనమేజయమహారాజా! యజ్ఞాశ్వ ముతో వచ్చుచున్న అర్జునుని జనులు పొగడుచున్న విధము చెప్పె దను వినుము. జనులారా! సకలరాజులును ద్రుపదరాజ పట్టణమునకు

వచ్చి చూచుచుండగా అర్జునుడు మత్స్యయంత్రమునునరికి ద్రౌపదిని తీసుకొనెను. అర్జునుడు దేవసైన్యముతో గూడివచ్చిన దేవేంద్రుని గెలిచి తన బాహుబలమువలన అగ్నిహోత్రునిచేత ఖాండవవనమును దహింపజేసెను. అతిభయంకరమగు యుద్ధముచేత శివుని మెప్పించి శివునివలన అర్జునుడు పాశుపతాస్త్రమును పొసికొనెను. అర్జును డొక్కడే వెళ్ళి భీష్మద్రోణ కర్ణాశ్వత్థామ దుర్యోధనాది మహారథి కులయొక్క పొగరును అణచి గోవులను తెచ్చి విరాటరాజునకు యిచ్చెను. అర్జునుడు ప్రతిజ్ఞ చేసి అతిఘోరయుద్ధమునందు తన ప్రతిజ్ఞా ప్రకారము సూర్యాస్తమయమునకు పూర్వమే సైంధవుని తల ద్రుం చెను. అని హస్తినాపురమందుండెడి జనులందరును సందడిగా చెప్పు కొనుచు తలలెత్తి అర్జునుని చూచుచుండిరి. అట్లు జనులు చెప్పు కొనెడి మాటలన్నియు అర్జునుడు వినుచు గంభీర మనస్సుగలిగి గుఱ్ఱ మును ముందునడిపించుకొనుచు యజ్ఞభూమికివచ్చెను. అంతకుముందే ధర్మరాజు భీమ నకుల సహదేవ కృష్ణ బలరాములు ధృతరాష్ట్రుని ముందుపెట్టుకొని అర్జునునకు యెదురుగా వెళ్ళిరి. అర్జునుడు యోగ క్షేమ సమాచారములచేత వారినందరిని సంతోషపరచెను. అర్జునుడు గాంధారీ కుంతీదేవులను జూచి యొాతకొట్టుకొపాము గట్టునకుజేరి శ్రమ తీర్చుకొనునట్లు ఒక మనోహరప్రదేశమందు కూర్చుండెను. అర్జు నుని చుట్టు అందరును కూర్చుండి సంతోషము గలిగియుండిరి.

ఆసమయమున బభ్రువాహనుడు తన తల్లులగు చిత్రాంగద ఉలూచులను వెంటబెట్టుకొని సకలవిభవములతో పరమసంతోష ముగా హస్తినాపట్టణమునకు వచ్చెను. అట్లువచ్చిన బభ్రువాహన రాజు ధర్మరాజు గృహమునకువెళ్లెను. అపుడు ధర్మరాజు భీమార్జున నకులసహదేవులును, కృష్ణబలరామ సాత్యకి మొదలగు యాదవులును తగినప్రకారము బభ్రువాహనునిజూచి సన్మానించిరి. బభ్రువాహ

నుడు అందరిని తగినమర్యాదలచేత పూజించెను. బభ్రువాహనుడు ధృతరాష్ట్ర గాంధారులకు నమస్కరించి కుంతీదేవి పాదములకు మ్రొక్కెను. కుంతీదేవి బభ్రువాహనునకు అనేక దీవనలిచ్చి కౌగలించుకొనెను. బభ్రువాహనుడు ధర్మరాజును సేవించుచుండెను. పాండవు లైదుగురును వేరువేరుగా బభ్రువాహనునకు సకల రత్న ఖచితమైన అనేకభూషణములును, గొప్ప వెలగల వస్త్రములును యిచ్చిరి. కృష్ణుడు బలరాముడు మొదలగు యాదవులును అనేక భూషణవస్త్రములను బభ్రువాహనునకిచ్చిరి. ఆ సమయమున చిత్రాంగద, ఉలూచులిద్దరును మొదట గాంధారికి నమస్కరించి పిమ్మట కుంతీదేవికి నమస్కరించిరి. కుంతీదేవి వారిద్దరిని దీవించి కౌగలించుకొని అనేక విధ రత్నఖచితభూషణముల నిచ్చెను. అటు పిమ్మట ఉలూచి చిత్రాంగద లిద్దరును తగినప్రకారము ద్రౌపది సుభద్రలను చూచిరి. ద్రౌపదీసుభద్రలు, చిత్రాంగద ఉలూచులను పూజించి పీటలు వేసి కూర్చుండబెట్టి వారితో సరససల్లాపపు మాటలసౌఖ్యమును అనుభవించిరి. జనమేజయమహారాజా! అశ్వమేధ యజ్ఞ సమయము సమీపమునకు వచ్చియుండెను. వేదవ్యాసమహాముని ధర్మరాజు దగ్గరకు వచ్చి యిట్లనెను. ధర్మరాజా! యీ దినమందు అశ్వమేధయజ్ఞమును ప్రారంభించుము. ఇపుడు ప్రారంభించుటకు శుభ ముహూర్తము ప్రారంభించినదని యాజ్ఞకులు చెప్పుచున్నారు. నీ యజ్ఞము మనోహరమైనది నీవును మహాధనవంతుడవైతివి. గనుక యజ్ఞదక్షిణలు మూడింతలుగా యిచ్చి మూడు యజ్ఞఫలములను పొందుము. అశ్వమేధముయొక్క అవబృథమనెడి స్నానము మిక్కిలి పరిశుద్ధమైనది. ఆ స్నానమువలన సకలపాపములు నశింప గలవు. భారతయుద్ధమందు జ్ఞాతిజనులను నీవు చంపినందుకు పాపము కలిగెనని వ్యర్థముగా సంశయించుచుంటివి. అట్టి సందేహాపాపము

లన్నియు యీ అశ్వమేధముయొక్క అవభృథస్నానమువలన నిశ్శేష ముగా నశింపగలవు. అని వేదవ్యాసమహాముని ఆజ్ఞాపించెను.

## ధర్మరాజు అశ్వమేధయజ్ఞము సుప్రయోగము జేయుట

జనమేజయమహారాజా! వేదవ్యాస మహాముని చెప్పగా ధర్మ రాజు యజ్ఞశాలకువచ్చి పరమసంతోష భక్తి ప్రీతిపూర్వకముగా అశ్వమేధమును నడిపెను. బృహస్పతితో సమానమైన యాజకులు వేదవిధిప్రకారము చక్కగా క్రియలను నడిపిరి. ఆ యజ్ఞమందు స్ఖలితము, అపహుతము మొదలగు దోషములు కలుగలేదు. ధర్మ రాజుచేసెడి అశ్వమేధమందు ఋత్విజులు జాగ్రతతో శాస్త్ర ప్రకా రము ప్రవర్గ్యమనెడి యజ్ఞసాధనమును చేసిరి. పిమ్మట యజ్ఞక్రియ లను వేదోక్త ప్రకారము చక్కగా నడిపిరి. అటుపిమ్మట వేదవాక్య ములచేత తగిన అభివృద్ధిని కలుగజేసిరి. సకల యజ్ఞ భోక్తయగు పరమేశ్వరుడైన కృష్ణుడు ప్రీతిపూర్వకముగా వుండుటచే యాజకులు చేయించిన క్రియలకు మెరుగుపెట్టినట్లయ్యెను. జనమేజయ మహా రాజా! ధర్మరాజు యజ్ఞమునకువచ్చిన జనులలో నానావిధ భోజన పదార్థములచేత తృప్తిబొందక పోయినవాడును ధనధాన్యాది పదార్థ ములనుపొంది తన దరిద్రమును పోగొట్టుకొనక వెళ్ళినవాడును యే పదార్థమునైనను కోరి తాను గోరినపదార్థములు పొందక వెళ్ళిన వాడును అదివరకు యెద్దియైనను దుఃఖముకలిగి యజ్ఞమునకు వచ్చి అట్టి దుఃఖమును విడునకపోయినవాడును, యీచెప్పినవారలు మందు నిమిత్తమై జల్లెడచేత గాలించునట్లు వెదకినను వొకడైనను కనపడడు ఆ వచ్చిన జనులతో సంతోషముగా కావలసిన పదార్థములను భక్షింపుడనియు. మీకు యేవస్త్రములు కావలయునో ఆ వస్త్రము లను కట్టుకొనుడనియు, మీకు యేవస్తువులు కావలయునో ఆ వస్తువు

లను తీసుకొనుడనియు మీకు యేదుఃఖములు యిదివరకుండెనో ఆ దుఃఖములన్నిటిని తెలిసి పోగొట్టుకొనుడనియు యీప్రకారము భీముడు చెప్పుచుండెను. జనమేజయమహారాజా! ధర్మరాజుయొక్క యజ్ఞసదస్యుల సభలోవుండెడి బ్రాహ్మణులలో వ్రతనియమము లేనివాడును, శిష్యులకు వేదము చెప్పలేనివాడును, వేదాంగములగు ఆరుశాస్త్రములను చదువనివాడును నొక్కడైనను లేడు. దేవేంద్రునిసభయందు దేవమునులున్నట్లు ధర్మరాజుయొక్క సదస్యసభయందు సర్వవేదశాస్త్రజ్ఞులగు పండితులుండిరి. ధర్మరాజుయొక్క అశ్వమేధయజ్ఞమును చూచుటకై దేవమునులువచ్చి సంతోషముగా జూచుచుండిరి. సకలగంధర్వులును వచ్చి ఆనందమును కలిగించెడి సంగీతములు పాడుచుండిరి. అప్సరస్త్రీలందరును వచ్చి మనోహరములగు నృత్యములు చేయుచుండిరి. సకలసిద్ధులువచ్చి పుష్పములు చల్లుచు ఆశీర్వదించుచుండిరి.

జనమేజయమహారాజా! ధర్మరాజు యొక్క అశ్వమేధయజ్ఞము షోడశమహారాజుల యజ్ఞములకంటె అధికవిభవములతోటి జరిగెను. యజ్ఞహోమముయొక్క గుండము, గరుడాకారముగా బంగారు యిటికలతో కట్టించిరి. ఆ గుండము పదునెనిమిది మూరల పొడుగుకలిగి, నాలుగుమూలలు గలిగియుండెను. దానియందు హోమము చేయగా అగ్నిజ్వాలలు ప్రజ్వలింపుచు మనోహరముగానుండెను. యజ్ఞమందు పశువులను కట్టివేయు స్తంభములు యూపములనబడును. ధర్మరాజుయొక్క అశ్వమేధమందు కనిరిచెట్టుయొక్క యూపములు ఆరును, గోలుగుచెట్టుయొక్క యూపములు ఆరును, మోదుగు చెట్టుయొక్క యూపములు రెండును, పిరిగి చెట్టుయొక్క యూపము ఒకటియు, యిట్లు యిరువదియొక్క యూపములు నిలిపిరి. శుభము కలుగు కొరకై అనేకమైన బంగారుమయములైన

స్తంభములను శాస్త్రప్రకారము యాజకులు నిలిపిరి. ఆ స్తంభము లకు నాలుగు కాళ్ళజంతువులను, పక్షులను జలమందు సంచరించు జంతువులను, శాస్త్రప్రకారము కట్టియుంచిరి. యీ ప్రకారము కట్టిన పశువులసంఖ్య మున్నూరు అయ్యెను.

## ధర్మరాజు వేదవ్యాసునకు యజ్ఞదక్షిణగా దన రాజ్యం బంతయు, నిచ్చుట

జనమేజయ మహారాజా! ధర్మరాజుయొక్క అశ్వమేధమందు శ్రేష్ఠమగు మంచి యూపమందు యజ్ఞాశ్వమునుకట్టి యుంచిరి. దానిచుట్టును పశుసంఘములు నిలిపిరి. ఆ విధమును చూడగా దక్ష ప్రజాపతియొక్క యజ్ఞపద్ధతి యిట్లే యుండునని తోచెను. ధర్మ రాజుయొక్క యజ్ఞమును చేయించు యాజకులలో వ్యాస మహా మునియు అతని శిష్యులును ముఖ్యులుగా ప్రకాశించిరి. ఆ యజ్ఞము నకు వేదవ్యాసుడు ఉపద్రష్టయై యుండెను. సర్వ పశువులను హింసించి పిమ్మట యాజకులు యజ్ఞాశ్వమును హింసించు సమయ మందు ద్రౌపదిని రప్పించిరి. అశ్వముయొక్క అవయవములయందు గల మాంసమును, దేవతలకు ఆహుతుల నిచ్చునప్పుడు ద్రౌపదీదేవి చేత చేయింపదగిన హుతములను చేయించిరి. అశ్వముయొక్క వపను హోమము చేయునపుడు అందుచేత గలిగిన మంచివాసనను ధర్మ రాజ భీమార్జున నకుల సహదేవులు వాసనజూచి పరమానందమును పొందిరి. నాభికి సమీపమందుండు వస్త్రమువంటి మేదస్సు వప యందురు. యజ్ఞముచేయించు ముఖ్యఉపాధ్యాయుని ఉపద్రష్ట యందురు. యజ్ఞము చేయించువారిని యాజకులనియు ఋత్విజు లనియు అందురు.

యజ్ఞాశ్వముయొక్క అవయవములను తగిన విధి ప్రకారము, యాజకులు హోమముచేసిరి. ఈ ప్రకారముగా వేదవ్యాసముని

సింహుడు ధర్మరాజుయొక్క అశ్వమేధయజ్ఞమును సుప్రయోగముగా జరిపెను. ధర్మరాజుచేత సర్వలోక హితముగా యజ్ఞము చేయించిన వేదవ్యాసుడు ధర్మరాజును గురించి వురుమువంటి కంఠధ్వనితో ఆశీర్వాదము చేసెను. అపుడు నారదాది దేవమును లందరును ధర్మరాజునకు దీవనలిచ్చిరి. ధర్మరాజు పరమభక్తితో సదస్య బ్రాహ్మణులకు కోటివేల నిష్కములు సంభావన యిచ్చెను. ధర్మరాజు తన సకల రాజ్యమును దివ్యజ్ఞానియగు వేదవ్యాస ముని సింహునకు సంభావనగా యిచ్చెను. ఒక పలమెత్తు బంగారు నాణెము నిష్కమనబడును. ధర్మరాజు తన సకల భూమిని వేదవ్యాసునకు సంభావన రూపమున యివ్వగా ఆ వ్యాసుడు సంతోషముగా తీసికొని పిమ్మట ధర్మరాజుతో యిట్లనెను.

ధర్మరాజా! నీ సకల రాజ్యమును నాకిచ్చితివి. మేము బ్రాహ్మణుల మగుటవలన ధనమును గోరెదమేగాని రాజ్యము నపేక్షింపము. గనుక నీ భూమిని నీవు తీసికొని మాకు యిష్టమైన ధనమునిచ్చిన యెడల మేలగును. భూమికి ఖరీదుగా బంగారము నిమ్ము. మేము బంగారము నపేక్షించు చున్నాము. అని వ్యాస మునీంద్రుడు చెప్పగా సకల రాజులును వినుచుండగా ధర్మరాజు వ్యాసునితో యిట్లనెను. మహాత్మా! వ్యాసమునీంద్రా! అశ్వమేధ యజ్ఞమందు భూమిని దక్షిణగా యివ్వవలెనని పెద్దలు చెప్పెదరు. గనుక అర్జునునిచేత జయింపబడిన సకల భూమిని ప్రీతితో ఋత్విక్కులకు యిచ్చినాను. అని ధర్మరాజు చెప్పి మరల వ్యాసునితో యిట్లనెను. మహాత్మా! వ్యాసమునీంద్రా! నేను అడవికివెళ్ళి సుఖముగా వుండెదను. బ్రాహ్మణసొత్తైన భూమిని, నేను కొనను. అని యిట్లు ధర్మరాజు చెప్పగా భీమార్జున నకుల సహదేవులును, ద్రౌపదియు వ్యాసునితో యిట్లనిరి.

మహాత్మా! వ్యాసమునీంద్రా! మీరు మరియొక మాట చెప్పక భూమిని తీసికొనవలయును. అని చెప్పిరి. సకల జనులును సంతోషముతో దేహములయందు పులకాంకురము గలవారై సంతోష బాష్పములను పొందిరి. అప్పుడు ధర్మరాజును ఆకాశవాణి కీర్తించెను. సకల జనులును స్తుతించిరి. వేదవ్యాస మహాముని ధర్మరాజును పొగడెను. బ్రాహ్మణులందరును వినుచుండగా ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! మేము భూమిని అమ్మెదమని చెప్పినపుడు నీవు కొనవచ్చును. ఇట్లు మావలన కొనుటచేత దోషము లేదు. గనుక యీ బ్రాహ్మణులందరును యీ భూమిని నీకు విక్రయించుటకు అపేక్షించి యున్నారు. నీవు ప్రీతిచేత యీ బ్రాహ్మణులకోరికను తీర్చవలయును. అని వేదవ్యాసుడు ధర్మరాజుతో చెప్పగా కృష్ణుడు ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! యీవ్యాసమహామునిని ఆజ్ఞాప్రకారము చేయుము. అని కృష్ణుడు చెప్పగా ధర్మరాజు తనతమ్ముల అనుమతిని పొంది భూమిని కొనుటకు సమ్మతించెను.

ధర్మరాజు కోటికోట్ల నిష్కములు తెప్పించి కుప్పబోసి యీ కుప్ప భూమియొక్క ఖరీదని చెప్పి ఆ ధనమంతయు వేదవ్యాసునకు సమర్పించెను. ఆ మహాధనమును వేదవ్యాసుడు తీసికొని ఋత్విగ్జనులకు పంచిపెట్టెను. ధర్మరాజు బంగారుమయములైన స్తంభములును అరుగులును బంగారు తోరణములును నానావిధములైన బంగారు పాత్రలును, బంగారు కడ్రలును. బంగారు మంచములును, బంగారు పీటలు మొదలగున వన్నియు బ్రాహ్మణులకు ప్రీతిపూర్వకముగా యిచ్చెను. బ్రాహ్మణులకు యిచ్చినపిమ్మట రాజులకును, వైశ్యులకును, శూద్రులకును, వేశ్యలకును, తురకవాండ్రకును, వారి వారికి కావలసినంత ధనమిచ్చెను.

జనమేజయమహారాజా! ఇట్లు సకల జనులు కావలసినంత బంగారమును మోసికొని తమతమ నివాసములకు వెళ్ళుచు ధర్మ

రాజును పొగడుకొనుచు వెళ్ళిరి. ధర్మరాజుయొక్క వితరణగుణము మరియొక మనుష్యున కున్నట్లు శోధదము. ధర్మరాజుయొక్క దాన గుణములతో సమానమగు గుణముకలవాడు వేరొకడున్నాడని చెప్పి నను నమ్మతగదు. ధర్మరాజును రెండవ మదన్మహారాజని చెప్ప వచ్చును. జనమేజయమహారాజా! వేదవ్యాసమునీంద్రుడు తన యాజ్ఞికభాగమునకు వచ్చిన ధనమును కుంతీదేవికి ప్రీతితోయిచ్చెను. కుంతీదేవి ఆ ధనమంతయు. ధర్మకార్యములయందు ఉపయోగించెను. ధర్మరాజు సకలరాజులను బంధువులను చేర్చుకొని అవబృధస్నానము చేసి సకల పాప సంశయములను విడిచి మహాపుణ్యాత్ముడై స్వర్గ లోకమును జయించి ప్రకాశించుచుండెను. ధర్మరాజు వేదవ్యాసముని యొక్క పాదములకు సాగిలపడి నమస్కరించి అనేకవిధములుగా వ్యాసుని స్తుతించెను. వేదవ్యాసమునిసింహుడు ధర్మరాజుయొక్క అనుమతిని పొంది తన శిష్యసహితముగా అంతర్ధానమాయెను. జనమేజయమహారాజా! ధర్మరాజు తన తమ్ములను సకల రాజులను తనచుట్టును కూర్చుండబెట్టుకొని యుండగా నక్షత్రములలో పరిపూర్ణ చంద్రుడు ప్రకాశించునట్లు ఉండెను.

## ధర్మరాజు యజ్ఞమునకువచ్చిన రాజులను సన్మానించుట

జనమేజయమహారాజా! ధర్మరాజు యజ్ఞమునకు వచ్చిన రాజుల కందరికిని రత్నభూషణములను, యేనుగులను, గుఱ్ఱములను, వేశ్యాస్త్రీలను, కుబేరునివలె యిచ్చెను. బభ్రువాహనునకు విశే షములగు మంచి వస్తువుల నిచ్చి, గౌరవించి అతని పట్టణమునకు పంపించెను. చిత్రాంగద, ఉలూచులిద్దరును అర్జునుని దగ్గర నిలిచి యుండిరి. బభ్రువాహనుడు మాత్రము తన పట్టణమునకు వెళ్ళెను. దుర్యోధనుని చెల్లెలగు దుస్సల తన మనుమని తీసికొని అదిష్ఠానకే

యజ్ఞముచూచుటకు వచ్చియుండెను. ధర్మరాజు దుస్సల మనుమని సింధుదేశమునకు పట్టాభిషేకము జేసెను. ఆయాదేశపు సకల రాజులును, ఆయాదేశములను యెప్పటివలె పరిపాలించునట్లుగా ధర్మరాజు ఆజ్ఞాపించెను. ఈ ప్రకారము సకలరాజులను ధర్మరాజు గౌరవించి పంపెను. ధర్మరాజుచేసిన గౌరవ బహుమానములనుపొంది వారివారి దేశములకు వెళ్ళిరి. ధర్మరాజు అధికశ్రేష్ఠవస్తువిస్తారములను కృష్ణున కిచ్చి దేవోపచారములచేత పూజించి కృతార్థుడాయెను. పిమ్మట ధర్మరాజు నానావిధ రత్నములచేత మనోహరములైన పూజలను బలరామునకుచేసి తృప్తిపరచెను. సాత్యకి మొదలగు యాదవులకు అనేక విధములైన పదార్థములను విశేషముగా యిచ్చెను. యాదవు లందరును పాండవుల యనుమతిని బొంది ద్వారకా పట్టణమునకు వెళ్ళిరి. ధర్మరాజు నానాదేశములనుండి వచ్చిన జనులకు అన్నపానాదుల చేతను వారి వారికి కావలసిన పదార్థముల నిచ్చుటచేతను అందరిని తృప్తిపరచి పంపించెను. జనులందరును వెళ్ళునపుడు గొప్ప ధ్వనితో ధర్మరాజును పొగడుకొనుచు వెళ్ళిరి. ఆ శబ్దమువలన దిక్కులన్నియు ప్రతిధ్వనిగా మ్రోగెను. ధర్మరాజు యజ్ఞమునకు వచ్చిన జనులనందరిని ఆనందసముద్రమందు మునుగునట్లుజేసి అందరిని పంపించి తాను మంగళ వాద్యములతోడను ఆటపాటలతోడను ఆనందమును కలిగించు సంగీత ధ్వనులనువినుచు తన గృహమునకు వచ్చెను. అని ధర్మరాజుయొక్క అశ్వమేధ యజ్ఞవిధానమునంతయు వైశంపాయన మునీంద్రుడు జనమేజయ మహారాజుతో చెప్పగా జనమేజయుడు వైశంపాయన మునిని జూచి యిట్లనెను. వైశంపాయన మునీంద్రా! మా తాతయగు ధర్మరాజుయొక్క యజ్ఞసమయమందు ఆశ్చర్యము కలిగించిన విషయములు యేమిజరిగినవో చెప్పుమని ప్రశ్నించగా వైశంపాయన మునీంద్రు డిట్లనెను. జనమేజయ మహా

రాజా! ధర్మరాజు యజ్ఞముచేసి బ్రాహ్మణులకధికధనమిచ్చిసంతోష పరచిన సమయమందు అందరు జనులును ఆశ్చర్యపడిరి. ధర్మ రాజు ఆనందించునట్లుగా అతనిమీాద దేవతలు పుష్పవర్షము గురి పించిరి.

## నకులము సక్తుప్రస్థ చరిత్రమును బ్రాహ్మణులకు చెప్పుట

ఓ జనమేజయ మహారాజా! ఆ సమయమున ఒక బొక్కలో నుండి ఒక ముంగిసవచ్చి బ్రాహ్మణులనడుమ నిలిచి యిట్లనెను. బ్రాహ్మణులారా! సక్తుప్రస్థుడను బ్రాహ్మణునియొక్క ధర్మములో లేశమాత్రమున కైనను ఈ అశ్వమేధము సమానము కాజాలదు. అని ఆముంగిస చెప్పగా బ్రాహ్మణులందరును ఆశ్చర్యపడి ముంగిసను జూచి యిట్లనిరి. ముంగిసా! ధర్మరాజుయొక్క అశ్వమేధ యజ్ఞము మంత్ర తంత్రములచేత సమగ్రముగా జరిగెను. ధర్మరాజు నానావిధ ములగు అనేకదానములను చేసెను. మహాధనానాది పదార్థములను ఖర్చు పెట్టెను. యజ్ఞము సకల విధులచేతను సమగ్రముగా జరిగి లోకముచేత స్తుతించబడెను. ధర్మరాజునకు గల భక్తిశ్రద్ధ వినయ ప్రీతులకు దేవమునులు సంతోషించిరి. సర్వావిధముల చేతను యజ్ఞము శ్రేష్ఠమైయుండగా ఏలోపముచేత యీా యజ్ఞము హీన మని చెప్పితివో తెలియలేదు స్పష్టముగా తెలియ జెప్పుమని సదస్య బ్రాహ్మణు లడుగగా వారితో ముంగిస యిట్లనెను. సదస్య బ్రాహ్మణులారా! జెప్పెదను వినుడు.

ధర్మభూమియని ప్రసిద్ధికెక్కిన ఈకురుక్షేత్రమందు పూర్వము సక్తుప్రస్థుడను బ్రాహ్మణుడు, అతనిభార్య, కుమారుడు, కుమారుని భార్య, నలుగురును, పర్ణశాల యేర్పరచుకొని తపస్సుచేయుచు, ఉంఛవృత్తివలన అతి కష్టముతో జీవితము గడపుచుండిరి. అప్పు

డొకానొక సంవత్సరమున వర్షము బొత్తిగా కురియక గొప్ప కరువు వచ్చెను. అంతట వారి నలుగురికిని జీవనము జరుగక మిక్కిలిగా కష్టపడిరి. అంతట వారు నలుగురును వెళ్ళి గడ్డివలన ఫలించిన ధాన్యమును ఏరుకొని తెచ్చి జీవనము చేయుచు దానివలన అకలితీరక శ్రమపడుచుండిరి. అప్పుడానలుగురును ఒకనాడు మూడుజాములకు గడ్డిధాన్యములను ఏరుకొని వచ్చి ఆ తెచ్చుకొనిన ధాన్యమునంతియు పిండిచేసికొనిరి, ఆ పిండి నాలుగు మానికలుమాత్రమే అయ్యెను. అంతట వారు నలుగురును పేలపిండిని భక్షింపదలచి అనుష్ఠానములను తీర్చికొనివచ్చిరి. ఆ పేలపిండిని నలుగురును నాలుగుమానికలు పంచుకొనగా ఒక్కొక్క మానికపిండి వచ్చెను. వారట్లు పంచుకొని తినబోవుసమయమున ఒక బ్రాహ్మణుడు అతిథిగా వచ్చెను.

## యముడు సక్తుప్రస్థునికడ కతిథియై వచ్చుట

అతిథిని సక్తుప్రస్థుడు చూచి, యెదురుగా వెళ్ళి తన పర్ణశాలకు తీసికొనిపోయి భక్తితో పీటమీాద కూర్చుండబెట్టి కాళ్ళుకడిగి పూజించి యిట్లనెను. మహాత్మా! మునీంద్రా! నేను ధర్మమార్గముచేత పిండిని సంపాదించుకొని తెచ్చినాను. పిండిని నీవు భక్షించి ఆకలి తీర్చుకొనుమని తన భాగమునకువచ్చిన మానెడు పేలపిండిని అతిథి కిచ్చెను. అతిథి మానెడు పేలపిండిని భక్షించి తృప్తిబొందకుండెను. సక్తుప్రస్థుడు విచారపడుచు అతిథి తృప్తిబొందలేదు. దేనిచేత యీాయన తృప్తిబొందునో తెలియదని డోలాయమానమగు మనస్సు గలిగియుండెను. ఆతనిభార్య తన భర్తయొక్క అభిప్రాయమును తెలిసికొని యిట్లనెను. హృదయేశ్వరా! సక్తుప్రస్థమునీంద్రా! నాపాలికివచ్చిన మానెడు పేలపిండినిచ్చెదను. ఈ పిండిని అతిథికి

యిచ్చి తృప్తి జేయుమని చెప్పగా, ఆసక్తుప్రస్థుడు తన భార్యయొక్క శ్రమయు, ఆకలియు చూచుచు దానితో యిట్లనెను. భార్యామణీ! మృగములు పక్షులు మొదలగు జంతువులును తమతమ ఆహారములు తెచ్చి తమ భార్యల కిచ్చుచున్నవి. అట్లుండగా నీవు భక్షింపదలచిన పిండిని నేను తీసికొనరాదు. తన భార్యకు సంతోషము కలిగించని దుర్మార్గుడు నరకమును పొంది యమభటులచేత బాధింపబడును. అని సక్తుప్రస్థుడు చెప్పగా అతని భార్య యిట్లనెను.

మహాత్మా! ప్రాణనాథా! స్త్రీకి తన భర్తయే చుట్టమగును. భర్తయే పక్కమగును. భర్తయే స్నేహితుడు. అతడే తల్లి. అతడే తండ్రి, భర్తయే దైవము. భర్తయొక్క కార్యమును అవశ్యముగా భార్య జరుపవలయును. అట్లు జరుపుట స్త్రీకి ధర్మమైయున్నది. నీవు ఆకలి కలిగియున్నపుడు యీ పేలపిండి నేను భక్షింపరాదు. గనుక నాపాలి కిచ్చిన పేలపిండిచే ఈ మహాత్ముడగు అతిథిని తృప్తి పరుపుము అని చెప్పి అతని భార్య సక్తుప్రస్థునకు పేలపిండి నిచ్చెను. అంతట అతడు సంతోషించి ఆ పేలపిండిని తీసికొనిపోయి అతిథితో యిట్లనెను. మహాత్మా! బ్రాహ్మణోత్తమా! నీకు ఆకలి తీరినట్లు కనబడలేదు. గనుక యీ పిండినిగూడా భక్షింపుమని భక్తితో యిచ్చెను. అతిథి సంతోషముగా తీసికొని పేలపిండిని భక్షించి తృప్తిబొందలేదు. అతిథితిని జూచి సక్తుప్రస్థుడు విచారపడుచుండెను. అతని కొడుకు వచ్చి సక్తుప్రస్థునితో యిట్లనెను.

మహాత్మా! తండ్రీ! యిదిగో నాపాలికి వచ్చిన పేలపిండిని యిచ్చెదను. పిండిని అతిథి కిచ్చి తృప్తిపరుపుము. తండ్రియొక్క మనోభావమును సంతోషపరచుట కొడుకునకు ధర్మమై యున్నదిగనుక పిండిని అతిథి కిచ్చి ఆయన ఆకలిని తీర్చుమని చెప్పగా వానితో తండ్రి యిట్లనెను. పుత్రుడా! పుత్రునకు యెంతవయస్సు వచ్చినను పుత్రుడు

తండ్రికి బాలుడుగానే యుండును. బాలురకు ఆకలి అధికముగా నుండునుగనుక నీ పాలికిచ్చిన పిండిని తీసికొనుట నాకు న్యాయము కాదు. అని తండ్రియైన సక్తుప్రస్థుడు చెప్పగా కుమారుడిట్లనెను. తండ్రీ! తండ్రియే పుత్రుడుగా పుట్టునని పెద్దలవలన వినుచుందును. గనుక నన్ను రక్షించుకొనుటకై నిన్ను మొదట రక్షించుకొన వలయును. ఈ పిండిని అతిథి కిచ్చి నన్ను రక్షింపుమని ప్రార్థించెను. కుమారుడు చెప్పిన మాటలకు సక్తుప్రస్థుడు సంతోషించి తనపుత్రుని వలన పేలపిండిని తీసికొని అతిథి కిచ్చెను. అతిథి ఆపేలపిండిని భక్షించి దానిచేత ఆకలితీరనందున తృప్తి బొందకుండెను. అట్టి అతిథినిచూచి సక్తుప్రస్థుడు మనోదుఃఖము గలిగి యీ అతిథిని యెట్లు తృప్తిపరచెదనో అని చింతించుచుండెను. ఆసమయమందు కోడలువచ్చి సక్తుప్రస్థునితో యిట్లనెను. మామగారూ! యిదిగో నాపాలికి వచ్చినపేల పిండిని అతిథికిచ్చి తృప్తికలిగింపుడని చెప్పగా ఆ చిన్నదానిని జూచి సక్తుప్రస్థు డిట్లనెను. కోడలా! అయ్యో! ఆకలిచేత నీదేహముయొక్క అవయవములు శుష్కించి వాడియున్నవి. నీ ముఖము శ్రమజెంది యుండగా నీపాలికి వచ్చిన పిండిని నేను తీసికొనుట ధర్మముగాదని చెప్పగా కోడలు మరల యిట్లనెను. మహాత్మా! మామగారూ! నాభర్తయే నాకు గురువు. మీరు నాభర్తకు గురువులు. నేను మీయుద్దరికిని శుశ్రూషలు చేయుచుండవలయును. నాదేహముయొక్క అవయవములచేత మీకు సంతోషముగా శుశ్రూషలు చేయుచుండుటయే నాకు పరమధర్మము. గనుక నాయందు కృపనుంచి యీ పిండిని అతిథికిచ్చి నన్ను రక్షింపుడని కోడలు చెప్పగా ఆమాటలకు సక్తుప్రస్థుడు సంతోషించి పిండినితీసికొని అతిథి కిచ్చెను. అతిథి ప్రీతిచేత [illegible]పిండిని తీసికొని భక్షించి తృప్తినిబొందెను. అతిథి అంతట సక్తు[illegible]తో యిట్లనెను.

సక్తుప్రస్థ మునీంద్రా! నీ వ్రత స్వభావమునకు నేను మెచ్చుకొంటిని. నేను ధర్మదేవతను. నిన్ను చూచుట కొరకు యిచ్చుటకు వచ్చినాను. నీవు అతిథులయందు శ్రద్ధాభక్తి వినయ శాంతకరుణా సక్తులను కలిగియున్నావు. దేవతలందరును ఆకాశమందుండి నీవు నాకిచ్చిన పిండిని గురించి మెచ్చుకొని ఆశ్చర్యము కలిగి చూచుచున్నారు. అని ధర్మదేవత సక్తుప్రస్థునితో చెప్పి ఆకాశమందుండు దేవయక్ష సిద్ధాదులను చూపించెను. ఆసమయమున దేవేంద్రుడు మెచ్చుకొని పుష్పవర్షము కురిపించెను. ఆకాశమందు దేవవాద్యములు మ్రోగెను.

## యముడు సక్తుప్రస్థుని బ్రహ్మలోకమునకు పొమ్మనుట

ముంగిస యీరీతిగా సదస్య బ్రాహ్మణులతో చెప్పి మరల బ్రాహ్మణులనుగూర్చి యిట్లనెను. బ్రాహ్మణులారా! ధర్మదేవత సక్తుప్రస్థునితో యిట్లనెను. సక్తుప్రస్థమునీంద్రా! నిన్ను జూచుటకు సప్తమహామునులు అపేక్షించియున్నారు. నీవు ప్రజ్ఞచేత ఆకలిని జయించితివి. ఆశను విడిచితివి. భార్యాపుత్రులను జూడక అతిథి రూపముతో వచ్చిన నన్ను ప్రీతితో పూజించితివి. ఆపుణ్యమునకు నీవు భార్యాపుత్రులు కోడలితోగూడ బ్రహ్మలోకమునకు వెళ్లుము. నిన్ను బ్రహ్మ సభకు రప్పింపవలెనని బ్రహ్మదేవుడు ప్రీతిచేత నీకు విమానమును పంపించును. సక్తుప్రస్థ మునీంద్రా! గొప్పదానములైనను అశ్వమేధాది యజ్ఞములైనను ధర్మమార్గప్రవర్తనతో సమానములు కాజాలవు. ధర్మమార్గముచేత సంపాదింపబడిన పదార్థము కొంచెమైనను అట్టిపదార్థము శ్రేష్ఠమైనదగును. దానిని యోగ్యకాలములందు అతిథులకు యిచ్చినయెడల మహాపుణ్యము కలుగుచున్నది.

అని అతిథులకు యిచ్చినయెడల మహాపుణ్యము కలుగుచున్నది.

అని అతిథి రూపముగనుండు ధర్మదేవత సక్తుప్రస్థునితో జెప్పుచు తన దివ్య రూపమును చూపెను. అపుడు నవరత్న ఖచితమైన దివ్యవిమా

నము, ఆకాశమందు కనబడెను. ఆ విమానమును మునులందరును చూచి ఆశ్చర్యపడిరి. అసక్తుప్రస్థుడును, అతని కోడలును, అతని భార్యాపుత్రులును, పరమానందము గలవారై ధర్మదేవతకు సాష్టాంగముగా నమస్కరించిరి.

## సక్తుప్రస్థుడు సకుటుంబముగా బ్రహ్మలోకమునకు బోవుట

ధర్మదేవత సక్తుప్రస్థునితో యిట్లనెను. సక్తుప్రస్థమునీంద్రా! అదిగో! బ్రహ్మదేవుడు పంపిన విమానమునుచూడుము. నీ నిమిత్తమై ఆ విమానము భూలోకమునకు వచ్చినది. గనుక నీవును నీభార్యయు నీపుత్రుడును నీ కోడలును, ప్రీతిపూర్వకముగా యీ విమానమునుయెక్కి బ్రహ్మదేవుని సభకు వెళ్ళవలయును. అని ధర్మదేవత చెప్పగా అపుడు సక్తుప్రస్థుడు తన కుటుంబ జనులగు ముగ్గురితోకూడా ఆ విమానమునెక్కి బ్రహ్మలోకమునకు వెళ్ళెను. ధర్మదేవత వారి నలుగురిని బ్రహ్మలోకమునకు పంపించి తన నివాసమునకు వెళ్ళెను.

బ్రాహ్మణులారా! యీ జరిగిన వృత్తాంతమంతయు, నేను చూచుచు నానివాసస్థలమగు బొక్కలోనుంచి వెలుపలికి వచ్చితిని. సక్తుప్రస్థునియొక్క పేలపిండి వాసనయు, అతిథి పాదములు గడిగిన నీళ్ళును నాదేహమునకు సోకినవి. అట్లు సోకుటచేత, ఆ సక్తుప్రస్థుని పుణ్యమహిమవలన, నాతలయు, ఒక ప్రక్కయు బంగారు మయములై యున్నవి. నేను ఆశ్చర్యపడి నా దేహముయొక్క యితర భాగమును బంగారు మయము చేసికొనదలచి సకల పుణ్యభూములకును, యజ్ఞములు చేసెడి స్థలములకును వెళ్ళుచుంటిని. ఎక్కడికి వెళ్ళినను నాదేహముయొక్క రెండవప్రక్క బంగారుమయము కాకపోయెను. పరమధర్మాత్ముడగు ధర్మరాజు యజ్ఞముచేయుచున్నాడని విని యిక్కడికి వచ్చితిని. ఇక్కడకు వచ్చినను నా దేహముయొక్క

రెండవప్రక్క బంగారుమయము కాలేదు. నేను ఆశపడి వచ్చినం దుకు నా ఆశ వ్యర్థమాయెను. ఈ ధర్మరాజుయొక్క అశ్వమేధ మందు కొంచెమైనను విశేషము కనబడలేదు. ఆ కారణమువలన ఉంఛవృత్తి చేత జీవించెడి ఆసక్తుప్రస్థుని ధర్మములో లేశమాత్రమున కైనను ధర్మరాజుయొక్క అశ్వమేధము సమానము కాదని చెప్పి తిని. అని ముంగిస ధర్మరాజుయొక్క సదస్య బ్రాహ్మణులతో చెప్పి కనబడినదికాదు. ఎటు పోయిననో తెలియలేదు. అని వైశంపాయ నుడు జనమేజయునితో చెప్పి మరల యిట్లనెను. జనమేజయ మహా రాజా! ధర్మరాజుయొక్క అశ్వమేధ యజ్ఞమందు ఈ యాశ్చర్యము జరిగినది. అని చెప్పగా జనమేజయు డిట్లనెను. వైశంపాయనము నీంద్రా! రాజులు యజ్ఞములు చేయుటచేతను, మునులు తపస్సుచే తను. బ్రాహ్మణులు శాంతముచేతను. కీర్తిపొందుదురని వినియున్నాను పూర్వపు మహారాజులందరును యజ్ఞములుచేసి కీర్తినిబొంది పుణ్య లోకములకు బోయిరి. పూర్వపు రాజులకంటె ధర్మరాజు అధికవిభ వముతో అశ్వమేధమును చేసెను. గుణములయందు పూర్వపు రాజులకంటె ధర్మరాజు మంచిగుణవంతుడు, సత్యపరిశుద్ధి, భక్తిశ్రద్ధ వినయాది గుణములు ధర్మరాజును సర్వదా ఆశ్రయించి యుండును. ధర్మరాజు చేసిన యజ్ఞమును వేదవ్యాసాది మహామును లందరు మెచ్చికొనిరి. ధర్మరాజు దేవేంద్రునితో సమానుడై అశ్వమేధ మును చేసెను. అట్టిధర్మరాజుయొక్క అశ్వమేధము ఆ ముంగిసచేత నిందింప బడుటకు కారము తెలియలేదు. ఆ కారణమును చెప్పు మని జనమేజయు డడుగగా వైశంపాయను డిట్లనెను.

## వైశంపాయనుడు అహింసాధ్వరము ఉత్తమమని చెప్పుట

జనమేజయమహారాజా! ధర్మరాజు చేసిన అశ్వమేధయజ్ఞము నీవు చెప్పినప్రకారము సర్వవిధముల చేతను శ్రేష్ఠమైనది. అయినను

ఒక్క విషయమును చెప్పెదను చక్కగా వినుము. హింసారూపమైన యజ్ఞముకంటె అహింసతో గూడిన తపోయజ్ఞము శ్రేష్ఠమైనది. ఈ అభిప్రాయమునే ఆముంగిస చెప్పినది. ఆ ముంగిస అసత్యమును చెప్పలేదు. ఆ సక్తుప్రస్థుని పుణ్యాధర్మమువలన ముంగిస దేహములో ఒకప్రక్క బంగారుమయమయ్యెననియు చెప్పెను. ముంగిసయొక్క తక్కిన దేహము బంగారుమయముకాలేదు. అందుచేత ధర్మరాజు యజ్ఞము అహింసాధర్మముతో గూడిన సక్తుప్రస్థుని పుణ్యముకంటె తక్కువయని స్పష్టమయ్యెను. ఈవిషయమై ఒక వృత్తాంతముగలదు చెప్పెదనువినుము. పూర్వము ఒకానొకప్పుడు దేవేంద్రుడు యజ్ఞము చేయుటకు ప్రయత్నించెను. అపుడు మహాముని సంఘములును, దేవతలును యజ్ఞవేదికను యేర్పరచిరి. యజ్ఞమునకు తగిన హోమాదులు చేయుచుండిరి. అపుడు పశువులను హింసించుటకు యోగ్యులగువారు పశువులను తెచ్చుటకై వెళ్ళిరి. మహామును లందరును కృపగలవారై దేవేంద్రునితో యిట్లనిరి. దేవేంద్రా! కృతయుగమందు తప్ప మరియొక కాలమందును యజ్ఞములయందు పశువులను హింసింపకూడదు. గనుక యిపుడు పశువులను హింసించుట ధర్మముగాదు. మూడుసంవత్సరములనాటి పాతబియ్యము తెచ్చి పశువులకు బదులుగా హోమము చేయుము. ఇట్లు చేయుట ధర్మము. దీనివలన హింసారూపమగు యజ్ఞముకంటె అధికఫలము కలుగును. ఈపశువులయందు నీవు కృపనుంచి విడిచివేయుము. అని మునులందరును చెప్పగా ఆ మాటలను దేవేంద్రుడు లక్ష్యపెట్టక వారితో యిట్లనెను. మునులారా! సర్వయుగములయందును, యజ్ఞకాలమందు పశువులను హింసింపవచ్చును. ఈప్రకారమే వేదము చెప్పుచున్నది. పశువులను అవశ్యము హింసింపవలెనని చెప్పెను. అపుడు దేవేంద్రునకును మునులకును అధికవివాదము జరిగెను. దేవతలంద

డును దేవేంద్రుని పక్షముగా మాటలాడిరి. అక్కడికి భూలోకమం మండెడి ఉపరిచరవసువనెడి రాజువచ్చెను. ఉపరిచరవసురాజు ధర్మ శాస్త్రవేత్తయైనందున దేవతలకును, మునులకును, మధ్యవర్తి యయ్యెను. దేవతలును, మునులును, ఉపరిచరవసువు చెప్పినట్లుగా ఒప్పుకొందమని సమ్మతించి తమ వివాదమును అతనితో చెప్పి తీర్పు చెప్పుమనిరి. ఉపరిచరవసురాజు దేవతలపక్షము జేరి సర్వయుగముల యందును యజ్ఞసమయములలో పశువులను హింసించవచ్చునని తీర్పు చేసెను. ఆ ఉపరిచరవసురాజు అట్లు పక్షపాతముగా తీర్పుచేసినందున ఆపాపముచేత అధోగతికి పోయెను.

జనమేజయమహారాజా! అహింసారూపసహితమగు యజ్ఞము శ్రేష్ఠమగుటకు సంశయములేదు. ఆ సక్తుప్రస్థుడు ఉంఛవృత్తిచేత సంపాదించుకొనగా యేర్పడిన పేలపిండిని తాను ఆకలిబాధ కలిగి యుండియు అతిథికిచ్చెను. ఆపుణ్యము మిక్కిలి శ్రేష్ఠమైనది. అందు చేత ఆముంగిస చెప్పినది సత్యముయేయగునని తెలిసికొనుము. అని వైశంపాయనుడు చెప్పగా జనమేజయు డిట్లనెను. మహాత్మా! వైశంపాయనమునీంద్రా! నీవు చెప్పిన అహింసాధర్మము శ్రేష్ఠమే యగును. నీవు చెప్పినమాటలకు నేను ఒప్పుకొంటిని. ధర్మమార్గము చేత లభించిన పదార్థము యింత శుభమును యిచ్చుచున్నదిగదా! ఆ సక్తుప్రస్థుని చరిత్రము ఆశ్చర్యమును పుట్టించుచున్నది. ధర్మ మార్గముచేత లభించిన పదార్థము శ్రేష్ఠమగుటకు తగిన కారణములను స్పష్టముగా చెప్పుమని యడుగగా వైశంపాయను డిట్లనెను.

## అగస్త్యమునియొక్క ద్వాదశవార్షిక యజ్ఞప్రభావము

జనమేజయమహారాజా! ఈవిషయమై సర్వలోకప్రసిద్ధమైన ఒక యితిహాసముకలదు. అది చెప్పెదను వినుము. పూర్వము ఒకా

నొకసమయమందు సర్వలోకపూజ్యుడగు అగస్త్య మహాముని పండ్రెండుసంవత్సరముల పర్యంతము ఒక గొప్ప యజ్ఞము చేయ దలచి దీక్షను ధరించెను. ఆ యజ్ఞమునకు మహాముని సంఘములు ఋత్విజులై ప్రకాశించుచు సకలక్రియలను చేయించిరి. అట్టి సమయమందు దేవేంద్రుడు వర్షము కురిపించక కరవుకలిగించెను. సకల ఓషధులును యెండి నశించినవి. ఆ సమయమున ఋత్విజులగు మహామునులు చూచి తమలో తామిట్లనుకొనిరి. ఋత్విజులారా! ఈ అగస్త్యుడు పండ్రెండు సంవత్సరముల పర్యంతము యజ్ఞము చేయ దలచి దీక్షవహించెను. ఈ పండ్రెండుసంవత్సరముల పర్యంతము అన్నదానము చక్కగా జరుగునో జరగదో తెలియదు. ఈ అగస్త్యుడు ధర్మమార్గమువలన లభించెడి ద్రవ్యముతప్ప ఇతరద్రవ్యమును గ్రహింపడు. వానయు కురియలేదు. ఈ యజ్ఞము యెట్లు జరుగునో యని ఋత్విజులు రహస్యముగా చెప్పుకొనుచుండిరి. ఆ మాటలను అగస్త్యుడు విని ఋత్విజులతో యిట్లనెను. ఋత్విజులారా! దేవేంద్రుడు న్యాయముతప్పక వర్షము కురిపించి లోకమును రక్షించినయెడల అందరము సంతోషించెదము. నాయజ్ఞము అన్నదానపూర్వకముగా పూర్తి కాగలదు. దేవేంద్రుడు వర్షమును కురిపించనియెడల నేనా దేవేంద్రునివలె వర్షముకురిపించి సకలలోకములను రక్షించెదను. గనుక ఈవిషయమై మీరు చింతింపవద్దు. అట్లు కానియెడల ఈమూడులోకములయందుండు సకల ధనధాన్య కోట్లను నిమిషములో తెచ్చి మీపాదముల సమీపమందుంచెను. వీనాశ్రమము గానియెడల ఉత్తర కురుభూములందు చక్కగా ధాన్యములు పండియున్నవి. మనకు కావలసిన ధాన్యమును సంకల్పమాత్రముచేత నేనిక్కడికి రప్పించెదనని అగస్త్యుడు చెప్పెను.

ఋత్విజులారా! నిర్మలములైన బియ్యములచేత హోమము చేసి దేవతలను తృప్తిపరచెదను. గనుక మీరు చింతింపవద్దు. నా యజ్ఞము చెడిపోజాలదు. ఏ విఘ్నములును రాజాలవు. మీరు భయ పడవద్దు. అని అగస్త్యుడు చెప్పగా ఆ మాటలను ఋత్విజులు విని యిట్లనిరి. మహాత్మా! అగస్త్యమునీంద్రా! నీవు ధర్మమార్గముచేత లభించు పదార్థమును ఉపయోగ పరచుచుందువు. అఖండమైన తపస్సును ఖర్చుచేసుకొనకుము. దేవేంద్రునిమీద కోపించుకొనవద్దు. జగత్తులయందుగల ధనమును తీసికొనిరావద్దు. ఉత్తర కురుభూముల యందుగల ధాన్యములను రప్పించవద్దు. నిర్మలములగు బియ్యముల చేత హోమములుచేసి ఆఫలమును అపేక్షింపవద్దు. మానిమిత్తమై ఇన్నివిధములుగా నీమనస్సు సంకల్పించుచున్నది. నీవు యేసంకల్పము నుంచుకొనవద్దు. మా తపస్సువలన మేము ధాన్యములను సంపాదించుకొని భుజించెదము. అని ఋత్విజులగు మహామునులు అగస్త్యునితో జెప్పిరి. ఇట్లు వీరు మాట్లాడుకొనుచుండగా దేవేంద్రుడు అనేక మేఘసమూహములను పంపించి వర్షము కురిపించెను. దేవేంద్రుడు బృహస్పతిని వెంటబెట్టుకొని అగస్త్యునిదగ్గరకు వచ్చి యిట్లనెను. మహాత్మా! అగస్త్యమునీంద్రా! నన్ను రక్షింపుమని ప్రార్థించి భక్తిపూర్వకముగా నమస్కరించెను. అప్పు డగస్త్యమహా ముని తనదగ్గరకు వచ్చిన దేవేంద్రుని సన్మానించి పూజించెను. మరియు శాంతవచనములచేత సంతోషముకలిగించి పంపించెను. దేవేంద్రుడు సంతోషించి బృహస్పతిని తీసికొని స్వర్గమునకు వెళ్ళెను. సర్వలోకములును సంతోషించెను. అంతట అగస్త్యుని యజ్ఞము పూర్తియయ్యెను. యజ్ఞసమాప్తియైనపిమ్మట అగస్త్యుడు వినయ భక్తులతో తన ఋత్విజులకు నమస్కరించి పూజించి పంపించెను.

వాడును సంతోషించి తమతమ నివాసములకు వెళ్ళిరి. ఇట్లు అగస్త్యుడు పశుహింసను చేయక యజ్ఞమును మనోహరముగా సుప్రయోగముగా జేసెను. అహింసారూపముగా మహాయజ్ఞము చేసిన అగస్త్యుడు సర్వలోక ప్రసిద్ధుడై ప్రకాశించెను. గనుక ధర్మమార్గము చేత లభించిన పదార్థముచేత చేయబడిన తపోమయమగు యజ్ఞము పండితులకు మనోహరమై యుండెను. అని వైశంపాయనమునీంద్రుడు జనమేజయమహారాజుతో చెప్పగా జనమేజయు డిట్లనెను.

## జమదగ్నిముని పితృదేవతల శాపముచే నకులమైపుట్టుట

మహాత్మా! వైశంపాయమునీంద్రా! పూర్వము ధర్మరాజు యజ్ఞకాలమందు సదస్యబ్రాహ్మణులతో ఒక ముంగిస మనుష్యభాషలో మాటలాడినట్లు చెప్పితివి. ఆముంగిస యెవరో దివ్యజ్ఞానియై యుండునని నేను తలచియుంటిని. దాని వృత్తాంతము అపుడే అడుగదలచితిని. వేరొకవిషయము మీరు చెప్పుచున్నందున అపు డడుగలేదు. అందువలన ఆముంగిస వృత్తాంతమును నాకు చెప్పదగిన యెడల చెప్పుమని యడుగగా వైశంపాయను డిట్లనెను. నీవు పుణ్యపురుషుడవై యున్నావు. నీవు వినదగని విషయ ముండనేరదు. కావున ఆ ముంగిస వృత్తాంతమును చెప్పెదను వినుము,

పూర్వము జమదగ్ని మహాముని మిక్కిలి నియమముతో పితృకార్యమును చేసెను. జమదగ్ని పితృకార్యముకొరకు హోమధేనువు యొక్క పాలనుపిండి ఒకకుండలో పెట్టి యుంచెను. అప్పుడు క్రోధాధిదేవత రూపముతో వచ్చి జమదగ్నియొక్క మనస్సును పరీక్షింపదలచి పొరపాటువలన జరిగినట్లుగా జమదగ్ని దాచిపెట్టిన పాలకుండ ద్రొక్కించెను. జమదగ్నిముని కోపించుకొనక యూరకుండెను.

క్రోధాధిదైవము తనమనస్సునందు మెచ్చుకొని జమదగ్ని మహాముసిని జూచి యిట్లనెను. జమదగ్నిమునీంద్రా! నేను క్రోధాధిదైవమును, నీమనస్సును పరీక్షింపదలచి యిచ్చటకు వచ్చినాను. నీవు పితృకార్యమునకు దాచిపెట్టిన పాలకుండను దొర్లించితిని. అందుకు నీవు కోపించుకొనలేదు. భృగువంశమందు పుట్టినవారు కోపవంతులని విని యున్నాను. లోకమందు భృగువంశస్థులు కోపవంతులని వాడుక గలదు. నీవును ఆవంశస్థుడవే యైనందున నిన్ను పరీక్షించదలచి వచ్చితిని. నీకు కోపముగలుగలేదు. గనుక, భృగువంశస్థులుకోపవంతులను వాడుక అబద్ధమేకాని నిజముకాదని యిపుడు స్పష్టమైనది. నీకు నేను ఓడితిని. నీ యఖండమగు తపస్సునందు నేనుండెదను. నాయందు దయయుంచి నన్ను జూడుము. నీకు నేనిపుడు చేసిన యపరాధమును క్షమింపుము. అని ఆక్రోధాధిదైవము ప్రార్థించెను. జమదగ్ని శాంత వాక్యములతో యిట్లనెను. క్రోధాధిదైవమా! నా విషయమై నీ వేమియు తప్పిదము చేయలేదు. కావున భయమును విడువుము. పితృదేవతలకు నేను దాచిన పాలను నీవు పారబోసితివి. అందుకు నీమీద నాకు కోపము కలుగలేదు. గాని పితృదేవతలకు కోపము కలుగును. నీవు శీఘ్రముగా వెళ్ళుము. అని జమదగ్నిముని చెప్పెను, క్రోధాధిదైవము ఆమాటలను విని భయపడి అపుడే అంతర్ధానమై వెడలెను. పితృదేవతలకు జమదగ్నిమహామునిపై కోపముగలిగి ప్రత్యక్షమై యిట్లనిరి. జమదగ్నీ! నీవు శ్రాద్ధముకొరకు సంకల్పించి దాచిపెట్టిన పాలను క్రోధాధిదైవము పారబోసెను. నీవు సహించి యూరకొంటివి. గనుక ముంగిసవై పుట్టుము. అని పితృదేవతలు జమదగ్నిమహామునిని శపించిరి. జమదగ్ని పితృదేవతలకు సాగిలపడి నమస్కరించి యిట్లనెను. మహాత్ములగు పితృదేవతలారా! క్రోధాధిదైవము చేసిన యపరాధ స్వల్పమనియు, తపస్వికి కోపము కూడ

దనియు తలచి నీ నా దైవముమీాద కోపించుకొనలేదు. గావున నా తప్పిదమును క్షమించి నాయందు కృపగలిగి నాకు శాపము నివర్తి యగు మార్గము చెప్పుడని నమస్కరించుచు వినయముతో ప్రార్థించెను. అంతట ఆ పితృదేవతలు కోపమును విడిచి కృపగలవారై జమదగ్నితో యిట్లనిరి. జమదగ్ని ! నీవెప్పుడైనను తగినమాటలచేత మహాధర్మమును ఆక్షేపించి సమర్థులగు బ్రాహ్మణులను మెప్పించెదవో ఆ దినమందు నీకు శాపము నివర్తింపగలదు. అని పితృదేవతలు జమదగ్ని శాపము నివర్తించు ఉపాయము అనుగ్రహించి చెప్పి వెళ్ళిరి. అంతట జమదగ్ని ముంగిసయై పుట్టిఉండెను; ఆ ముంగిససక్తుప్రస్థుని చరిత్రమును బ్రాహ్మణులకు చెప్పి ధర్మరాజు అశ్వమేధమును ఆక్షేపించి వారిని మెప్పించెను. అందువలన జమదగ్నికి ముంగిస జన్మము నశించి శాపము నివర్తించెనని తెలిసికొనుము. అని ధర్మరాజుయొక్క అశ్వమేధయజ్ఞ వృత్తాంతమును వైశంపాయనుడు జనమేజయునితో జెప్పెను.

ఇది శ్రీ కాశ్యపస గోత్రపవిత్ర మంత్రి వంశ పయః
పారావార పరిపూర్ణ సుధాకర లక్ష్మణామాత్య
పుత్ర లక్ష్మీనారాయణామాత్య ప్రణీతంబైన
తెనుగు వచనకావ్యంబగు శ్రీ మహా
భారతమందు అశ్వమేధపర్వము
ము గి సె ను.